THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

మే 1998 * రూ 7/-



పెళ్లి - కోలపల్లి ఈశ్వర్



# సచిత్ర విచిత్రం



## కొత్త ఆయుధం

అమెరికన్ విద్యార్థులు స్కూళ్ళకి పిస్తోళ్లు తెచ్చిన సంఘటనలు ఎన్నో! అయితే రేమిబెల్ అనే ఈ విద్యార్థి స్కూల్లో ఆత్మరక్షణ కోసం కొత్త పద్ధతి కనిపెట్టాడు.

జుట్టు మధ్య ఏడంగుళాల పొడవు సూదులని పద్దెనిమిదిని అమర్చుకున్నాడు. అది ఫేషన్‌గా భావిస్తారంతా. కాని ఎవరితోనైనా పోట్లాటకి దిగితే ఎద్దులా తలతో కుమ్మితే చాలు, ఆ సూదులు ప్రత్యర్థి శరీరంలో ప్రాణాంతకంగా గుచ్చుకుంటాయి.

# చతుర ప్రపంచం

## మహోపకారం చేస్తున్న చెట్లు

ఈరోజుల్లో మనుషులందరూ చిత్రవిచిత్ర మైన వ్యాధులకి గురవుతున్నారంటే అందుకు గల కారణాల్లో వాతావరణ కాలుష్యమొకటి అంటున్నారు శాస్త్రజ్ఞులు. చక్కటి ప్రాణవాయువును మనకు అందించి, మనం విడిచే బొగ్గుపులుసు వాయువును పీల్చి ప్రాణికోటికి మహోపకారం చేస్తున్న చెట్లను మనిషి ఈనాడు నిర్దాక్షిణ్యంగా నరికేస్తున్నాడు. ప్రభుత్వం కూడా ఈ విషయంలో తగినంత శ్రద్ధ తీసుకోవడంలేదన్న ఆరోపణలు వస్తున్నాయి. ఇలా అడవులను నాశనం చేయడంవలన అకాలవర్షాలు, వరదలు, అనావృష్టితో వచ్చే కరువు కాటకాలు ప్రజలను అనేక బాధలకుగురిచేస్తున్నాయి. భూకంపాలు కూడా ఇందువల్లనే. ముఖ్యంగా ఈ సమస్య హిమాచలప్రదేశ్‌లో ఎక్కువగా వుందంటున్నారు.

హిమాచల్ ప్రదేశ్‌లో ఇండో-టిబెట్ బోర్డర్ వద్ద వున్న గడ్వాల్‌లో నివశించే చండీప్రసాద్ భట్ ఈ విషయంలో శ్రద్ధతీసుకుని అడవుల రక్షణకోసం 'చిప్‌కో మూవ్‌మెంట్'ని ప్రారంభించి 'రామన్ మెగసేసే' అవార్డును కూడా పొందారు.

భట్ పెద్దగా చదువుకున్న వ్యక్తికాదు. చాలా చిన్నతనంలోనే తల్లితండ్రులను పోగొట్టుకున్నాడతడు. ఎలాగోలా ప్రైమరీ స్కూల్ చదువును పూర్తిచేసి గడ్వాల్ మోటార్ యూనియన్‌లో క్లర్క్‌గా ఉద్యోగం ప్రారంభించాడు. సర్వోదయ సేవకునిగా పనిచేసిన ఈయన 1956లో ఉత్తరకాశీ నుంచి పిథోర్‌గఢ్ వరకు మొత్తం ఉత్తరఖండమంతా పర్యటన చేశాడు. ఆ పర్యటనలో ఆయన తెలుసుకున్న ముఖ్యవిషయమేమంటే మనిషికి, అడవికి చాలా దగ్గరసంబంధం వుందని. చైనా యుద్ధం తరువాత టిబెట్‌కు దగ్గరగా వున్న ఎన్నో ప్రాంతాల్లో అభివృద్ధి కార్యక్రమాలు జరిగాయి. చిన్నతరహా పరిశ్రమలను ప్రోత్సహిస్తామని ప్రగల్భాలు పలికిన ప్రభుత్వం కోట్లాది పెట్టుబడులు గల పెద్దపెద్ద పరిశ్రమలను మాత్రమేప్రోత్సహించింది. అప్పుడు చండీప్రసాద్ భట్ తనస్నేహితుల్ని కొందరిని కూడగట్టుకుని 'గ్రామస్వరాజ్ మండల్'ని స్థాపించి పల్లెల్లోని చేతిపరిశ్రమల ప్రోత్సాహానికి కృషి చేశారు.

భూమికి, అడవికి గల అసలైన సంబంధం 1980 జూలై 20 వ తేదీన తనకి అవగతమైందంటాడు భట్. ఆరోజు అలకనందానదికి వచ్చిన పెద్ద వరదలు ఎన్నో వేల ఎకరాల వ్యవసాయ భూముల్ని నాశనం చేశాయి. పశునష్టం, జననష్టం కూడా జరిగింది. పాతాళగంగ, గరుడగంగ ఈ రెండింటివద్ద గల పర్వతాలను ఎక్కి పరిశీలిస్తే తెలిసిందేమంటే ఆ ప్రాంతాల్లోని అడవుల్ని వేలం వేయటంతో అపారవృక్ష సంపద నాశనమయి, భూకంపం వచ్చిందని. దీనివల్ల ఎంతో మట్టి వచ్చి గంగలో కలిసి నీరు కలుషితమయి తాగడానికి పని

కవర్‌ఫోటో : వి.శివసత్యమూర్తి

కిరాకుండా పోయింది.

ఇవన్నీ చూశాక ఇలాంటి ప్రకృతి వైపరీత్యాలన్నీ అడవులను నరకడం వల్లనే వస్తున్నాయని తెలిసి ఈ అడవుల్ని తన పరిధి మేరకు రక్షించాలని సంకల్పించుకున్నాడు భట్. ఒక తల్లి తన బిడ్డని గుండెలకి పొదుపుకొని కాపాడినట్టే, చెట్లని బిడ్డల్లా భావించి కాపాడుకోవాలనుకున్నాడు భట్

హిమాచల్ ప్రదేశంలో గోపేశ్వరంనుంచి తను కార్యక్రమాల్ని ప్రారంభించారు భట్ తమ ఆందోళన ఒక్క గడ్వాల్‌కే పరిమితం కాదనీ, ప్రజల సహాయసహకారాలుంటే దేశంమొత్తంమీద అటవీ సంపదని సురక్షితంగా వుంచుకోవచ్చనీ అంటారు భట్.

చిప్‌కో ఆందోళన సామాన్యుని సమస్యల తోనే ప్రారంభమయింది. ప్రకృతి వైపరీత్యాల్లో ముందుగా నష్టపోయేది సామాన్యుడే. కనుకనే అడవులు నరకడంవల్ల వచ్చే కష్టనష్టాలను సామాన్యులే చక్కగా




బృదం. వారి పనులకు విఘ్నం కలిగించేందుకు కాంట్రాక్టర్స్ ఎన్ని ప్రయత్నాలు చేసినా తమ కార్యకుశలతతో, కృషితో మొక్కల అవసరాన్ని, ప్రాశస్త్యాన్నీ వివరిస్తూ, ప్రజలను తమవైపు తిప్పుకోగలిగారు. పత్రికలుకూడా భట్ బృదం కార్యక్రమాలను, సేవానిరతిని ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేశాయి. చివరికి అక్కడి అడవులలో 1200 చదరపు మైళ్ల మేరకు 'రిజర్వ్‌డ్ ప్రాంతం'గా ప్రకటించింది ప్రభుత్వం. ఇది చిప్‌కో ఆందోళన యొక్క అతిపెద్ద విజయం.

అర్థంచేసుకుంటారు. భట్ బృదం వారు ఈ విషయంలో ప్రజల్ని ఎడ్యుకేట్ చేసేందుకు క్యాంప్‌లను కూడా నిర్వహించేవారు. మరి 'అడవులని' అసలు ఉపయోగించుకోకపోతే వంటచెరకు ఎలా? అన్న ప్రశ్నకు కూడా వారు కార్యరూపంలో సమాధానంచెప్పారు. గ్రామాలచుట్టూ వున్న వేస్ట్‌లాండ్‌లో పెద్ద పెద్ద వృక్షాలను పాతారు.

ప్రభుత్వం నిర్వహించిన 'సోషల్ ఫారెస్ట్రీ



ప్రోగ్రాములు అనుకున్నంత విజయవంతంగా నడవలేదంటారు భట్. ప్రభుత్వం కేవలం యూకలిప్టస్ చెట్లకే ప్రాధాన్యత ఇచ్చింది. అది ఆరోగ్యకరమైన పద్ధతికాదు. ఇంకాఎన్నోరకాల వృక్షాలను నాటించాలనీ దానివల్ల వాతావరణ సమతౌల్యం ఏర్పడుతుందనీ అంటాడు భట్.

చిప్‌కో ఉద్యమానికికూడా ప్రభుత్వం నుంచి తామెన్నో సమస్యలను ఎదుర్కోవలసి వచ్చిందనీ, కాంట్రాక్టర్స్ రాజకీయనాయకులకు లంచాలు తినిపించి, తమమీద వత్తిడి తెచ్చేలా చేసేవారని, అయితే వాటన్నిటినీ కాదనిఎంతో స్ఫూర్తితో ఆ ఉద్యమాన్ని విజయవంతం చేయగలిగామనీ అంటాడు భట్.

ఈ ఉద్యమంమీద బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్‌వారు ఓ డాక్యుమెంటరీ చిత్రాన్ని తీశారు. 'అవార్డ్ వచ్చిందన్న సంతోషం కన్నా, దానికి మేము చేసిన కృషే ఎంతో సంతృప్తినిచ్చింద'ంటాడు భట్. తానున్నా లేకపోయినా చిప్‌కో ఉద్యమం కొనసాగాలన్నది ఆయన జీవితాశయం.

---

## సరిహద్దు ద్వారాలు బంద్

ఆ మధ్య నైజీరియా ప్రభుత్వం తన దేశంలో స్థిరపడిన విదేశీయులందరినీ 15 రోజుల్లోగా దేశం విడిచి పోవాలనీ లేదా జైళ్లలోకి తోసి కఠినశిక్షలు విధిస్తామనీ ఆర్డర్లు జారీ చేసింది.

ఫలితంగా అక్కడ నివశించే వేలాది విదేశీయులు ఇబ్బందుల పాలయ్యారు. ముఖ్యంగా ఘనానుంచి వచ్చి అక్కడ స్థిరపడిన పదిలక్షలమంది ప్రజల సంగతి మరీ అన్యాయమైపోయింది.

నిజానికి ఆ పదిలక్షలమందీ ఎంత స్వదేశీయులే అయినా ఒక్కసారిగా వచ్చిపడితే భరించే శక్తి 'ఘనా'కే లేదు. ఘనాకీ, నైజీరియాకీ మధ్య దూరం 200 కి.మీ.లు మాత్రమే అయినా మధ్యలో టోగో మొదలైన కొన్ని ఆఫ్రికన్ దేశాలున్నాయి. అందువలన ఆ ఘనా ప్రజలు సముద్రమార్గం ద్వారానే తమ దేశానికి చేరుకోగలరు. కానీ అన్ని లక్షలమందికి అది కష్టతరమయిన విషయం.

10 కోట్లమంది ప్రజలున్న నైజీరియా ఆఫ్రికాలోనే పెద్ద దేశం. 9,23,773 చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల ఈ దేశం 1960 అక్టోబర్‌లో స్వాతంత్ర్యాన్ని పొంది అటుపైన అభివృద్ధివైపు పయనిస్తోంది. 1978లో ఆదేశ పౌరుల తలసరి ఆదాయం సంవత్సరానికి 5600 రూపాయలు. ఇది భారతదేశ తలసరి ఆదాయానికి 4 రెట్లు ఎక్కువ.

ఇంత త్వరితంగా ఈ దేశం అభివృద్ధి చెందడానికి గల కారణం అక్కడున్న నూనె వనరులు. అక్కడ ఉత్పత్తి అయిన నూనెల్లో 93 శాతం ఎగుమతి అవుతుంది. పెట్రోలు ధర పెరిగిపోయిన కాలంలో నైజీరియా ఆర్థిక పరిస్థితి అంచనా వెయ్యడానికి కూడా కష్టమయింది.

ఆఫ్రికాలోని చాలా దేశాలు పేదరికంలో మగ్గుతున్నాయి. దాంతో ఎంతోమంది పనులకోసం, బతకడంకోసం నైజీరియా వచ్చి స్థిరపడిపోయారు. కానీ నైజీరియా ప్రభుత్వం స్వదేశీ విదేశీ వ్యక్తుల మధ్య ఎంతో వ్యత్యాసం చూపిస్తూ నైజీరియనులకు రోజు కూలి 12 రూపాయలిస్తే, విదేశీయులకు 5 రూపాయలు మాత్రమే ఇచ్చేది. నైజీరియా కార్మికుల్లో అధిక శాతం ఘనాదేశీయులే. దుర్భరదారిద్ర్యంలో మగ్గుతోన్న ఘనానుండి వలసలు ఎక్కువ. ఆమధ్యకాలంలో పెట్రోలు ధర పడిపోయిన కారణంగా చాలా ఆయిల్ కంపెనీలు ఎంతో





మందిని పనులనుంచి తొలగించవలసిన పరిస్థితి ఏర్పడింది. దాంతో ఎన్నో కల హాలు, కొట్లాటలు జరిగాయి. వాటి వెనుక విదేశీ వర్కర్ల ప్రమేయం ఎక్కువని భావిం చిన ప్రభుత్వం విదేశీయులందరినీ దేశం విడిచి వెళ్లమని ఆజ్ఞలు జారీచేసింది.

క్రూడాయిల్ కి సంబంధించిన ఇంటర్నేష నల్ మార్కెట్ కూడా అంత ప్రోత్సాహక రంగా లేదు. ఆయిల్ ధర గణనీయంగా పడిపోయింది. ఈ పరిస్థితిని ఎదుర్కోడా




నికి 'ఓ.పి.ఇ.సి.' (ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రో లియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్) తన సభ్యదే శాలను పెట్రోలు ఉత్పత్తులను తగ్గించమని అడిగింది. నైజీరియాకి కూడా ఇందులో సభ్యత్వముంది. 20 లక్షల బ్యారెల్స్ ఉత్ప త్తిని 13 లక్షల బ్యారెల్స్‌కి తగ్గించింది నైజీ రియా. తత్ఫలితంగా నిరుద్యోగ సమస్య పెరిగింది. నైజీరియన్ పత్రికలు, ప్రతిపక్ష పార్టీలు కూడా దీనికంతటికీ కారణం విదేశా లనుంచి వచ్చి స్థిరపడిన ప్రజానీకమే అని విమర్శించటంతో శాంతి భద్రతల పరిస్థితి అదుపుతప్పే పరిస్థితి ఏర్పడింది. ఎక్కువ మంది విదేశీయులు నైజీరియా ఉత్తర ప్రాంతంలో స్థిరపడ్డారు. అక్కడ జనాభాలో ముస్లిములెక్కువ. నైజీరియాలో 47 శాతం మంది ముస్లింలు, 50 శాతం క్రిస్టియన్లు. ఉత్తర ప్రాంతంలో మాత్రం క్రిస్టియన్లను మైనారిటీవర్గంగా చెప్పుకోవచ్చు.

కనో, కడునా, మైదూగ్రీ మొదలైన ఉత్తర ప్రాంతపు నగరాల్లో అప్పుడప్పుడు మతకల హాలు చెలరేగి క్రైస్తవులు అభద్రతా వాతా వరణంలో బతుకుతూవుంటారు. పైగా నైజీ రియాలో స్థిరపడిన విదేశీయుల్లో చాలా మంది ముస్లిములే.

అక్కడ 13 సంవత్సరాల మిలిటరీ పాలన తరువాత 1979లో మొట్టమొదటిసారి ఎన్ని కలు జరిగాయి.

ఇండియానుంచి కూడా అనేకమంది నైజీ రియాకి, ఇతర గల్ఫ్ దేశాలకి వెళ్ళారు. అయితే ప్రస్తుతం అలా వెళ్లడం అంత సుల భంగా లేదు. నైజీరియా తన దేశసరిహద్దు ద్వారాలను మూసివేసిందని వినికిడి.

# ఏరిన ముత్యాలు

★ రూపాలు వేరైనా హృదయాలు ఒక్కటి కావడమే నిజమైన మైత్రి

-అరిస్టాటిల్

★ శత్రువును క్షమించడం సులభం కానీ, స్నేహితుని క్షమించడం చాలా కష్టం

-మదాం డరోత్ డెలూజీ

★ నీ స్నేహితులను రహస్యంగా మందలించు, బాహాటంగా ప్రశంసించు

-సైరన్

★ స్నేహితులను ఎన్నుకునేటప్పుడు వెనుకా ముందూ ఆలోచించు. ఎన్నుకున్న తర్వాత వారితో స్నేహం దృఢంగా కొనసాగేటట్లు చూడు

-సోక్రటీస్

★ పదిమందిలో మంచిపేరు తెచ్చుకోవాలనుకుంటున్నావా? అయితే మంచి వాళ్లతో స్నేహం చేయి

-జార్జి వాషింగ్టన్

★ సంపద కోసం సద్గుణాలను కానీ, అధికారం కోసం స్వేచ్ఛను కానీ విక్రయించకు

-బెంజిమన్ ఫ్రాంక్లిన్

★ నీకు మనశ్శాంతి కావాలంటే ఇతరుల దోషాలెన్నబోకు. నీ దోషాలను నీవు చూసుకో

-శారదామాత

★ ఆత్మవిశ్వాస పూరితులగు కొందరు వ్యక్తుల చరిత్రయే ప్రపంచచరిత్ర

-స్వామి వివేకానంద

★ దైవకృప, అదృష్టం నిన్ను వరించినా, గర్వాన్ని మాత్రం నీవు వరించకు

-కాళిదాసు

★ ఒక పని చేయించుకున్నందులకు ధన్యవాదాలు చెప్పడమంటే భవిష్యత్తులో మరొకపని చేయించుకోవడానికి పునాది వేసుకోవడమే

-సర్‌రాబర్ట్ వాల్‌పోల్

★ ఎంత తీయనిదైనా భవిష్యత్తును నమ్మకు. గతించిన భూతకాలాన్ని విస్మరించు. వర్తమానంలో నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు.

-లాంగ్‌ఫెలో

★ మనిషి గొప్పతనానికి గీటురాయి అతని వినమ్రతే

-జాన్‌రస్కిన్

---

సేకరణ: పెండేకంటి ఆంజనేయులు

# 'మనిషి చేతి దేవత' పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన వింజమూరి విజయశాంభవి నవల 'మనిషి చేతి దేవత'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఆలోచనాత్మకం

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

**పా**ఠకులకు ఆనందాన్ని మాత్రమే కాక వారిలో ఆలోచన రేకెత్తించి తద్వారా వాస్తవాన్ని అర్థంచేసుకునే సునిశిత దృష్టిని కలగజేయడం కూడా పత్రికల, రచయితల బాధ్యతని మరోసారి రుజువు చేసారు వింజమూరి విజయశాంభవిగారూ, 'చతుర' వారూ! మొదట అవసరం తర్వాత అసహాయత వల్ల తనకిష్టంలేని జీవితాన్ని 'దేవత' రూపంలో గడిపే తులసి, స్త్రీని దోచుకోవడం హక్కుగా మార్చుకున్న వారికి ప్రతిరూపంగా శ్రీనివాసరావు, ఆప్యాయతకు మారురూపంగా తులసి చినమావయ్య, సాటి మనిషిపట్ల తనకున్న బాధ్యత నిర్వర్తించాలని తపించే ఫణీంద్ర, అతని ప్రయత్నానికి అండగా నిలిచిన శంఖారావం ఎడిటర్, తులసికి సాయంచేసే నర్సయ్య, విధిలేక కూతుర్ని దేవతగా మార్చినా చివరలో ఆమె స్వేచ్ఛకై జీవితాన్ని త్యాగం చేసిన 'భూదేవి' ఈ కథలోని సజీవపాత్రలు. కథలో మంచీ, చెడూ ఉన్నాయి. అమాయకత్వం, అసహాయత, ప్రేమ, దోపిడి, భక్తి ఉన్నాయి. ఆ భక్తితో ఆడుకునే బలహీనత ఉంది. నమ్మకం, మూఢనమ్మకం కాకూడదనే హెచ్చరిక ఉంది.

కథలో బలమైన పాత్ర తులసి తండ్రి కిష్టయ్య. అతను ఆమె దృష్టిలో కథానాయకుడు. అయితే తులసి తండ్రిని గురించి తలచుకుని బాధపడటం మినహా అనుసరించే ప్రయత్నం చేసినట్టుగా ఎక్కడా అనిపించదు. తనను ఎవరైనా ఈ స్థితినుంచి బయటపడేయాలనుకుంటుందే తప్ప తనకు తానుగా ప్రయత్నించినట్టు ఎక్కడా కానరాదు. తండ్రి ప్రభావం తులసిపై ఉన్నట్టుగా అనిపించదు. ఫణీంద్ర వచ్చేవరకు ఆమె ప్రయత్నమేమీ లేకపోవటం, ఏ తెగువా ప్రదర్శించకపోవడమే అందుకు తార్కాణం...

ముగింపులో పారిపోయి రావడంకాక ఏ ప్రజల బలహీనతలతో శ్రీనివాసరావు ఆడుకున్నాడో, వారిద్వారానే అతనికి బుద్ధి చెప్పించి, అతనితోనే తనను 'దేవత'గా మార్చిన వైనం చెప్పిస్తే బాగుండేది. అందుకు అతను సృష్టించిన దేవత అవతారాన్ని అడ్డుపెట్టుకునైనా సరే.

ఈ నవలకు ఆయువు పట్టుగా సరైన ముగింపు లేకపోవడం, కొంత అపశ్రుతిగా అనిపించినా... కథకు ఇతివృత్తం ఎన్నుకోవడంలో రచయిత్రి ధైర్యాన్ని ప్రదర్శించారు.

-కె.బి. కామాక్షి,
విజయవాడ-520 111

## అమానుషాల దర్పణం

*(ద్వితీయ బహుమతి రు.75/- పొందిన సమీక్ష)*

**స**నాతన సంప్రదాయానికీ, భక్తికీ నెలవైన మనదేశంలో మహిమాన్వితులుగా పేరు



పొందిన సన్యాసులకు, బాబాలకు అమ్మలకు లోటులేదు. వీరిలో అమాయక ప్రజల భక్తి విశ్వాసాలను తమ స్వార్థపరత్వానికి వాడు కునేవారి సంఖ్యే ఎక్కువ. అయితే ఇక్కడ విచారపడవలసిన విషయం గొప్పగొప్ప చదువులు చదివిన సైంటిస్టులు, డాక్టర్లు, లాయర్ల దగ్గరనుండి ప్రధాని, రాష్ట్రపతి వంటి ఉన్నత పదవుల్లోవున్న మేధావుల వరకూ అందరూ మతరహిత లౌకిక ప్రజాస్వామ్యవ్యవస్థలో బాబాల ముందర సాగిల పడడం! ఈ బాబాలు చూపే ఘనతర మహాత్మ్యాలు ఏమిటి... అవి కూడు గుడ్డలులేని అట్టడుగు ప్రజానీకానికి ఎంతవరకూ ఉపయోగిస్తాయి? కొందరు బాబాలైతే సాంఘిక ప్రయోజనాలకోసం మేము ఎంతో చేస్తున్నాం అంటూ స్కూళ్ళు, కాలేజీలు, ఆసుపత్రులు కట్టిస్తున్నారు. అవి మామూలు మధ్యతరగతి, క్రిందితరగతి ప్రజలకెంతవరకూ అందుబాటులో ఉంటున్నాయన్నది ఆ బాబాలకే తెలియాలి. కొందరు బాబాల చరిత్రలు చదివితే అసంబద్ధమైన, అసహజమైన సంఘటనలు ఎన్నో కన్పిస్తాయి. ఈ బాబాలు, వీళ్ళనడ్డం పెట్టుకొని తమ పబ్బం గడుపుకొనే 'శ్రీనివాసరావు'లూ ప్రజలనెంతగా వంచిస్తున్నారో అక్షరసత్యాలుగా వర్ణించారు వింజమూరి విజయశాంభవిగారు తమ 'మనిషి చేతి దేవత' లో.

అసలు దేవుడంటే ఎవరు. గుళ్ళో పూజలందుకొనే రాతిబొమ్మా!? 'దైవం మానుషరూపేణ' అన్నారు. ఓ బుద్ధుడు, ఓ మహాత్మా గాంధీ, ఓ మదర్ థెరిస్సా మానవరూపంలోని మహిమాన్వితులు. అవకాశం ఉండీ, శక్తి సామర్థ్యాలు ఉండీ అన్నిటినీ త్యజించి లోకంకోసం పాటు పడ్డ మహా మనీషులు వాళ్ళు అందుకే ఈనాటికీ యుగాలుగా గుడులలో... గుండెగుడులలో కొలువై ఉన్నారు. సర్వసంగ పరిత్యాగులం అంటూ... పై ముసుగుగా ఆధ్యాత్మికోపన్యాసాలు చేస్తూ ఆశ్రమాలకు విరాళాల పేరిట కోట్లకు కోట్లు గడిస్తున్న నేటి బాబాలు, సన్యాసులు, అమ్మలు.. మనుష్యులే అయినా దైవాంశసంభూతులు కారు. సంసారసాగరంలో కొట్టుమిట్టాడుతున్నా పరోపకారత్వం ఉన్న 'కిష్టయ్య' లాంటి వ్యక్తులే ఆ కోవకి చెందుతారు.

భక్తి 'మూఢత్వం' కాకూడదు. మతం 'మత్తుమందు' కాకూడదు. అవి పడగనీడలు కాక పూలగొడుగులై పరిమళాలు వెదజల్లాలి. ఆస్వాదించే మనసే గుర్తించాలి అవి పూలగొడుగులా... పడగనీడలా అన్నది. అప్పుడు సమాజానికి చీడపురుగుల్లా పరిఢవిల్లుతున్న దొంగ బాబాలకు, సన్యాసులకు, వేలుముంచు స్వాములకు, 'నగ్నదేవత'లకు నిలువనీడ కూడా దొరకదు. 'పేటూరమ్మ'లాంటి ఏ కొందరో తెర మీది బొమ్మల్లాంటి వారైనా నష్టపడేది మాత్రం సమాజం. తనకెందుకులే అని వదిలేయకుండా ప్రాణాలకు తెగించి తులసిని బాహ్య ప్రపంచంలోకి తెచ్చిన 'ఫణీంద్ర' అభినందనీయుడు. చక్కని కుటుంబ కథా నేపథ్యంలో సాగిన "మనిషి చేతి దేవత" మనిషి చేసే అమానుషాలకో మచ్చుతునక.

—వి.యస్.యన్. మూర్తి,
తణుకు- 534 211

## మత్తు వదలిన మతం

*(మూడవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)*

ఈ నెల చతుర నవల "మనిషిచేతి దేవత" ఇతివృత్తం అతిసున్నితమైనదేకాక ఆలోచింపచేసేది. ఎందుకంటే ఈ ప్రపంచంలో అన్ని మత్తులకంటే గొప్ప మత్తు "మతం". పవిత్ర భారతదేశంలో దేవుడు, మతంపట్ల వున్న నమ్మకం గాఢమైనదేకాక భయంకరమైనది కూడా. తమ నమ్మకానికి విఘాతం కలిగితే జనం సహించరు. దీని ఆధారంగానే ఎన్నో రాజకీయ పార్టీలు కొత్త వూపిరి




పోసుకుని బలోపేతం అవుతున్నాయి. మన దేశంలో వున్న బాబాలు కానీ, అమ్మలు కానీ ఎంతో శక్తిమంతులు. రాష్ట్రపతిని కూడా తమ చుట్టూ తిప్పుకోగల సమర్థులు. అది మతంపట్ల జనానికి వున్న భయం, గౌరవం.

కొందరు జన్మతః జ్ఞానులు. మరికొందరు జీవితాన్ని మథించి, శోధించి జ్ఞానులుగా అవుతారు. కాని మరికొందరిని "విధి" బలవంతంగా జ్ఞానులుగా ముద్రపడేలా చేస్తుంది. ఈ నవలలోని 'అమ్మ' రామతులసి అలాంటి వ్యక్తి. కష్టమంటే ఏమిటో తెలియకుండా పెంచిన తన కలల హీరో తండ్రి మరణించిన తర్వాత కొంత కష్టం అనుభవించిన రామతులసి తన మేనమామ అయిన శ్రీనివాసరావు చేతిలో దేవతగా అవతరించింది. కన్నవారికి దూరం కావించబడింది.

అందరికీ శాస్త్రం చెప్పే బల్లిచందాన, అందరి భయంకర సమస్యలకు, పరిష్కారం తీరని కోర్కెలకు తీరే మార్గం చూపగలిగిన 'అమ్మ' తన చిరకాల వాంఛ ఒక మంచి భర్తకు మంచి భార్యగా కావటానికి మార్గం తెలియక కొట్టుమిట్టాడింది. మథనపడింది. సంతానహీనులు, రోగులు, వ్యాపారవేత్తలు ఎంతోమంది ఆమె కోసం ఎదురుతెన్నులు చూస్తే, తను మాత్రం తనకు బంగారుపంజరంనుండి బయటపడవేయగల హీరోకోసం చూసింది. తామరాకుమీది నీటిబొట్టులాగా జీవించింది.

"అమ్మవార్లనీ, బాబాల్నీ, స్వాముల్నీ నమ్మేవారితోబాటు నమ్మనివారూ విమర్శకులూ ఉన్నారు. ఉంటారు. వాళ్ళకి ఒక విన్నపం. నాలాంటి అభాగ్యురాళ్ళూ, అభాగ్యులు అయిన దగాచరితలు వారిలో వున్నారేమోనని తెలుసుకోవడానికి కృషిచేసి వారిమీద జాలి చూపించడానికి ప్రయత్నించండి. ఎందుకంటే వారు తెర మీద బొమ్మలు మాత్రమే" అన్న తులసి మాటలు అక్షరసత్యాలు.

సున్నితమైన ఇతివృత్తం ఎన్నుకొని, ఎన్నో మలుపులు తిప్పి చివరకు అతిసున్నితంగా ముగించగలిగిన రచయిత్రి వింజమూరి విజయశాంభవి అభినందనీయురాలు.

**–యస్. హరనాథబాబు**
హైదరాబాద్-500 044.

## గుర్తుండే నవల

*(నాలుగువ బహుమతి 50/– పొందిన సమీక్ష)*

**మ**నిషిచేతి దేవత' నవల కొత్తదైన ఇతివృత్తంతో ఆద్యంతమూ హృద్యంగా సాగిపోయింది. ఒక వెరైటీ అంశాన్ని తీసుకొని, పాఠకులను ఆలోచింపచేసేలా రచించడంలో సఫలీకృతులయ్యారు రచయిత్రి. శ్రీనివాసరావులాంటి స్వార్థపరుల ధనదాహానికి బలైపోతున్న 'తులసి'లాంటి అమాయక బాలిక జీవితాన్ని చక్కగా విశ్లేషించారు. పసిప్రాయంలోనే మేనమామ స్వార్థానికి గురై బంగారు పంజరంలో బందీగా బతకవలసి వచ్చిన తులసి దీనస్థితిని కళ్ళకు కట్టినట్లు వివరించారు. అందరు అమ్మాయిల్లాగే తానూ ఓ ఆదర్శగృహిణిలా బతకాలన్న తులసి కోరిక అత్యంత సహజంగా ఉంది. తనను ఆప్యాయంగా అక్కున చేర్చుకొని, ఆత్మీయంగా పలకరించే ఓ తోడు కోసం పరితపించిన తులసి వేదనను చక్కగా చిత్రించారు. కారుచీకటిలో కాంతిరేఖలా 'ఫణీంద్ర' ఆగమనం, ఆమె జీవితానికి కొత్త మలుపు. కేవలం మాటలలోనే ఆదర్శానికి పరిమితం గాకుండా, చిత్తశుద్ధితో 'తులసి' స్వేచ్ఛకోసం పాటుపడిన 'ఫణీంద్ర' పాత్ర అందరికీ ఆదర్శంగా నిలుస్తుంది. లోకమంతా మూర్ఖంగా ఆమెను దేవతగా ఆరాధిస్తున్నా, తాను మాత్రం ఆ ఊబిలో కూరుకుపోక, ఆమెలోని 'మనిషి'ని గుర్తించి, ఆమెకు చేయూతనందించిన ఫణి పాత్ర



అభినందనీయం. అతణ్ణి చూశాకైనా ఈనాటి యువతరానికి కనువిప్పు కలుగుతుందని ఆశిద్దాం. తమ కృషిమీద తమకే నమ్మకం లేక గుడ్డినమ్మకాలతో ఏ 'స్వాము' లనో, 'అమ్మ'లనో ఆశ్రయించి, కాలం వెళ్ళబుచ్చే సోమరి జనాలందరికీ గుణపాఠం నేర్పుతుంది ఈ నవల. ఈ నవలలో అన్నిటికన్నా మిన్న తులసి తండ్రి 'కిష్టయ్య' పాత్ర. కూలివాడైనా తన ధీరోదాత్త లక్షణాలతో, స్వయంకృషితో, ఆత్మస్థైర్యంతో జీవితాన్ని మలుచుకొని, సంఘంలో పదుగురూ మెచ్చేలా జీవితాన్ని గడిపిన 'కిష్టయ్య' పాత్ర చాలాకాలం వరకు పాఠకుల గుండెల్లో గుర్తుండిపోతుంది. ముఖ్యంగా తులసి బాల్యజీవితాన్ని చక్కని గ్రామీణశైలిలో, పాఠకులు ఆ కథనంలో లీనమైపోయేటట్లు అద్భుతంగా చిత్రీకరించారు రచయిత్రి. 'మనిషిచేతి దేవత' పేరు నవలకు అతికినట్లుగా సరిపోయింది. స్వయంకృషితో అభివృద్ధి సాధించమని 'ఏ పుట్టలో ఏ పాముందో' అన్న మెట్టవేదాంతాన్ని వదిలిపెట్టమని, సమాజానికి ఉద్బోధిస్తూ సందేశాత్మకంగా నిలుస్తుంది ఈ నవల.

**–జి.వి. సునంద,**
గూడూరు-524 101.

## సృష్టికి ప్రతిసృష్టి

*(అయిదవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)*

**వి**శ్వామిత్రుడి తరువాత మనిషి తన మేధస్సుతో సృష్టికి ప్రతిసృష్టిచేసి ప్రకృతినే శాసించగలిగే స్థాయికి దాదాపుగా చేరుకున్నాడు. వీచే వేడిగాలిని చల్లబరచగలుగుతున్నాడు. వాన రాకడ తెలుసుకోగలుగుతున్నాడు. గ్రహాల అంతర్భాగాలను శోధించగలుగుతున్నాడు. ఇవన్నీ చూసి మనిషికి ఇక తన అవసరంలేదనుకుని పాపం దేవుడు శిలగా మారిపోయాడు. అసలు దేవుడి అంతుతెలియక మనిషి దేవుళ్ళనే సృష్టించడం మొదలుపెట్టాడు. కొంతమంది తమకుతామే దేముళ్ళుగా మారిపోతే, మరికొంతమంది బలవంతంగా మార్చబడ్డ దేవతలు. అలా వచ్చినవారే ఈ బాబాలు, స్వాములూను. అలా సాటిమనుష్యుల కొరకు మనిషిచేత సృష్టించబడిన దేవతే పేటూరమ్మ.

తులసి పేటూరమ్మగా మారి ఆ పరిస్థితులకి ఇమడలేకపోయిన విషయం కొంతమందికి ఆశ్చర్యం కలిగించవచ్చు. పళ్లు, పాలు తీసుకుంటూ ఎ.సి. రూమ్‌ల్లో కూర్చోవడానికి తులసి ఎందుకు ఇబ్బందిపడిందో కొంతమందికి అర్థంకాకపోవచ్చు.

కానీ స్వశక్తినే నమ్ముకుని నిలబడిన కిష్టయ్యలాంటి వ్యక్తికి పుట్టిన తులసి, అడుగడుగునా అబద్ధాలు చెబుతూ, అందరినీ మోసగిస్తూ పేటూరమ్మగా బతకాల్సివచ్చినందుకు తట్టుకోలేకపోవటం ఏమాత్రం ఆశ్చర్యం కలిగించదు.

మోసగించబడుతున్నామని తెలిసి కూడా, ఏ పుట్టలో ఏ పాముందో అన్న సిద్ధాంతాన్ని నమ్ముకుని జీవించే మనుషులున్నంతకాలం ఎంతమంది ఫణీంద్రలు కలిసినా శ్రీనివాసరావులాంటివాళ్ళని ఏమీ చేయలేరు. పేపర్లలో ప్రచురించబడి, అలజడి సృష్టించబడితేకాని ఒక అవతారం సమాప్తం కాకపోతే ఎన్ని విషయాలని పేపర్లు వెలుగులోకి తీసుకురాగలవు. మళ్లీ మన పక్క ఊరికే మరో బాబావస్తే కథ మామూలే. మనలో ఎంతమందో కిష్టయ్యలు, ఫణీంద్రలు, చిన్నమామయ్య, నారాయణలు ఉన్నారు. వాళ్ళల్లోని మానవత్వం మనం గుర్తిస్తే చాలు, పేటూరమ్మల్లాంటి దేవతల ఆశ్రయంకోసం పాకులాడవలసిన అవసరం లేదని రచయిత్రి వింజమూరి విజయశాంభవిగారు చక్కగా చెప్పారు 'మనిషిచేతి దేవత' నవలలో.

**–కె.వి.యస్. భానుమూర్తి,**
పాలకొండ-532 440.





# సచిత్రవిచిత్రం





## మహాకాయుడు

700 పౌన్ల బరువు గల మనిషంటే మాటలా మోయటానికి ఏకంగా ఓ ట్రక్ కావలసిందే. అదలా ఉంచి 'నాయనా నువ్వు గనుక అర్జంటుగా బరువు తగ్గించుకోకపోతే గుండె ఆగి చావటం ఖాయం'- అన్నారు డాక్టర్లు. దాంతో ఇంట్లో అయితే లాభంలేదని, ఆస్పత్రిలో చేరి, నాలుగు నెలల్లో నగం బరువు తగ్గించుకుని, చాలాకాలం తర్వాత కష్టపడి నడవగలిగాడీయన. అంతకుముందసలు నడవటమే అసాధ్యంగా ఉండేదితనికి. పాతికేళ్ల వయసుదాకా ఈయనా అందర్లాగే ఉండేవాడు గానీ, ఆ తర్వాత మొదలయింది లావెక్కిపోవటం. వంటగది, పడకగదిదాటి బయటికి రావటం తెలీని ఈ తిండిపోతు, ఆ తర్వాతి 8 ఏళ్లలో 700 పౌన్లదాకా ఎదిగాడు. నిత్యం బ్రేక్‌ఫాస్ట్‌కు, లంచ్‌కి, డిన్నర్‌కు వరసపెట్టి 12 కోళ్లు, రెండు కిలోల వేయించిన బంగాళదుంపలు, సాసేజెస్, మరో రెండు పెద్ద మటన్ సాండ్విచ్‌లు భోంచేసేవాడు. బ్రేక్‌ఫాస్ట్‌లో మాత్రం కోళ్లకు మినహాయింపు ఉండేది.

రెండేళ్ళ తర్వాత మొదటిసారిగా 'వాకర్' సాయంతో నడక ప్రారంభించిన ఈ 'అర'కాయుడుగారు మరో 150 పౌన్లు తగ్గించుకుని 'పావు'కాయుడుగా స్థిరపడాలంటున్నారు.

# చతుర

సంచిక: 4 సంపుటి: 21 మే 1998

జీవితంలో పెళ్ళే చేసుకోనని శపథం పట్టాడతను.

"ఈ విషయంలో నీకు నా సహాయం ఎప్పుడూ వుంటుంది బాబాయ్!" అన్నాడు పదకొండేళ్ళ అతడి అన్నకొడుకు.

కానీ... అతడి బ్రహ్మచర్యానికి సవాలులా అర్ధరాత్రి ఓ అందమైన అమ్మాయి ఆ ఇంటిలో ఆశ్రయం కోరి వచ్చింది.

అంతేకాదు... అర్ధరాత్రిళ్ళు గాఢనిద్రలో నడిచివచ్చి, ఆ నిద్ర కళ్ళతోనే అతని డైరీలో ఏదో రాసేసి తిరిగివెళ్ళి పడుకుంటోంది.

అడిగితే... 'నాకేమీ తెలియదు' అంటున్న ఆ అమ్మాయి చర్యల వెనక అసలు రహస్యం ఏమిటి? అర్ధరాత్రి ఒంటరిగా తన గదిలోకి నడిచివచ్చే ఆ అతిలోక సుందరిముందు... అతడి బ్రహ్మచర్యం ఏమైంది?

నిద్రమత్తులో ఆమె అతని డైరీలో నింపిన విషయమేమిటి?

కడుపుబ్బ నవ్వించే హాస్యంతో **కోలపల్లి ఈశ్వర్** రాసిన **'పెళ్ళి'** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



చినబాబు నుదుట కల్యాణ తిలకం దిద్ది బాసికం కడుతుండగా...

అసంకల్పితంగానే పళ్ళు పటపటమని కొరుక్కుని క్రీగంట చూశాడు.

అతనికెదురుగా పదిగజాల దూరంలో ఎండ్రిన్ డబ్బా పట్టుకుని నిలబడ్డ చంద్రకాంతమ్మ తనూ పళ్ళు పటపట కొరుకుతూ.... డబ్బా ఎత్తి ఒక్కసారి అతని కళ్ళముందు ఆడించింది.

నిస్సహాయంగా తల వంచుకుని మళ్ళీ పళ్ళు కొరుక్కున్నాడు.

దవడపళ్ళల్లో ఓ పన్ను 'ఫట్'మన్న శబ్దం వచ్చి గతుక్కుమన్నాడు. కంగారుగా దాన్ని వేలితో తడిమి చూసుకుని గట్టిగానే వుందని నిర్ణయించుకుని తృప్తిగా నిట్టూర్చాడు.

ఆ తర్వాత తన పక్కనే కూర్చునివున్న తోడి పెళ్ళికొడుకూ ప్లస్ తన అన్నకొడుకూ అయిన అబ్బిగాడికేసి సీరియస్‌గా చూశాడు.

వాడు కాలుమీద కాలేసుక్కూర్చుని మినీ టేప్ రికార్డర్‌లోంచి 'పెళ్లంటే నూరేళ్లపంట' అనే పాటను తన్మయంగా వింటున్నాడు.

"ఆపుతావా ఆ దరిద్రగొట్టుపాట" ఈసారి పళ్ళు కొరక్కుండా జాగ్రత్తపడుతూ పళ్ళ బిగువున అడిగాడు.

అబ్బిగాడు చిరాగ్గా చినబాబుకేసి చూసి ఫాస్ట్ ఫార్వడ్ చేశాడా పాటను.

"పెళ్ళి చేసుకుని... ఇల్లు చూసుకుని... చల్లగ కాపురముండాలోయ్"

ఈసారి చినబాబే టేప్‌రికార్డర్ పీకనొక్కేశాడు.

అబ్బిగాడికి చుర్రుమంది "ఏమిటి నీ ఉద్దేశ్యం? "

"వద్దు... నాకీ పెళ్ళిపాటలంటే అసయ్యం" ఆముదం తాగిన ముఖం పెట్టాడు చిన్నబాబు.

"నీకసహ్యమైతే నాకేం! అది నాకనవసరం. నా డ్యూటీ నన్ను చేసుకోనీ. ఈ పెళ్ళి తంతు ముగిసే వరకూ... నీకు పెళ్ళి పాటలు విన్పిస్తూ బ్రెయిన్ వాష్ చెయ్యమని 'హైకమాండ్' ఆర్డర్" అబ్బిగాడు మళ్లీ ఆన్ చేశాడు.

హైకమాండ్ అంటే నాన్నమ్మ.

"మీరెల్లరు హాయిగా ఉండాలోయ్..." పాట మొదలైంది.

అబ్బిగాడి భుజాలు గుచ్చిపట్టి వాడి ముఖంలోకి క్రూరంగా చూస్తూ అడిగాడు చినబాబు "ఎవడ్రా? ఎవడ్రా వాడు పెళ్ళి చేసుకుని హాయిగా వున్నదీ భూమ్మీద? "

"నీల్ ఆమ్ స్ట్రాంగ్" చెప్పాడు అబ్బిగాడు.

చినబాబు చప్పున వాడి భుజాలు వదిలేసి ఆశ్చర్యంగా అడిగాడు "నీల్ ఆమ్ స్ట్రాంగా? వాడెవడు"

"తొలిసారిగా చంద్రమండలం మీద అడుగు పెట్టిన మనిషి"

"నా ప్రశ్నకూ...నీ జవాబుకూ ఏమైనా సంబంధం వుందా? " చినబాబు అబ్బిగాడ్ని నమిలేలా చూశాడు.

"నీ వయసువాడు... ఆప్రశ్న నన్ను అడక్కూడదు. నా వయసు వాడు దానికి జవాబు చెప్పలేడు. అందుకే సంబంధంలేని ప్రశ్న... సంబంధంలేని జవాబు. టిట్ ఫర్ టాట్" అబ్బిగాడు నవ్వాడు.

చినబాబు జుట్టు పీక్కోబోయాడుగాని పెళ్ళిపాగా అనబడే తలపాగా అడ్డురావడంతో ఆ పని చెయ్యలేక మెడమీద గోక్కుని సణుక్కున్నాడు "వద్దు...నాకీపెళ్లొద్దు"

"పెళ్ళివారమండీ" అంటున్న టేప్‌రికార్డర్ గొంతు చటుక్కున నొక్కి అబ్బిగాడు చినబాబువంక అనుమానంగా చూశాడు.

"బాబాయ్, ఇప్పుడు నువ్వన్నది... నాకీపెళ్లొద్దు అనా... లేక నాకు పెళ్లొద్దు అనా? "

"ఏదొకటి ఏడ్చాలే నువ్ నోర్మూసుకో"

"అయితే నువ్విలా సణిగినట్టు నాన్న

మ్మకు చెప్పేస్తా. ఎండ్రిన్ తాగి చచ్చూరు కుంటుంది"

"అంతపని చెయ్యకు. నాకీ పెళ్లొద్దు అన్నా. అయినా మనలో మాట రెంటికీ ఏమిట్రా తేడా? "

"నాకీ పెళ్లొద్దు అంటే... ఈ వధువు అక్కర్లేదు. మరో స్త్రీని చేసుకుంటానూ అని. 'నాకు పెళ్లొద్దు' అంటే అసలు ఏ మగువా నాకిష్టంలేదు... పెళ్లిచేసుకోనూ ఘోటక బ్రహ్మచారిగా వుండిపోతానూ అని"

చినబాబు అబ్బిగాడ్ని ఆరాధనగా చూశాడు. "ఒరే అబ్బీ! వధువు... మగువ... స్త్రీ... ఏమిట్రా ఈ పద ప్రయోగాలు. ఇంతలేత వయసులో అంత ఘాటు పాండిత్యమా? "

"హుం... పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది బాబాయ్"

"మరీ ఇంత పరిమళమా? తట్టుకోలేకపోతున్నాన్రా"

"గుడ్డలో చుట్టినా ఇంగువ వాసన ఆగదులే బాబాయ్... అన్నట్టు నీకీ పెళ్లివద్దా... అసలు పెళ్లే వద్దా. విషయం తెలిస్తే నావంతు సాయం అందిస్తా"

చినబాబు ఆనందాశ్రువులు రాలుస్తూ ఆవేశంగా అన్నాడు " అసలు పెళ్లేవద్దు. వద్దేవద్దు. అబ్బిగా... నువ్వొక్కడివేరా నన్నర్థం చేసుకున్నది. ఒక్కడివే... ఒక్కడివే..."

వున్నట్టుండి గరగరమని వినపడింది ఓ డబ్బా బిరడా తిప్పుతున్న శబ్దం. ఆ వెనువెంటనే పటపటమన్న శబ్దం కూడా వచ్చేసింది. చినబాబు అనుమానంగా అటుచూశాడు.

చంద్రకాంతమ్మ పళ్లు పటపట కొరుకుతూ ఎండ్రిన్ డబ్బా మూత గరగరమని తిప్పుతోంది.

"అమ్మో, చేస్కుంటా... పెళ్లి చేస్కుంటా" హడావుడిగా అరిచేశాడు.

'గరగర' శబ్దం ... 'పటపట' శబ్దం ఆటోమేటిగ్గా ఆగిపోయాయి.

మంగళ వాయిద్యాలు జోరుగా మ్రోగుతున్నాయి. పెళ్లి మంత్రాలు తారాస్థాయిలో వినబడుతున్నాయి.

"పెళ్లికొడుకుని తీసుకురండి" బ్రాహ్మడు... బాకా వూదినట్టు అరిచాడు.

చినబాబు కళ్ళవెంట... చివరిసారిగా ఓ కన్నీటిబొట్టు రాలింది.

తుడుచుకోబోతుంటే అబ్బిగాడు తన కర్చీఫ్‌తో చినబాబు కన్నీరు తుడిచి... అతని కళ్లలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"డోంట్ వర్రీ బాబాయ్... ఐ విల్ హెల్ప్ యు"

"నువ్వేం చెయ్యగలవు నాన్నా... తరతరాలుగా నాలాంటి అమాయకులెందరో ఈ పెళ్లి అనే బలిపీఠం మీద తల పెడుతూనే వున్నారు. పెళ్లాం అనే కత్తికి బలైపోతున్నారు" చినబాబు విరక్తిగా నవ్వి లేచాడు. అతనితో పాటు లేచిన అబ్బిగాడు మెల్లగా చంద్రకాంతమ్మ వెనక్కి వెళ్ళాడు.

చంద్రకాంతమ్మ ఎండ్రిన్ డబ్బా నేలమీద పెట్టి పెళ్ళిపీటలమీదకు వెళుతున్న చినబాబును ఆనందంగా చూస్తూ కళ్ళవెంట అదే పనిగా రాలుతున్న అశ్రువుల్ని కొంగుతో అద్దుకొంటోంది.

అబ్బిగాడు ఇక ఆలోచించకుండా చటుక్కున ఆ ఎండ్రిన్ డబ్బా అందుకుని చినబాబుకు ఎదురుగా వెళ్ళాడు.

"బాబాయ్... ఇదుగో డబ్బా... ఇక నానమ్మ ఇది తాగి చచ్చే స్కోప్ లేదు, విజృంభించు. నీ మనోరథం ఈడేర్చుకో? " ఎండ్రిన్ డబ్బాని విసిరిపుచ్చి రోడ్డుమీదకు గిరాటేశాడు అబ్బిగాడు.

చినబాబు కళ్లలో వెయ్యి వాల్టుల బల్బ్ వెలిగింది. గుండెలు చీల్చుకుంటూ వచ్చిందో కేక "వద్దు... నాకు పెళ్లొద్దు... వద్దు... వద్దేవద్దు..."

"నా డబ్బా.. ఆ ఎండ్రిన్ డబ్బా.."



చంద్రకాంతమ్మ కుడికాలు అబ్బిగాడి చేతుల్లో చిక్కిపోగా డబ్బాకోసం రోడ్డుమీద కెళ్లాలని పెనుగులాడుతోంది.

అబ్బిగాడు తన పట్టు మరింత బిగించాడు.

"వద్దు... పెళ్లొద్దు..."

"డబ్బా... నా ఎండ్రిన్ డబ్బా..."

"వద్దు... పెళ్లొద్దు... వద్దు... వద్దే వద్దు..."

'ధన్'మన్న పెద్ద శబ్దంతో మంచంమీంచి నేలమీద పడ్డాడు చినబాబు.

ఉన్నపాటున పరిగెత్తుకొచ్చారు చినబాబు గదిలోకి, తల్లి చంద్రకాంతమ్మ, తండ్రి శేషాద్రి, ముగ్గురు అన్నయ్యలూ, వారివారి భార్యలూ, పిల్లలూ.

అప్పటికే లేచి కూర్చున్న చినబాబు... అందరికేసి... సిగ్గుతో చితికిపోతూ చూశాడు "క... కల"

"ఓహో..." మూడో అన్నయ్య ఏకైక కుమారుడు అబ్బిగాడు ఇంకా నేలమీదే కూర్చుని వున్న చినబాబుకేసి చేయి చాచాడు, లేవమన్నట్టుగా.

వెంటనే చినబాబుకి... అబ్బిగాడు తనకు కల్లో చేసిన సాయం గుర్తుకొచ్చింది. అభిమానం పొంగి పొర్లిపోతుండగా వాడివంకే ఆరాధనగా చూస్తూ ఆ చెయ్యందుకున్నాడు.

★ ★ ★

ఆరోజు ఆదివారం. ఆ ఇంట్లోని మూడు జంటలూ సినిమాలకు వెళ్ళిపోయాయి. శేషాద్రీ, చంద్రకాంతమ్మ ఈ.టి.వి.లో సంపూర్ణరామాయణం వస్తుంటే చూస్తున్నారు.

చినబాబూ, అబ్బిగాడూ టెర్రస్‌మీద పిట్టగోడను ఆనుకుని నిలబడివున్నారు. ఇద్దరికీ మధ్యగా మురుకులతో నింపబడ్డ ఓ స్టెయిన్‌లెస్ స్టీల్ ప్లేటుంది.

సంధ్యగాలి చల్లగా ఒంటిని స్పృశిస్తుంటే... అలవోకగా మునిపంటితో మురుకులు కొరుకుతున్న అబ్బిగాడు అకస్మాత్తుగా తినడం ఆపి అడిగాడు "బాబాయ్... అసలీ వివాహవ్యవస్థ మీద నీకు విరక్తి ఎందుక్కలిగింది"

ఎవరి పిల్లలు వాళ్లతో సినిమాలకెళతారు గాని అబ్బిగాడు మాత్రం చినబాబుతోనే వెళతాడు. అతను వెళ్లకుంటే తనూ మానేస్తాడు.

"చిన్నబాబు అబ్బిగాడికేసి అదోలా చూశాడు "నీకు మరీ పదేళ్లే...! నువ్వేమో... నడివయస్కుడిలా వివాహవ్యవస్థ అదీ ఇదీ అంటుంటే కాస్త ఎబ్బెట్టుగా వుందిరా అబ్బీ అలా అనే బదులు పెళ్లంటే ఎందుకిష్టం లేదు బాబాయ్? అని అడగొచ్చుగా!"

"వయసుకూ మనసుకూ సంబంధంలేదు బాబాయ్. అరవై ఏళ్ళ వృద్ధుడికి, ఇరవై ఏళ్ళ మనసుండొచ్చు.. ఇరవై ఏళ్ళ నవయువకుడికి అరవైయేళ్ల మనసుండొచ్చు"

"నీకు మరీ"

"పదేళ్ళంటావ్. ఇట్స్ నాటెమేటర్. తెలుగు సినిమాల్లో బాలనటుల్ని చూస్తూనే వున్నావ్‌గా. ఎంతెంత భారీ డైలాగులు చెబుతారో! విడిపోయిన తల్లిదండ్రుల్ని కలపడం. హీరో హీరోయిన్స్‌కి పెళ్ళిచెయ్యడం, ఎన్ని ముదురు మాటలు, ఎన్నెన్ని ముదురు పనులు"

"ఓ.కె., ఓ.కె. ఇక ఆపు. అన్నట్టు వివాహ వ్యవస్థమీద నాకు విరక్తి ఎందుక్కలిగింది అని కదూ అడిగావ్?"

"అనే అడిగాను" ముక్కు మీదకు జారిన కళ్ళజోడ్ని వెనక్కు తోసుకుంటూ చెప్పాడు అబ్బిగాడు.

ప్లేట్లోని మురుకుల్ని చేత్తో అటూఇటూ కదుపుతూ మొదలెట్టాడు చినబాబు.

"చూస్తూనే వున్నావ్‌గా అబ్బీ మనింట్లో గొడవలు! అందరం ఒకే ఇంట్లో వున్నా, వేరువేరు కుంపట్లు. వేరువేరు గదులు. మనిల్లో మేడిపండు. అన్నయ్యలకు పెళ్ళి కాకముందు అందరం ఎంచక్కా కలసి వుండేవాళ్ళం. అమ్మ ఇదుగో ఈ టెర్రెస్





మీదే కూర్చుని ముద్దపప్పూ, ఆవకాయా, నెయ్యీవేసి అన్నం కలిపి అన్నయ్యలకూ, అక్కయ్యలకూ నాకూ చేతుల్లో ముద్దలు పెడుతుంటే చల్లటి వెన్నెల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, ప్చ్.. ఆరోజులిక రావు"

ఒక్కక్షణం ఆగి మళ్ళీ చెప్పాడు "వరసగా పరుపులేసుకుని, నిద్రపట్టేదాకా, పాటలు పాడుకుంటూ, కథలు చెప్పుకుంటూ, గడిపే వాళ్లం, ఒరే అబ్బీ, ఇదుగో, ఈ డైనింగ్ టేబుళ్లూ, యూఫోమ్ బెడ్లూ వచ్చాక, అమ్మ పెట్టే గోరుముద్దలకూ, ఆరుబయట వెన్నెల నిద్రలకూ, కరువైపోయింది. అసలు విలువే లేకుండా పోయింది. ఈ 'పెళ్ళాలు' అనే మనుషులొచ్చాక, అమ్మ అత్తగా మారింది. అన్నయ్యలు దాయాదులయ్యారు. తండ్రి కేలిక్యులేటర్ అయ్యాడు. మనిల్లే కాదబ్బీ, ప్రతి యిల్లూ ఇంతే"

శ్రద్ధగా విన్న అబ్బిగాడు గాఢంగా నిట్టూర్చాడు. "నిజం బాబాయ్, నువ్ చెప్పే గోరు ముద్దలూ, వెన్నెల నిద్రలూ, ఏమిటో మా తరంవాళ్ళకి తెలీనేతెలీదు. అయినా ఒక్క డౌట్. ఇదంతా పెళ్ళాలవల్లే జరుగుతోందంటావా? "

"ఖచ్చితంగా" ఆవేశంగా చెప్పాడు చిన బాబు. అక్కయ్యలకు పెళ్ళిళ్లయ్యాక పెద్దన్నయ్య పెళ్ళిచేశాడు నాన్న. వదిన వచ్చిన తర్వాత ఓ సంవత్సరం వరకూ అందరితో కలసిపోయి బాగానే వుంది. చిన్న వదిన రాకతోనే మొదలైంది గొడవ! కట్నం ఎక్కువ తెచ్చానని ఆమె టెక్కు చూపేది. తనకంతా ప్రత్యేక గౌరవం ఇవ్వాలని డిమాండ్ చేసేది. పెద్దొదిన ఇది సహించలేకపోయేది. మా అమ్మ కూడా తక్కువ తిన్లేదు. కట్నం ఎక్కువ తెచ్చిన కోడల్నే అభిమానంగా చూసేది. పెద్దామెను ఎద్దేవా చేసేది.

ఈ బాధలు పడలేక నాన్న, ఇది నీది, అది నీది అని హద్దులు గీసేడు అన్నల మధ్య.

ఈ సమస్య ఇంతటితో తీరలేదు, మీనాన్న, మీ అమ్మను ప్రేమించి పైసా కట్నం లేకుండా గుళ్లో పెళ్ళిచేసుకొచ్చాక మొదలైంది అసలు కథ. అత్త గుండె ససేమిరా అడ్జెస్ట్ కాలేకపోయింది. పెద్ద వదినలిద్దరితో చేరి మీ అమ్మను వేధించేది. ఓసారి ఒంటిమీద కిరోసిన్ పోసుకుని తగలబెట్టుకోబోయింది మీ అమ్మ. అందరూ కలసి ఆర్పేశారు. గండం గడిచిందిగాని, ఇది జరిగిన సమయంలో ఇంట్లో లేని మీ నాన్నకు, మీ అమ్మ జరిగింది మరోరకంగా చెప్పింది. మా అమ్మా, వదినలూ కలసి తన్ని కాల్చెయ్యబోయారనీ, తను తప్పించుకున్నాననీ చెప్పింది. అన్నలు ముగ్గురూ వీధినపడి తన్నుకున్నంత పని చేశారు. మీ అమ్మ పుట్టింటికి వెళ్ళిపోయింది. తరువాత అన్నయ్య కూడా భార్య దగ్గరకు వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళు గడిచాక, ఆస్తులెక్కడ పోతాయో అని వాళ్ళేవచ్చి, దౌర్జన్యంగా ఇంట్లోనే మరో గదిలో కాపురం పెట్టారు. వింటున్నావా అబ్బీ" ఆగి అడిగాడు చిన బాబు.

'వింటున్నా చెప్పు' అన్నట్టు చూశాడు అబ్బిగాడు.

"ఇక మిగతా విషయాలు నీకు తెలిసినవే కదా! అప్పుడప్పుడూ మా అక్కయ్యలు, అదే నీ మేనత్తలు భర్తలతో పోట్లాడి రావడం, ఇక్కడ తిష్టవేసి వదినలూ వాళ్ళూ తన్నుకొని తలకుపోసుకోవడం, మా అమ్మ కూతుళ్ళని వెనుకేసుకొచ్చి కోడళ్లను తూలనాడటం, అది అన్యాయమన్న నాన్నమీద ఒంటికాలిమీద లేవడం, చూస్తూనే వున్నావ్‌గా"

"నువ్వు చెప్పింది అక్షర సత్యం బాబాయ్. మనిల్లేమిటి ప్రతి ఇల్లూ అంతే. పక్కింటి లాయర్ మామయ్య చూడు. రోజుకో విడాకుల కేసు వాదిస్తుంటాడు. ఎదురింటి మేష్టార్ని పెళ్ళాం కర్రపట్టుకు

ఆడిస్తుంది. ఆ పచ్చమేడ పంకజాక్షి భర్త ఆమె బాధలు పడలేక సన్యాసుల్లో కలసిపోయాడు. ఆ కార్నర్ ఇంట్లో విశాలాక్షుందే"

"ఒరే అబ్బీ" అబ్బురంగా చూశాడు చినబాబు "ఇన్ని విషయాలు"

"చెప్పాగా విషయ పరిజ్ఞానానికీ, వయస్సుకీ సంబంధం..."

"లేదు" వెంటనే ఒప్పేసుకున్నాడు చినబాబు.

"వెరీగుడ్" చినబాబుని మెచ్చుకుని మళ్ళీ అన్నాడు "సో... వివాహం అనేది కుటుంబ విచ్ఛిన్నానికి దారితీస్తుందంటావ్"

"డెఫినెట్‌గా! ఇప్పుడు అమ్మా నాన్నలతో పాటు వుంటున్నానా, రేపు ఆ పెళ్ళాం అనే మనిషి వచ్చిందనుకో. నాచేత ఇంట్లోనే వేరు కాపురం పెట్టిస్తుంది. కొన్నాళ్ళు గడిచాక ముగ్గురూ అమ్మా నాన్నల్ని ముక్కల కింద నరికి పంచుకోవాలసి వస్తుంది. పోనీ ఆమె మంచిదే అయినా అమ్మ తాలూకు అత్త మనసు... ఆమెను సజావుగా వుండనియ్యదు. ఇంట్లో రామరావణ యుద్ధం. భరించలేక నేను దేశాలు పట్టిపోవలసి వస్తుంది. కాబట్టి నా జీవితం ఇలా సాఫీగా ఏ ఒడిదుడుకులూ లేకుండా సాగిపోవాలంటే, పెళ్ళి అనే ఝుంఝూటంలో ఇరుక్కోకూడదు. ఏమంటావ్?"

అబ్బిగాడు ఓ నిముషం దీర్ఘాలోచనలో మునిగిపోయి అనంతరం తలెత్తి చినబాబు కళ్ళలోకి చూశాడు.

"బాబాయ్" ఆర్ద్రంగా పలికాడు.

"ఇంతా విన్నాక ఈ వివాహ వ్యవస్థమీద నాకూ గౌరవం పోయింది. అందుకే నేను ఓ నిర్ణయానికొచ్చా"

"ఏమిట్రా అది?"

"నేను కూడా నీలాగే చస్తే పెళ్ళిచేసుకోను"

చినబాబు గుండె పులకించిపోయింది.





తన్మయంగా చెయ్యి చాచి అబ్బిగాడితో కరచాలనం చెయ్యబోతుండగా చేతిలోని మురుకులపళ్లెం పిట్టగోడమీంచి జారి సరిగ్గా అప్పుడే రిక్షాలోంచి దిగుతున్న చినబాబు పెద్దక్క నెత్తిమీద పడి ఖంగుమని శబ్దంచేసింది.

భద్రకాళిలా వూగి పోతూ పైకి చూసింది. అప్పటికే చినబాబు తల చాటేశాడుగాని, ఆత్రంగా వంగి చూస్తున్న అబ్బిగాడు మాత్రం ఆమె కంటపడ్డాడు.

★ ★ ★

"అత్తింట్లో అవమానాలు పడలేక పుట్టింటికొస్తే, నెత్తిమీద ప్లేటు తీసుక్కొడతాడా నీ కొడుకు?"

పెద్దక్క ఆవేశంగా ఊగిపోతోంది.

సినిమానుండి వచ్చిన జంటలు వచ్చినట్టే నిలబడి వున్నారు చినబాబు పెద్దక్కయ్య కామేశ్వరి చుట్టూ.

"మాటలు జాగ్రత్తగా రానీ. ఏదో జారి పడుంటుందిగాని, మా అబ్బిగాడు ఒక్కనాటికీ అలాంటి పోకిరీ పనులు చెయ్యడు. వాడసలే పెద్దమనిషి తరహా" అబ్బిగాడి అమ్మ ప్రశాంతి చురచుర చూస్తూ అంది.

"వాడు చెయ్యడు, నువ్ చెయ్యిస్తావ్. ఒంటిమీద కిరోసిన్ పోసుకుని, మేం పోసినట్టు మొగుడికి చెప్పిన నెరజాణవుగదా! ఇది నీ ట్రైనింగే"

పెద్దవదిన లిద్దరూ చోద్యం చూస్తూ నిలబడ్డారు.

చంద్రకాంతమ్మ, కూతురి నెత్తిమీద కట్టిన బుడిపెకు నీరు, సున్నం రాస్తూ దీర్ఘంతీసింది "మరేమ్మా ఏమిటో నా బిడ్డ, ఆ దరిద్రపు పెళ్లయిన దగ్గర్నుంచీ ఒకటే కష్టాలు. ఊరుకోమ్మా ఊరుకో, ప్రయాణం చేసి అలసిపోయొచ్చావ్. ఎవరినోట్లో నోరు పెట్టకు"

ప్రశాంతి ఏమనుకుందో మరి. మూతి మూడు వంకర్లు తిప్పి, ఆ తగవంతటితో కట్‌చేస్తూ తన గదిలోకెళ్ళిపోయింది.

"ఏమ్మా... ఏమంటున్నాడు అల్లుడు?" అందరూ వెళ్ళిపోయాక ఆరాతీసింది చంద్ర

కాంతమ్మ.

"ఆయనేమంటాడు వాజమ్మ. మేరేజ్‌డేకి ఓ పట్టుచీర తెమ్మంటే సరేనన్చెప్పి వెళ్ళి రెండు పట్టుకొచ్చాడు. నాకేమోనని మురిసి పోతుంటే, ఒకటి వాళ్ళమ్మకిచ్చేశాడు. రెండూ ఒకటే రేటు, పెళ్ళానికీ, తల్లికీ తేడా లేదూ? అయినా నా పెళ్ళిరోజు నాడు ఆవిడకి తేవాల్సిన అవసరమేముంది? ప్రతిదీ అంతే, చెరిసమానంగా తెస్తాడు. భరిస్తూ వచ్చాను. మరీ, పెళ్ళిరోజు చీరతోసహా అదే తంతు అంటే ఒళ్ళు మండిపోయింది. అందుకే నాలుగు దులిపి వచ్చేశా నాల్రోజు లిక్కడుంటే... వాడే వస్తాడు"

కూతురు మొగుడ్ని పట్టుకుని వాడు వీడు అంటుంటే మందలించాల్సిందిపోయి మురిసిపోయింది చంద్రకాంతమ్మ.

"నా తల్లే. మంచి పని చేశావ్. రాక చస్తాడా"

"వింటున్నావా అబ్బిగా వాళ్ళ మాటలు? ఎలా వుందో చూడు వివాహవ్యవస్థ" తన పక్కనే పడుకున్న అబ్బిగాడితో అన్నాడు చినబాబు.

అబ్బిగాడికి అప్పుడప్పుడూ చినబాబు దగ్గర పడుకోవటం అలవాటు.

"ష్... అరవకు" చెవులు రిక్కించాడు అబ్బిగాడు.

"చినబాబుని నేను వప్పిస్తా. నువ్వలాగే చూస్తుండు"

"నీవల్లకాదు"

"అవుతుంది గానీ ఓ ఎండ్రిన్ డబ్బా తెప్పించు. ఆపై కథంతా నేన్నడిపిస్తా. వున్న వూళ్లోనే సంబంధం వదులుకోవడం తెలివనిపించుకోదు. కనీసం వాడి పెళ్ళామైనా, నీకు చేదోడువాదోడుగా వుంటుందని నా ఆశ"

"అబ్బిగా, అక్కయ్య ఎండ్రిన్ డబ్బా అన్నది కదూ ఇప్పుడు నా కల నిజమయ్యేట్టుంది" అబ్బిగాడి చేతిని భయంగా పట్టుకున్నాడు చినబాబు.

"కల్లో నీ పెళ్ళి జరిగిందా? " సీరియస్‌గా అడిగాడు అబ్బిగాడు.

"లేదే"

"ఈ అబ్బిగాడు సాయం చేశాడా? "

"ఊ... చేశావ్"

అబ్బిగాడు చినబాబు వెన్నుతట్టి చెప్పాడు "కలలోనే కాదు ఇలలోకూడా ఈ అబ్బిగాడి సహాయం ఎప్పుడూ వుంటుంది నీకు"



ఫలహారాలు తినడం పూర్తవుతుండగా తీసుకొచ్చారు అమ్మాయిని. అమ్మాయి పెద్దగా అలంకరించుకోలేదు. టూ పాయింట్ ఫైవ్ శిల్పాస్టిక్కర్ పెట్టుకుని నారాషిఫాన్ చీర కట్టుకుంది. పొడగాటి జడలో ఒకే ఒక గులాబీ పెట్టుకుంది. ఎదురుగా వున్న సోఫాలో కూర్చుని కాలిమీద కాలేసుకోబోయి మళ్ళీ ఎందుకో మానేసింది.

చినబాబు అసంకల్పితంగా తలెత్తి చూశాడు.

"పిల్ల బాగుంది" అబ్బిగాడు చినబాబు చెవిలో గుసగుసమన్నాడు.

"అది నాకనవసరం. నే పెళ్ళే చేసుకోను" చినబాబు అబ్బిగాడి చెవిలో గుసగుసమన్నాడు.

సన్నగా నాజూగ్గా వున్న ఆ అమ్మాయినే తృప్తిగా చూస్తూ అడిగింది చంద్రకాంతమ్మ

"అమ్మాయ్! పేరేమిటన్నావ్? "

"ఎవరి పేరండి? " భ్రుకుటి ముడిచి అడిగిందా అమ్మాయ్.

గతుక్కుమన్నా నవ్వేసింది చంద్రకాంతమ్మ. "అదేమిటమ్మాయ్, ఎవరిదో ఎందుకడుగుతాను నీ పేరే"

"నా పేరు... నేరెళ్ళ" చెప్పింది జడ ముందుకేసుకుంటూ.

"నేరెళ్ళా, అదేం పేరు!"

ఆ అమ్మాయి తల్లి చెప్పింది "పూర్తిపేరు నేరెళ్ళ విజయ భారతి. మా అమ్మాయి కథలూ గ్రట్రా రాస్తుంది కదా! రచయిత్రన్న మాట. అందుకే, మా అమ్మాయి నందరూ నేరెళ్ళ అంటారు"

చినబాబు పెద్ద వదిన వెంటనే రియాక్టయింది. "నా మొగుడ్ని చంపింది నేనే" "అత్తా... నీ ప్రాణం తీస్తా" అనే నవలలు రాసింది మీరే కదూ!"

అవునంటూ చిరునవ్వుతో తల వూపింది నేరెళ్ళ.

చినబాబు రెండో వదిన ప్రభావతి ఎగ్జయిట్ అయిపోతూ అడిగింది 'ఆమెకిద్దరు' 'మీ ఆయనే మా ఆయన' నవలలు రాసింది కూడా..."

"నేనే"

"మైగాడ్! వెరీగ్లాడ్ టు మీట్‌యు" ప్రభావతి ముందుకు వంగి ఆమెతో కరచాలనం చేసింది.

సందడంతా సర్దుమణిగాక చంద్రకాంతమ్మ తెప్పరిల్లి తన రెండో ప్రశ్నవేసింది. "సంగీతమేమైనా వచ్చా? "

"ఆరున్నొక్కరాగం ఆపకుండా తియ్యగలను" కళ్లెగరేసి చెప్పింది.

"అంటే"

"ఆరున్నొక్కటి అంటే ఆరూ ప్లస్ ఒకటి ఏడూ అని. సప్తస్వరాలు"

"వంటొచ్చా"

"నాకాఫీల్డ్‌లో ఇంట్రెస్ట్ లేదు. సో వంట చేసే ప్రసక్తే లేదు" నిష్కర్షగా చెప్పింది.

చంద్రకాంతమ్మ మరికొన్ని ప్రశ్నలు అడిగి వూరుకుంది. అపుడు చినబాబుతో అందామె. "ఇపుడు మిమ్మల్ని మూడే మూడు ప్రశ్నలు అడుగుతాను. దయచేసి సమాధానం ఇవ్వండి"

చినబాబు సర్దుక్కూర్చుని ఇబ్బందిగా ముఖంపెట్టి ఆమెకేసి చూశాడు 'అడగండి తప్పేదేముంది' అన్నట్టు.

"సపోజ్... మన పెళ్ళయిందే అనుకోండి. ఇద్దరం సెకెండ్ షో సినిమాకి వెళ్ళి వస్తున్నాం. దార్లో ముగ్గురు రౌడీలు అటకాయించి నామీద చెయ్యేశారు. అప్పుడు భర్తగా మీరేం చేస్తారు? అన్నట్టు ఆ రౌడీల చేతుల్లో కత్తులు కూడా వున్నాయ్"

"అందర్నీ చావబాది నిన్ను రక్షిస్తానని చెబుతానని కదూ అనుకున్నావ్. కత్తులు పట్టుకుని మీదికొచ్చే రౌడీలను ఎదిరించే శక్తి నాలాంటి సగటు మనిషికి వుండదు గాక వుండదు. అందుకే మిమ్మల్నక్కడే వదిలేసి... తిరిగి చూడకుండా పరిగెత్తుతా' ' చినబాబు కసిగా చెప్పాడు.

వదినలు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ఆమె మరో ప్రశ్నవేసింది. "మనపెళ్ళయ్యాక నేను మీ కుటుంబంలో ఇమడలేక పోయాననుకోండి. నాకోసం, ఐ మీన్ మీ భార్యకోసం వేరు కాపురం పెట్టగలరా? "

"పెట్టనుగాక పెట్టను. నీకు నిర్దాక్షిణ్యంగా విడాకులిస్తాను నా ఇంటినుండీ, హృదయం నుండీ తరిమికొడతాను"

పళ్ళు పటపట కొరకబోయాడుగానీ "మొన్నే ఓ పన్ను సిమెంట్ చెయ్యించుకున్నావ్" అని అబ్బిగాడు గుర్తుచేశాడు.

వేరుకాపురం పెట్టనుగాక పెట్టనన్న కొడుకు వైపు ఆర్ద్రతగా చూసి కళ్ళు తుడుచుకుంది తల్లి!

"ఆఖరి ప్రశ్న. నేను మీ భార్యనయ్యాక నాకేదైనా దీర్ఘరోగం... అంటే బ్లడ్

కేన్సర్... క్షయలాంటివి వున్నాయని తెలిస్తే మీ రియాక్షన్ ఎలా వుంటుంది? నన్ను వదిలేస్తారా? లేక ఉదాత్తంగా నన్ను స్వీక రించి ఉద్ధరిస్తారా? "

చినబాబు కిసుక్కున నవ్వాడు అదేం ప్రశ్న అన్నట్టు. "నేనేమన్నా, రాజా రామ్ మోహన్ రాయ్‌నా... కందుకూరి వీరేశలిం గాన్నా... ఉదాత్తంగా మిమ్మల్ని ఉద్ధరించ డానికి...? నిరభ్యంతరంగా మిమ్మల్ని వది లేస్తా. లక్షణంగా మరో అమ్మాయిని చేసు కుంటా" సినికల్‌గా ఓ చూపు విసిరాడు.

"ఇంటికి పద... నీ పీక పిసికేస్తా" అన్నట్టు చూసింది కామేశ్వరి

"సక్సెస్... గ్రాండ్ సక్సెస్...నిన్ను చస్తే పెళ్లి చేసుకోదు ఆ నేరెళ్ల" వచ్చేస్తుంటే... దార్లో హేండ్ షేక్ చేసి చెప్పాడు అబ్బి గాడు.



బెడ్ మీద వరసగా పెట్టిన నాలుగు పట్టుచీరెల్ని భృకుటి ముడిచి చూశాడు శేషాద్రి. త్వరలో రాబోతున్న దీపావళి పండుగ సందర్భంగా కోడళ్ళకూ... కూతురు కామేశ్వరికీ పెట్టడానికి చంద్రకాం తమ్మ కొన్నదవి. అమ్మాకూతురు అప్పుడే షాపింగ్ నుండి వచ్చి శేషాద్రి ముందుంచారు వాటిని. నాలుగూ... నాలుగు రకాలుగా వున్నాయి.

"ఇది రెండువేలు నాన్నా. అమ్మ నాకోసం కొన్నది. ఇదేమో పద్దెనిమిది పందలు... రెండో వదినకని తీశాం... బోలెడు కట్నం తెచ్చిందిగా వదిన. ఇదిగో... ఇది పెద్దొదినకు వెయ్యిరూపా యలు. ఇక ఈ మిగిలింది ఆ చిన్నావిడకు. ఐదొందలే. అసలు పట్టుకాదు ఫాన్సీ చీర. పైసాఖర్చు లేకుండా అప్పనంగా కట్టు కుందిగా చిన్నన్నయ్యను.

శేషాద్రి చూపు పట్టుచీరలమీంచి చంద్ర కాంతమ్మ మీదకు మళ్ళింది.

"ఇదేమన్నా బాగుందా కాంతం? " ఆవేశాన్ని ఆపుకుంటూ సాధ్యమైనంత సౌమ్యంగానే అడిగాడు.

"చూస్తూనే వున్నా. ఏమిటో? ముఖం గంటు పెట్టుకుని తెగ బాధపడిపోతు న్నారు. ఎవరి యోగ్యతను బట్టి వాళ్లకు తెచ్చా ఇందులో ఏమిటట కూడని పని? "

"ఎవరి యోగ్యత ఎంతమాత్రమో... నీకు తెలిసినంతగా నాకు తెలీదుగాని... నీ సెల క్షన్ మాత్రం యోగ్యంగాలేదు"

"ఏమిటేమిటీ? నా సెలక్షన్ యోగ్యంగా లేదా? అవున్లెండి... మిమ్మల్ని కట్టుకున్న నాడే నా యోగ్యత మంటగలసిపోయింది. అయినా ఎప్పుడూ లేంది... ఇవాళేమిటి ఇంతెక్కువగా మాట్లాడుతున్నారు? "

చంద్రకాంతమ్మ ముక్కుపుటాలు కోపంతో ఎగిరిపడుతున్నాయి.

శేషాద్రి భార్యకేసి ప్రశాంతంగా చూశాడు. "ఎక్కువో తక్కువో కాంతం... నాకు తోచింది చెప్పా. నువ్వు కోడళ్లకు చీరెలు పెట్టకపోతేనే పండుగ రోజు ఆనందంగా గడుస్తుంది. ఇది మాత్రం నిజం"

"మీ బోడి సలహా ఇక్కడెవరూ అడగలే దులెండి. ఎవరెక్కడుండాలో అక్కడుం డాలి. రాతికీ... రత్నానికి తేడాలేదూ!"

డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని ఈ సంభా షణంతా పొల్లుపోకుండా వింటున్న చిన బాబు అక్కడికొచ్చాడు.

అతన్ని చూడగానే విప్పారింది చంద్రకాం తమ్మ ముఖం.

"కామేశ్వరీ... చీరెల గొడవకేంగాని తీసి బీరువాలో పడెయ్. చిన్నాతో మాట్లాడాలి" అని కూతురితో చెప్పి... "దా... నాయినా దా కూర్చో... ఏమనుకున్నావ్‌రా పెళ్లి విషయం? రచయిత్రి పిల్ల నిన్ను మెచ్చిం దంటే... మాటలా? ఒప్పుకున్నట్టేగా" ఆప్యాయంగా అడిగింది.

చినబాబు ఓ సారి తండ్రి వంక చూశాడు. అనంతరం తల్లికేసి తల తిప్పి



చెప్పాడు. "ఏదో అక్కయ్య చస్తానంటోందని ఆలోచనలో పడ్డానుగానీ... ఇప్పుడీ చీరెల గొడవ విన్నాక... ఒక నిర్ణయానికొచ్చేశా" అన్నాడు.

"ఏమిట్రా అది" కాస్త భయంగా అడిగింది చంద్రకాంతమ్మ.

"ఖచ్చితంగా... నేను పెళ్లి చేసుకోకూడదూ అని"

"అదేంటి"

"అదంతేనమ్మా. నా భార్య యోగ్యతను నీచేత అంచనా వేయించి, అది కట్టబోయే చీరె రేటును ఫిక్స్ చేయించటం నాకిష్టం లేదు"

"నువ్ చేస్కోపోతే... నే ఛస్తానని చెప్పానా? " కామేశ్వరి కోపంగా చూసింది.

"తమ్ముడి పెళ్లికోసం ప్రాణాలు తీసుకునేంత ఉదాత్త చరితురాలివి కాదులే నువ్వు"

కామేశ్వరి చురచుర చూస్తూ ఏదో అనబోతుంటే చంద్రకాంతమ్మ కల్పించుకుని అంది "అవేం మాటల్రా... ఈ ముగ్గురు కోడళ్ళకూ... నా చినబాబు పెళ్లానికీ పోలికేమిటి? అదెవత్తైనా సరే... నా కూతురితో సమానం. దాని తరువాతే నాకెవరైనా"

"అదే నాకు నచ్చదమ్మా. ఈ చినబాబును కన్నట్టేగా మిగతా వాళ్లనూ కన్నావ్! ఎందుకీ తేడా? నా భార్యను మాత్రమే నువ్ ప్రత్యేకంగా చూశావనుకో... మనలో మనకు ఎన్ని గొడవలున్నా... ఇంతవరకూ... నన్నుమాత్రం అభిమానంగా చూస్తున్న నా వదినలూ, అన్నయ్యలూ నీ స్పెషల్ ట్రీట్‌మెంట్ వల్ల నాకు శత్రువులవుతారు. నా రాబోయే పెళ్లానికి తలబిరుసుతనం వచ్చేస్తుంది. వారానికో తగువుపడే ఈ ఇంట్లో ఇకమీదట అది రోజువారీ కార్యక్రమం అవుతుంది. ఆ పరిస్థితి నాకిష్టం లేదు. నాకు అందరూ కావాలి. అందుకే పెళ్లాం వద్దు"

చినబాబు కళ్లలో తడి మెరిసింది.

చీమ చిటుక్కుమన్నా వినపడేంత నిశ్శబ్దం పేరుకుందక్కడ! కొద్దిక్షణాల మౌనం తరువాత చంద్రకాంతమ్మ గొంతు విప్పింది.

"కామేశ్వరీ... చీరెలన్నీ మళ్లీ పేక్ చేసి బయలుదేరు. మార్చేసి... నా కోడళ్లందరికీ సమానంగా కొంటాను"

కామేశ్వరి ముఖం చేదుగా పెట్టింది "అదేంటమ్మా... కొనేశాంగా. ఈసారికి..."

"నువ్ మాట్లాడకు. చెప్పింది చెయ్" కూతురితో అని చినబాబువైపు నడిచింది "రేయ్ చిన్నా... ఈరోజు నుండీ... నా కోడళ్ళందరూ నాకు సమానం. మరి నువ్ నాకా రచయిత్రి పిల్లను కోడలిగా తెచ్చిపెడతావా? "

చినబాబు గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. గొంతు పెగలక ఇబ్బంది పడుతుంటే చంద్రకాంతమ్మ అంది "ఏమండీ... అబ్బాయి ఒప్పుకున్నట్టే. వాళ్లకో కార్డుముక్క రాసి పడెయ్యండి. మంచి రోజు చూసుకుని ముహుర్తాలు పెట్టుకుందామని"

ఈలోగా కామేశ్వరి చీరెలు పేక్ చేసి బయటకు నడిచింది. ఆ వెనుకే వెళ్లిపోయింది చంద్రకాంతమ్మ.

చినబాబు భుజంమీద శేషాద్రి ఆప్యాయంగా నొక్కాడు.

"నాన్నా" శేషాద్రి కళ్లలోకి చూశాడు చినబాబు.

"ఒప్పుకో బాబూ. నీ పెళ్లితో ఈ యింట్లో సోషలిజం వస్తుందంటే... అంతకన్నా కావల్సిందేముంది"

"అది కాదు... నాన్నా..."

"ఇంకేం మాట్లాడకు" శేషాద్రి అక్కడ్నుంచి వెళ్లిపోయాడు చినబాబుకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా.

అంతవరకూ పొంచి వింటున్న చినబాబు పెద్దన్న కూతురు అమ్మలు ఉరఫ్ రమ్యగీతిక ఒక్క పరుగులో వెళ్లి తల్లికి ఉప్పందిం

చింది.

"ఏమండీ... విన్నారా? మీ అనుంగు సోదరుడు... పెళ్లికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాట్ట"

శ్రీధర్‌తో అంది సౌభాగ్య.

"ఒరేయ్ శ్రీనూ... చినబాబు పెళ్లికి ఒప్పుకున్నాట్ట" రెండో తమ్ముడు శ్రీనివాస్‌కు చెప్పాడు శ్రీధర్.

"ప్రభా! మీ బుల్లిమరిదికి పెళ్లట్రోయ్. అబ్బాయిగారు దార్లో పడ్డారు" శ్రీనివాస్ భార్యతో అన్నాడు.

"ప్రశాంతీ... విన్నావా? చినబాబు పెళ్లి కొడుకవుతున్నాడు" ప్రభావతి, ప్రశాంతి గది తలుపు తట్టి మరీ చెవినేసింది.

"ఏమండీ..."

"విన్నాలే శాంతీ... కల్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదని... ఇప్పటికొచ్చింది మా చినబాబుకు పెళ్లి ఘడియ" తృప్తిగా నిట్టూర్చాడు శ్రీకాంత్.

అబ్బిగాడు స్థాణువయ్యాడు. 'బాబాయ్... ఓ బాబాయ్...'

ఇల్లంతా వెదికి చివరికి టెర్రస్‌మీదకు వెళ్లాడు.

చినబాబు ఎప్పట్లా పేరాపిట్ వాల్ నానుకుని నిలబడి వున్నాడు. చేతిలో ఏదో ఉత్తరంలాంటిది వుంది. అతని కళ్లు అక్షరాల వెంట పరుగులు తియ్యటం గమనించి అబ్బిగాడు నిశ్శబ్దంగా అతని వెనక నిలబడ్డాడు.

"డియర్ చినబాబూ,

నేనడిగిన మూడు ప్రశ్నలకూ ముక్కుసూటి సమాధానాలిచ్చి... నాకెంతో నచ్చేశావ్. ఎటువంటి డ్రామాలేని నీ మాటలు... హిపోక్రసీలేని నీ మనస్తత్వం నన్నెంతగానో ఆకట్టుకున్నాయి. నీలాంటి ప్రాక్టికల్ మనుషులంటే నాకెంతో ఇష్టం. ఎదుటి మనిషికి అంత నిర్భయంగా... నిస్సంకోచంగా నీ అభిప్రాయాల్ని చెప్పగలగటమే నీ ప్లస్ పాయింట్. నీ మాటల్ని బట్టి నువ్ చాలా సిన్సియర్ అని అర్థమైంది. సో... నిన్ను తప్ప నేనింకెవర్నీ పెళ్లిచేసుకోను. నీ జవాబుకోసం ఎదురుచూస్తూ...

నీ కాబోయే శ్రీమతి నేరెళ్ళ"

"ఇదా విషయం... పిల్లగాలికి ఐస్‌క్రీమ్‌లా కరిగిపోయావా బాబాయ్"

ఉలిక్కిపడి ఇటు తిరిగాడు చినబాబు.

"నువ్వా అబ్బీ!" అన్నాడు.

"నేనే. ఏం మరోలా కనబడుతున్నానా? చేతిలోకి ప్రేమలేఖ రాగానే"

"ఛ... ఏం మ ఓట్లా అవి? "

"అద్సరే... త్వరలో తమరి వివాహ మహోత్సవమని విన్నాను"

చినబాబు నిట్టూర్చాడు. "ఏంటోరా... నా పెళ్లితో ఈ యింట్లో ఓ మంచి మార్పు వచ్చేలావుంది. అందుకనే ఈ త్యాగానికి సిద్ధపడ్డా"

అబ్బిగాడు ఏదో అనబోతున్నంతలో... అమ్మలు గస పెట్టుకుంటూ వచ్చింది "బాబాయ్... నాన్నమ్మా... అమ్మా... పిన్నమ్మలిద్దరూ పోట్లాడుకుంటున్నారు. కామేశ్వరత్తయ్య ప్రశాంతి పిన్నిని చెంపమీద కొట్టింది"

ఒక్క దూకులో కిందకొచ్చాడు చినబాబు.

రామరావణ యుద్ధం జరుగుతున్నట్టుగా వుందక్కడ.

చిన్నోదిన చెంప పట్టుకుని ఏడుస్తోంది. కామేశ్వరి చంద్రకాంతమ్మ వెనక నిలబడి వుంది. శ్రీధర్ కామేశ్వరినేదో అంటున్నాడు. ప్రభావతి రుసరుసలాడుతూ అందర్నీ నమిలి మింగేలా చూస్తోంది. శేషాద్రి నిమ్మకు నీరెత్తినట్టు నిస్సహాయంగా నిలబడి వున్నాడు.

ఇవేవీ కాదు చినబాబు దృష్టిని ఆకర్షించింది... అందరి మధ్యా టీపాయ్ మీద చిందరవందరగా పడివున్న పట్టుచీరలు... అన్నీ ఒకేరకంగా వుండి అతన్ని ఆకట్టుకున్నాయి.

అయోమయంగా చూస్తున్న చినబాబుతో వలవల ఏడుస్తూ చెప్పింది చంద్రకాంతమ్మ

"చూశావ్రుట్రా చిన్నా...! కోడళ్ళంతా ఒకటే అని సమానంగా చీరెలు తెచ్చానా? .. ఏం జరిగిందో చూడు... అసలు..."

"ఏమిటండీ మాట్లాడుతున్నారు. పైసా కట్నంలేని మీ చిన్న కోడల్ని... మూడు లక్షల కట్నం తెచ్చిన నన్నూ ఒకే గాటికి కట్టేస్తారా? " గయ్యిమంది ప్రభావతి.

"ఇంటికి పెద్దకోడల్నన్న గౌరవం ఏమైనా వుందా మీకు? మిగతా ఇద్దరికీ నాకూ తేడా లేదూ? అవ్వ! అందరికీ ఒకేరకం చీరెలా? "

సౌభాగ్య దులిపేసింది.

"ఎందుకండీ ప్రేమించి చేసుకున్నారు నన్ను? మీ స్టేటస్‌కి తగ్గట్టే... కట్నకానుకలు తెచ్చేదాన్నే చేసుకోకూడదూ? "

ప్రశాంతి వెక్కివెక్కి ఏడుస్తోంది.

"హు... హుంకరించింది కామేశ్వరి. కోడళ్ళకూ కూతురికీ తేడా తెలీదు నీకు. కడుపున పుట్టిన దాన్నని కూడా చూడకుండా కోడళ్ళతో సమానంగా కొంటావా నాకీ చీరె? ఈ యింటి ఆడపడుచుకు ఇదేనా నువ్విచ్చే గౌరవం"

"చినబాబూ... వింటున్నావా? " చంద్రకాంతమ్మ చూపుడువేలుతో అందర్నీ చూపిస్తూ కంప్లెయింట్ చేసింది.

"అంతా విన్నానమ్మా. ఇక మీ గోల ఆపి

నే చెప్పేది మీరు వినండి. ఓ రెండు గంట లక్రితం పెళ్లిచేసుకుంటాను అని చెప్పా కదా! ఇప్పుడు నా నిర్ణయం మారింది. నేను పెళ్లి చేసుకోను గాక చేసుకోను. అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు చినబాబు.

★ ★ ★

వాల్ క్లాక్ ఆరుగంటల్ని సూచిస్తోంది. కప్పుకున్న దుప్పటి తొలగించి లేచి కూర్చు న్నాడు హరేరామ్.

పారిజాతం నిద్రలో అటునుంచి ఇటు తిరిగింది. ముఖంమీద పడుతున్న ముంగు రులు సవరించి ఆమెనుదిటిమీద ముద్దుపె ట్టుకున్నాడు. లేచి నిలువుటద్దంలో చూసుకుని క్రాఫ్ దువ్వుకున్నాడు.

రాత్రి సింక్‌లో పడేసి వుంచిన అంట్లన్నీ శుభ్రంగా కడిగాడు. గదులన్నీ వూడ్చి ఫర్ని చర్ తుడుస్తుండగా కాలింగ్ బెల్ మోగింది.

హడావుడిగా వచ్చి పారిజాతాన్ని కుది పాడు "ఏమిటండీ" చిరాగ్గా ముఖంపెట్టి గారాబంగా అడిగింది.

"పాలు"

పారిజాతం విసుగ్గా లేచింది. హరేరాం అందించిన పాలగిన్నె అందుకుని తూలుతూ వెళ్లి తలుపు తీసింది.

పాల నాగమ్మ కాస్త లోపలికి వచ్చి కేన్ నేలమీదపెట్టి క్రీగంట తలుపులు బార్లా తీసున్న బెడ్ రూమ్‌కేసి చూసింది. ముసు గుతన్ని పడుకుని వున్న హరేరామ్ కన్పిం చాడు.

"అయ్‌గోరింకా లెగలేదామ్మా" అడుగుతూ పాలు పోసింది.

"ఆయనిప్పుడెక్కడ లేస్తారు నాగమ్మా. వంటంతా చేసి కేరియర్‌తో సహా సర్దాక ఇక ఆఫీసుకు పదినిముషాలు టయముంద నగా లేస్తారు. ఎంతయినా మగ మహారా జుకదా"

"మరేమ్మా. సుకమంతా ఆళ్ల ముకాన్నే రాశాడా పాపిష్టి దేవుడు. ఓ పని పిల్లనన్నా పెట్టుకోకూడదమ్మా" జాలిగా అడిగింది.

"ఆయనకలాంటివి ఇష్టముండదు నాగమ్మా. అన్నీ సొచేత్తో చేస్తే తృప్తి"

"ఇల్లాలంటే నీకు మల్లే వుండాలమ్మా. తలుపేసుకో తల్లీ. నే పోతున్నా"

తలుపు బోల్టు పెట్టగానే దుప్పటి తన్నేసి లేచాడు హరేరామ్. పాలగిన్నె అతనికం దించి మళ్లీ పడుకుంది పారిజాతం. పాలు కింద పెట్టి పారిజాతానికి దుప్పటి సరిగా కప్పాడు.

తరువాత కిచెన్‌లోకెళ్లి పాలకుక్కర్ స్టౌమీద కెక్కించి బాత్‌రూమ్‌కెళ్ళాడు. స్నానం ముగించి వచ్చి రెండు కప్పుల్లో కాఫీ కలిపాడు.

వెళ్లి పారిజాతం బెడ్ దగ్గర నిలబడి ఆమెను పిలిచాడు "లే పారూ... కాఫీ"

"ఇంకొంచెం సేపు పడుకుంటానండీ" ముఖంమీద దుప్పటి తొలగించి బుంగ మూతి పెట్టింది.

"మా అమ్మకద... లే పారూ..."

పారిజాతం అయిష్టంగా లేచికూర్చుని కళ్లుమూసుకునే కాఫీ తాగింది.

ఆమె తాగేలోపు తనూ తాగేసి ఆమె ఖాళీ చేసిన కప్పు అందుకుని అడిగాడు "ఏం టిఫిన్ చెయ్యమంటావ్?"

"ఈరోజు సన్‌డే కదా... ఆఫీసుకెళ్ళేపని లేదుగా"

"అవును"

"అయితే పూరీ... కుర్మా చెయ్యండి"

"ఓ.కె. నువ్వలా పడుకో. చిటికెలో చేసేస్తా" హుషారుగా లేచాడు.

"ఇక పడుకోన్లెండి. స్నానం చేసొస్తా. ఈలోగా..."

"మరో కప్పు కాఫీ..." అంతేనా అన్నట్టు చూశాడు.

"భార్య మనోగతాన్ని ఎంతందంగా అర్థం చేసుకుంటారండీ మీరు! ఐ యామ్ లక్కీ"





అతని బుగ్గలు పుణికి బాత్‌రూమ్‌లోకెళ్లిపోయింది పారిజాతం.

ఆ మెచ్చుకోలుతో హరేరామ్ ఉత్సాహంగా కార్యరంగంలోకి దూకాడు. బంగాళదుంపలు స్టౌమీద పెట్టి అవి ఉడికే లోపు పూరీ పిండి కలిపాడు.

"ప్రేమ యాత్రలకు బృందావనమూ నందనవనమూ ఏలనో... ప్రేమించిన పతి చెంతనుండగా వేరే స్వర్గము ఏలనో..." పాడుకుంటూ స్నానం ముగించింది పారిజాతం. షాంపూ చేసుకున్న జుట్టు ఆర్పుకుంటూ వచ్చి వంటగది గుమ్మంలో నిలబడింది.

"పూరీలు వత్తనా? " అడిగింది ఫార్మల్ గా.

"వద్దు. నువ్వలా నిలబడి కబుర్లు చెబుతూండు. క్షణంలో చేసేస్తా"

"కబుర్లు బోర్. ఓపాట పాడతా" చెప్పిందామె.

"నువ్వేం చేసినా అది నా అదృష్టమే పారూ"

అతను పూరీలు వత్తుతుంటే ఆమె పాడుతూ నిలబడింది.

"నిన్నే నిన్నే నే వలచినది... నువ్వే నువ్వే కావలసినదీ..."

హరేరామ్‌కి పనిచేస్తున్నట్టే అన్పించటం లేదు. పారిజాతం పాటలు వింటూ... తేలిగ్గా... అలసట లేకుండా చేసేశాడు పూరీలన్నీ.

టిఫిన్ డైనింగ్ టేబుల్ మీద సర్ది ఇంకా కిచెన్ గుమ్మంలోనే అభిసారికలా నిలబడ్డ పారిజాతాన్ని పిలిచాడు.

హరేరామ్ కళ్లలోకి ఆర్తిగా చూస్తూ "నీవేనా నను పిలిచినదీ... నీవేనా నను తలచినదీ..." అంది పారిజాతం.

"నేనే పారూ. దా కూర్చో"

ఆమె కూర్చున్నాక పూరీ కాస్త తుంచి కుర్మా అద్ది ఆమెనోటి కందించబోయాడు.

సరిగ్గా అప్పుడే మోగింది కాలింగ్‌బెల్! హరేరామ్ చప్పున కుర్చీలో కూర్చుని ఫోజుగా పూరీ ప్లేటు తన ముందుకు లాక్కున్నాడు.

పారిజాతం ముఖం చిట్లించుకుని లేచివెళ్లి తలుపు తీసింది.

గుమ్మంలో నుంచున్న చినబాబును చూడగానే ముఖం ప్రసన్నంగా చేసుకుంది. "రండి... రండి..." సాదరంగా ఆహ్వానించింది.

"ఓ... చిన్నా... నువ్వా... రావోయ్ రా సమయానికొచ్చావ్. మీ చెల్లెలు ఉదయాన్నే లేచి...పూరీ... కుర్మా చేసేసింది" అసందర్భంగా చెప్పాడు.

"అబ్బే... వద్దురా టిఫిన్ చేసే బయలుదేరా"

"పర్లేదులే తినన్నయ్యా. ఏమిటో... ఆయనకు రోజూ హడావుడే. ఈ వేళన్నా... ఇంటి పట్టునుండి తింటారని ఆయనకిష్టమైన టిఫిన్ చేశా. చెల్లెలి చేతివంట నువ్వూ రుచి చూడన్నయ్యా"

చినబాబు మొహమాటపడిపోయి హరేరామ్‌కెదురుగా కూర్చొని పూరీ ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

"నువ్వూ కూర్చోమ్మా" చెప్పాడు పారిజాతంతో.

"వద్దులే అన్నయ్యా... మీరు కానీండి. ఆయన తిన్నాక... ఆ ప్లేట్లోనే తినడం నా అలవాటు"

చినబాబు అబ్బురంగా చూశాడు పారిజాతంవైపు. "ప్రపంచంలో ఇటువంటి పెళ్లాలు కూడా వుంటారా" అన్నట్టు.

తరువాత మౌనంగా పూరీ తినడంలో మునిగిపోయాడు. హరేరామ్ పారిజాతం వైపు నొచ్చుకున్నట్లుగా చూసి... విధిలేక తనూ తినసాగాడు.

"హరీ... పెళ్లిమీద నీ అభిప్రాయం ఏంటిరా? " వున్నట్టుండి అడిగాడు పూరీ తినడం ఆపి చినబాబు.

హరేరామ్ చినబాబు కళ్లలోకి సూటిగా చూసి తిరిగి పారిజాతం కళ్లలోకి ఆరాధ

నగా చూశాడు "పెళ్లంటే నూరేళ్లవంటరా" తన్మయంగా చెప్పాడు.

చినబాబుకి పొలమారింది. పారిజాతం చటుక్కున నీళ్లగ్లాసు అందించి చెప్పింది. "పంట అనబోయి వంట అన్నారన్నయ్యా. చిన్న అక్షరదోషం".

"ఐయామ్ సారీ. పెళ్లంటే నూరేళ్లపంట. జీవితంలో అనుభవించి తీరవలసిన అతి ముఖ్యమైన పీరియడ్ అది"

"కానీ... మా యింట్లో పరిస్థితి నీకు తెలుసుగా హరీ. ఒక కప్పుకింద .... నాలుగు కాపురాలు. ఒక్కకోడలూ అమ్మను సుఖపెట్టడంలేదు. అన్నయ్యలు భార్యలెంత చెబితే అంత. అలాగని భార్యాభర్తలు సుఖంగా వుంటున్నారా అంటే... వాళ్లలో వాళ్లకు సవాలక్ష గొడవలు"

"అందుకనీ..." హరేరామ్ ఆవేశంగా అన్నాడు. "అందుకని పెళ్లి చేసుకోవటం మానేస్తావా. మొన్న బజార్లో మీ నాన్న గారు కనబడి నీ గురించి ఎంత బాధపడ్డా రనుకున్నావ్"

"అదికాదురా..."

"ఏది కాదురా... అహా... ఇలాగే పెళ్లీ పెటాకులూ లేకుండా వుండిపోతావా జీవి తాంతం? మేమిద్దరం చూడు... ఎంత అన్యోన్యంగా కాపురం చేసుకుంటున్నామో. మమ్మల్ని చూసైనా నీ మనసు మార్చు కోరా"

పారిజాతం మెరిసే కళ్లతో హరేరామ్‌ని చూస్తూ అంది "అవునన్నయ్యా... ఇలాంటి భర్త దొరకడం నా పూర్వజన్మ సుకృతం"

"అదేమిటి పారూ.... నీలాంటి భార్య దొరకడం నా పూర్వజన్మ సుకృతంగానీ"

"అబ్బే... అలాకాదండీ... మీరు దొరక డమే..."

"సర్లెండి... ఇద్దరికిద్దరూ అపురూపమైన జంట. ఆదర్శ ప్రాయమైన కాపురం" చిన



బాబు సర్టిఫికెట్ ఇచ్చేశాడు.

"ఒక్కటే లోటన్నయ్యా" పారిజాతం కళ్లు తుడుచుకుంది.

"ఏమిటమ్మా"

"నాకత్తమామలు లేరే అని ఒకటే బాధ. ఇప్పుడు కేవలం పతిసేవే దక్కింది. వారూ వుంటే... వారినీ సేవించి జన్మ చరితార్థం చేసుకునే దాన్ని"

చినబాబు కళ్లలో నీళ్ళు తిరిగినయ్.

"వాళ్లు లేకపోవటం ఓ రకంగా నా అదృ ష్టంలే పారూ" హరేరామ్ అన్నాడు.

"ఛ. అవేం మాటల్రా... తల్లి దండ్రుల్ని పట్టుకుని" చినబాబు నొచ్చుకున్నాడు.

"అదికాదు లేవోయ్. వాళ్లులేకపోబట్టే కదా... ఇప్పుడు నాపారూ సేవలన్నీ నాకే దక్కింది" పారిజాతంవైపు గొప్ప అభిమా నంగా చూశాడు.

ఆమె అందంగా సిగ్గుపడింది.

"మాటల్లోపడి అసలు విషయం దాటేశాం. పెళ్లంటే నా అభిప్రాయం ఏంటని కదూ అడిగావ్. పెళ్లంటే... ఒక వరం పెళ్లంటే... ఒకపోరాటం... పెళ్లంటే... ఒకాట... ఒకపాట... ఒక వంట..."

"ఇక చాల్లెండి"చెప్పింది పారిజాతం.

హరేరామ్ చప్పున ఆపేసి మళ్లీ చినబా బువంక చూశాడు "దేర్ ఫోర్ పెళ్లివర మైతే... ఆ వరాన్ని అనుభవించి తరిం చాలి. పోరాటమైతే పోరాడి జయించాలి. ఆటైతే ఆనందంగా ఆడుకోవాలి. పాటైతే మధురంగా పాడుకోవాలి... వంటయితే కమ్మగా వండుకోవాలి..."

"ఇక చాల్లెండి..." మళ్లీ చెప్పింది పారి జాతం.

హరేరామ్ ఆపి మళ్లీ అన్నాడు "దేర్ ఫోర్... ఆలోచించకుండా పెళ్లి చేసుకో. అనుభవించు... ఆనందించు... తరించు... జయించు... ఆడుకో... పాడుకో... వండుకో..."

"ఇక చాల్లెండి"

"దేర్‌ఫోర్ నామాట వినేసెయ్. ఇప్పటికే చాలా చెప్పేశాను. నీ బ్రెయిన్ వాష్ చెయ్యగలిగిన గొప్పతనం నాకు దక్కనీరా... పిల్లను చూడనా మరి?"

చినబాబు కంగారు పడ్డాడు "ఎబ్బెబ్బే... తర్వాచ్చెబుతాలే"

"నువ్ బాగుపడవ్‌రా. ఇలాగే అఘోరించు... ఆనక విచారించు... తరువాత పరితపించు... చివరికి..."

"ఇక చాల్లెండి... చినబాబు వెళ్లిపోయాడు"

"దేర్‌ఫోర్... మరి నువ్వు కూర్చో టిఫిన్ తినిపిస్తా"

పారిజాతం కూర్చుండి ముసిముసిగా నవ్వుకుంటూ హరేరామ్ పూరీ తుంచి నోటికందిస్తుంటే అతగాడి చేతిని ముద్దుగా కొరికి చెప్పింది "మధ్యాహ్నం లంచ్‌కి చికెన్ బిరియానీ కావాలండీ"

"చేస్తా పారూ... పెళ్లి... ఒక వంట! కమ్మగా వండుకోవాలని ఇప్పుడే కదా చెప్తూంట మా చినబాబుకి. తప్పకుండా వండుతా చికెన్ బిరియానీ. ప్రామిస్" ఎగ్జయిట్ అయిపోతూ చూశాడామెకళ్లలోకి.



ఆఖరి జత అది. గబగబ ప్యాంట్ వేసుకున్నాడు. షర్ట్ తొడుక్కుని గుండీలు పెట్టుకోబోయి హతాశుడయ్యాడు.

"అమ్మా... అమ్మా" అరిచినట్టుగా పిలిచాడు.

వంటింట్లో తంటాలు పడుతున్న చంద్రకాంతమ్మ ఉస్సురంటూ ఆపసోపాలు పడుతూ వచ్చింది.

"ఏంటిది.. ఒక్క పాంటుకూ జిప్ సరిగా లేదు... ఏ షర్టు చూసినా ఒక్క గుండీ లేదు"

"దానికి నన్నేం చెయ్యమంటావ్? పెళ్లాన్ని గదమాయించినట్టు ఎవరి మీద ఆ అరుపులు"

"కొంచెం కుట్టిపెట్టమ్మా! బ్యాంక్‌కి టైమవుతోంది"

"నా వల్లకాదు. నాకు చూపు ఆనటం లేదు. నువ్వే కుట్టుకో నాయనా! పెళ్లిచేసుకుంటే ఎంచక్కా పెళ్లాం కుట్టిపెట్టేదిగా"

"బటన్ కుట్టడానికి పెళ్లామే అక్కర్లేదులే. నేను కుట్టుకోగలను"

చినబాబు రోషంగా కేలెండర్‌కు గుచ్చిపెట్టిన సూది తీసుకుని బటన్స్ కుట్టుకోవడం మొదలెట్టాడు.

"బాబాయ్... ఆ చేత్తోనే కాస్త ఈ లాగూ బటన్ కూడా కుట్టిపెడుదూ" అబ్బిగాడు హడావుడిగా వచ్చాడు.

"ఇంకా నయం, నీ నోరు కుట్టమన్లేదు. నాకు టైంలేదు. అవన్నీ సాయంత్రం. అమ్మా టిఫిన్" చిరాగ్గా కేకేశాడు చినబాబు.

"నువ్వూ కూర్చోరా అబ్బీ" చెప్పింది చంద్రకాంతమ్మ.

"ఏమిటి నాన్నమ్మా! ఉప్మానా... పెట్టెయ్"

చినబాబూ, అబ్బిగాడూ టిఫిన్‌కి కూర్చున్నారు.

"అద్భుతం నానమ్మా!" చెప్పాడు అబ్బిగాడు.

ఉప్మా నోట్లో పెట్టుకున్న చినబాబు ముఖం చేదుగా అయిపోయింది. "అమ్మా..

ఏమిటమ్మా యిది... ఉప్పేలేదు చప్పగా అసహ్యంగా వుంది"

"ఏరా అబ్బీ" అవునా అన్నట్టు అడిగింది చంద్రకాంతమ్మ అబ్బిగాడ్ని.

"ఏంటిబాబాయ్ నువ్వు! ఉప్మా అమృతంలా వుంటేనూ"

అబ్బిగాడు నోటికి చేతికి సందులేకుండా తింటున్నాడు.

"అమ్మ చేతివంట కూడా చేదైంది ఇన్నాళ్లకు. ఇక నావల్ల కాదురా! పెళ్లాన్ని తెచ్చుకున్నావా సరి కొన్నాళ్లపోతే నేనీమాత్రం కూడా వండలేను" తెగేసి చెప్పిందామె.

చినబాబు విసురుగా లేచాడు. "వంటకు పెళ్లామే అక్కర్లేదులేమ్మా! నువ్వంత చెయ్యలేకపోతే ఓ పనిమనిషిని పెట్టుకుంటాలే"

చినబాబు స్కూటర్ స్టార్టవగానే అడిగాడు అబ్బిగాడు నాన్నమ్మను, "నాన్నమ్మా... ఉప్మా ఇంత బాగుంటే అంతెత్తున ఎగురుతాడేంటి బాబాయ్"

"బాబాయ్ ప్లేట్లోది తిని చూడరా నీకే తెలుస్తుంది" సన్నగా నవ్వింది చంద్రకాంతమ్మ.

అబ్బిగాడు చినబాబు వదిలేసిన ఉప్మాని ఓ స్పూన్ నోట్లో వేసుకుని.. ఒక్క పరుగులో వాష్‌బేసిన్ దగ్గరకెళ్లి వూసేశాడు.

"ఇలా చేస్తేగాని తిక్కకుదిరి పెళ్లిచేసుకోడురా మీ బాబాయ్" చెప్పిందామె.

"చొక్కా బొత్తాములు పీకేసింది కూడా నువ్వేనా? " అనుమానంగా అడిగి, "ఇద న్యాయం... మహాపాపం" అన్నాడు అబ్బిగాడు కోపంగా.

"పెళ్లిచెయ్యడం పుణ్యమేకాని పాపం కాదురా. అసలు నీకీ విషయాలెందుగ్గాని ఇంకా స్కూలు కెళ్లలేదేం"

"ఇవాళ అమ్మకు జ్వరంగా వుందట. నన్ను సాయం వుండమంది"

"అయ్యోపద చూద్దాం" చంద్రకాంతమ్మ గబగబ ఆఖరి కోడలి గదిలోకెళ్లింది.

ప్రశాంతి ముసుగుతన్ని పడుకుని వుంది.

దుప్పటి తొలగించి చెయ్యిపట్టుకు చూసింది. ఒళ్లు పేలిపోతోంది.

"మీ నాన్నేమిత్రా... పిల్ల జ్వరంతో పడుంటే దున్నపోతులా ఆఫీస్‌కెళ్లిపోయాడు" కొడుకును తిట్టుకుంది.

"టాబ్లెట్ ఇచ్చారత్తయ్యా. తగ్గుతుందిలే అని నేనే వెళ్లమన్నా. ఎక్కువైతే మీరంతా లేరూ" అంది ప్రశాంతి లేచి కూర్చుంటూ.

"ఎందుకు లేము తల్లీ! అందరికీ అందరం వున్నాం. పద.. హాస్పిటల్‌కి వెళదాం. ఒరే అబ్బిగా వెళ్లి తాతయ్యను పిల్చుకురా"

శేషాద్రి హడావుడిగా వచ్చాడు, "ఏమ్మా.. జ్వరమా? పదతల్లీ.. ఒరే అబ్బీ.. వెళ్లి రిక్షా పిలువ్" అబ్బిగాడు వీధిలోకి పరిగెత్తాడు.

"అరె...జ్వరమా! నాకు తెలీదే... నూట మూడున్నట్టుంది. ఇంజెక్షన్ పడాల్సిందే" తన వాటాలోంచి వచ్చి ప్రశాంతి నుదురు పట్టుకుని చెప్పింది ప్రభావతి.

"ఇంద ఈ హార్లిక్స్ తాగమ్మా లే.. అలా కూర్చో.." గబగబ కలుపుకొచ్చి ఆప్యాయంగా గ్లాసందించింది సౌభాగ్య.

"తాతయ్యా రిక్షా" అబ్బిగాడు వాకిట్లోంచి కేకేశాడు.

ప్రశాంతి వద్దూ తగ్గిపోతుంది అంటున్నా ఎవరూ విన్పించుకోలేదు. ఆమెనంతా కలసి రిక్షాలో ఎత్తి కూర్చోపెట్టినంత పనిచేశారు. పక్కనే కామేశ్వరి కూర్చుంది.

అబ్బిగాడికి ఆ దృశ్యం ఎంతగానో నచ్చింది.

మొన్నటికి మొన్న చీరలకోసం కుమ్ములాడుకున్న మనుషుల్లో ఈ రోజు ఇంత ఆప్యాయతా!

ఈ విడ్డూరమేంటో! వెంటనే... బాబాయ్‌కి చెప్పాలన్పించింది. అందుకే సాయంత్రం ఎప్పుడెప్పుడవుతుందా... చినబాబు ఎప్పుడొస్తాడా అని కళ్లలో వత్తులేసుకుని చూశాడు.




ఆ సాయంత్రం ఎప్పట్లా... ఇద్దరూ టెర్రేస్ మీదచేరి పేరాపిట్ వాల్‌నానుకు నిలబడి వున్నప్పుడు చెప్పాడు అబ్బిగాడు

"బాబాయ్... నువ్ పెళ్లి చేసుకుంటే బాగుంటుందేమో!"

"ఏమిట్రా... కారు కూతలు కూస్తున్నావ్? " కయ్‌మన్నాడు చినబాబు.

"అదికాదు బాబాయ్.. ఉదయం మా అమ్మకు జ్వరమొస్తే నాన్నమ్మా.. పెద్దమ్మలూ ఎంత తల్లడిల్లిపోయారని! ఒకరితో ఒకరు ఎంత అభిమానంగా వున్నారని. చెప్పొద్దూ.. వున్నట్టుండి నాకు వివాహ వ్యవస్థ మీద సదభిప్రాయం కల్గిందనుకో. పెళ్లి అనేది జరగబట్టేకదా! కుటుంబం అనేది ఏర్పడింది. ఆ కుటుంబం అనేది ఏర్పడబట్టేకదా! ఒకరికొకరం బంధువులమైంది... బంధువులవబట్టే గదా ఒకరిపట్ల ఒకరికి ఈ అభిమానం"

"ఒరేయ్ అబ్బీ..." చినబాబు అలవాటుగా పళ్లు కొరికాడు.

"వుండు బాబాయ్! నన్ను చెప్పనీ... నువ్వు పెళ్లీ పెటాకుల్లేకుండా వుండిపోతే నీకు ఓ కుటుంబం అంటూ ఏర్పడదు. జీవితంలో నువ్వు ఒంటరిగా మిగిలిపోతావ్. ఏకాకిలా జీవిస్తావ్. దిక్కూ మొక్కూలేక విలపిస్తావ్. వద్దు బాబాయ్! నువ్వూ.. ఓ ఇంటి వాడివైపో. నీకు నచ్చిన పిల్లను చూసే పూచీ నాది"

అబ్బిగాడు చెమర్చిన కళ్లను తుడుచుకున్నాడు.

చిత్రంగా చినబాబు ఎగిరిపడలేదు ఎప్పట్లా. చాలా సేపు మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

నిన్న హరేరామ్ ఉద్బోధ.. ఈ రోజు అబ్బిగాడి సద్బోధ.

చినబాబు మనసులో... ఏ అట్టడుగు పొరలోనో ఓ కదలిక మొదలైంది.



"హాయ్ కామ్..."

నిద్ర కళ్లు నులుముకుంటూ చూసింది కామేశ్వరి.

భుజాల వరకూ దిగిన క్రాఫూ... ఓ చెవికి రింగూ బ్లూకలర్ జీన్స్‌ప్యాంట్‌లోకి లైట్ ఎల్లోకలర్ షర్ట్ టక్‌చేసి రేబాన్ గ్లాసులోంచి తన్నే చూస్తున్నాడో వ్యక్తి.

కాలింగ్ బజర్ సవ్వడి విని పాలేమోనని తలుపు తీసిన కామేశ్వరి.. అనుకోని మనిషి కళ్లముందు నిలబడేసరికి ఓ అడుగు వెనక్కువేసింది.

చిత్తువత్తుగా పెరిగిన గడ్డాన్ని స్టైలిష్‌గా నిమురుకుంటూ ఆమె మీదకు వచ్చినట్టుగా రెండడుగులు ముందుకు వచ్చాడు.

కెవ్వుమంది కామేశ్వరి.

మెలకువొచ్చినా లేవబుద్ధిగాక... పక్కల మీద సుఖంగా అటూ ఇటూ పొర్లుతున్న ఆ ఇంట్లోని యావన్మందీ.. స్ప్రింగ్ యాక్షన్‌తో ఒక్కసారిగా లేచి కూర్చున్నారు.

"కామేశ్వరీ ఏమైందమ్మా!"

ఆదరాబాదరా వచ్చిన చంద్ర కాంతమ్మ గడపలో కామేశ్వరిని కదలనీయకుండా అటో చెయ్యి ఇటో చెయ్యివేసి నిలబడ్డ ఆగంతకుడ్ని చూసి తనూ కెవ్వుమంది.

ఈలోగా బిలబిలమని వచ్చేశారందరూ.

"రేయ్.. ఎవడ్రా నువ్వూ!" శ్రీధర్ ఆ వ్యక్తిని ఒక్క తోపుతోశాడు.

పడబోయి నిలదొక్కుకుని క్రాఫ్ విదిలించుకుని ఒక్కసారి తలెగరేశాడు. "నన్నే గుర్తుపట్టలేదా? "

"ఏమిట్రా నిన్ను గుర్తుపట్టేది. దేశ ప్రధానివా? సినిమా హీరోవా" శ్రీనివాస్ ఎద్దేవా చేశాడు.

"అంతకంటే ఎక్కువే నేను" చెవిరింగు తడుముకుని రోషంగా అన్నాడు.

"ఎవరికిరా... ఎవరికెక్కువరా నువ్వు? పొద్దున్నే ఇళ్లమీదపడి ఆడపిల్లల్ని అల్లరి పెట్టడానికి సిగ్గులేదూ? "

"కామేశ్వరిని పంపించండి తీసుకుని వెళ్లిపోతాను. ఇక ఈ ఇంటి గడప తొక్కను" మొండిగా అన్నాడతను.

"ఒరే చిన్నా.. పోలీసులకు ఫోన్ చెయ్.. మరీ రెచ్చిపోతున్నాడు"

చినబాబు నంబర్ డయల్ చేయబోతుండగా కెవ్వుమని వినబడింది ఆగంతకుని కేక.

"ఒరే బామ్మర్దీ. చాలుచాలు... ఈ ఇంటల్లుడికి మీరు చేసిన మర్యాద చాలు. మళ్లీ పోలీసులు కూడా ఎందుకు? " ఆ వ్యక్తి కళ్ల నీళ్ల పర్యంతమౌతూ అన్నాడు.

"ఏంటీ... నువ్వు... నువ్వు"

"ఏమండీ.. మీరు... మీరు..."

"అరె.. ఆనంద్ మామయ్యా" అందరి కన్నా ఆలస్యంగా నిద్రలేచిన అబ్బిగాడు ఆ వ్యక్తిని చూస్తూనే ఆనందంగా అరిచేశాడు.

అందరూ అబ్బురంగా అబ్బిగాడి కేసి చూశారు. "ఎలా కనుక్కున్నావురా. మేమింతమందిమీ గుర్తు పట్టలేకపోయాం"

"జనరేషన్ గేప్ అంటే ఇదే. మా షార్ప్‌నెస్ మీకుండదు" అబ్బిగాడు గర్వంగా చూశాడు.

"ఏంటల్లుడూ ఈ అవతారం? " ఆశ్చర్యపోయాడు శేషాద్రి.

కొన్ని ఘనకార్యాలు సాధించడానికి శ్రీమహావిష్ణువంతటి వాడే మత్స్యావతారం.. కూర్మావతారం లాంటివి ఎత్తాడు మామయ్యా! హూం... మానవులం మనమెంత. భార్యా వియోగం భరించలేక నేనీ అవతారం ఎత్తాల్సి వచ్చింది. ఫ్లాష్‌బ్యాక్ కావాలంటే మీ అమ్మాయినే అడిగి తెలుసుకోండి"

"ఆ ఫ్లాష్ బ్యాక్ గట్రా తర్వాత వింటాంలే బాబూ! ముందు నువ్ లోపలికిరా. స్నానమదీ కానిచ్చి కాఫీ తాగి కాస్త తెరిపినపడు. వచ్చినవాడ్ని వచ్చినట్టే గుమ్మంలో నుంచో బెట్టేశాం"

అల్లుడ్ని అనుమానించినందుకు నొచ్చుకుంది చంద్రకాంతమ్మ. భుజాన్నుండి వేలాడుతున్న ట్రావెలింగ్ బేగ్‌ని టీపాయ్ మీద పెట్టి స్నానానికి వెళ్లాడతను.

అందరూ కామేశ్వరిని చుట్టుముట్టారు.

"ఇదేం చోద్యమే.. కామేశ్వరీ. ఏనాడూ నా అల్లుడు టక్కు చేసి కూడా ఎరగడు. భుజాలు దిగిన క్రాపుతో బుద్ధిమంతుడిలా వుండేవాడు" చంద్రకాంతమ్మ ఆనందరావు గత రూపాన్ని కళ్లముందు నిలుపుకుని కళ్లు తుడుచుకుంది.

"అవును నాన్నమ్మా! చక్కగా కొబ్బరి నూనె పెట్టి మరీ తల దువ్వుకునేవాడు" అమ్మలు జాలిపడింది.

"అబ్బాయ్ ఆరోగ్యం బాగున్నట్టేనంటావా కామూ... నువ్విక్కడ తిష్టవేసేసరికి నీకోసం బెంగపెట్టుకుని... మతిగాని..."

"అబ్బబ్బ... అవన్నీ ఏం కాదులేమ్మా! వారు నాకోసమే అలా మారారు" కామేశ్వరి సిగ్గుపడింది.

"నీకోసం మారడమేమిటే? "

"అదంతేలేమ్మా! మరీ నా పక్కన కాకిముక్కకు దొండపండులా వుంటేనూ!" కొంగు మెలితిప్పుతూ నసిగింది.

"ఇంతకీ కాకెవరత్తయ్యా" అబ్బిగాడు అనుమానంగా అడిగాడు.

"నా రంగు చూస్తుంటే తెలీటంలా. మీ మామయ్యే కాకి" చిరుకోపంగా అంది.

"సరే.. ఇంతకీ.. బావగారు అలా ఎందుకు మారారో చెప్పమ్మా? " కామేశ్వరి చిన్నన్నయ్య శ్రీకాంత్ అడిగాడు.

"అది కాదన్నయ్యా" కామేశ్వరి మొదలెట్టింది.

"మా ఇంటి పక్కనే మిసెస్ మెహతా అని సృజనా మహిళా మండలి ప్రెసిడెంట్ వుంది. ఆమె ఈమధ్య మెంబర్‌గా చేర్చుకుంది నన్ను. ఆవిడ భర్త ఎంత స్టైలిష్‌గా వుంటాడనీ! అసలావిడ భర్తనే ఏముందిలే... అక్కడికొచ్చే ఆడవాళ్లందరి భర్తలూ హిందీ సినిమా హీరోల్లా వుంటారు.

వాళ్లను చూసిన కళ్లతో మీ బావగార్ని చూస్తుంటే నాకే సిగ్గేసింది. కాస్త మెయిన్ టెయిన్ చెయ్యమంటే వినరు. మొన్నటికి మొన్న విసుగ్గా వుంది డిప్పకటింగ్ చెయ్యిం చుకుంటానని ఒకటే నస.

ఈమధ్య... నన్నందరూ మిసెస్ ఆనంద్ అనడం మానేసి చాటుమాటుగా మిసెస్ పి.జి అనడం ఆరంభించారు.

మీ బావగారు పోస్ట్ గ్రాడ్యుయేట్ కదా... అందుకని గొప్పగా నన్నలా పిలుస్తున్నారే మోలే అనుకున్నా, కానీ ఆలస్యంగా తెలిసింది. పి.జి అంటే పాత గోతం అని. వాళ్లని నిలదీసి అడిగితే... ఫక్కుమని నవ్వేసి 'అలావున్నాడు కాబట్టే అన్నాం' అన్నారు. పైగా 'ఆయన వాడేది... కొబ్బరి నూనా... వంటాముదమా' అని ఆట పట్టించారు.

ఇంటికొచ్చి ఏడిస్తే మీ బావగారు తేలిగ్గా కొట్టేశారు.

'వూరుకో... మన ఆకారాన్ని బట్టేకదా ఎదుటి వాళ్లలా అన్నారు' అన్నారు.

మీ బావగారికి ఆమాత్రం ఆకారజ్ఞానం వున్నందుకు సంతోషించి... స్టైయిల్ మార్చుకోమని బ్రతిమిలాడా. ససేమిరా అన్నారు. పోట్లాడాను... నోర్మూసుకో అన్నారు పుట్టింటికి పోతా అన్నాను 'పో' అన్నారు.

పైగా మా అత్తగారు వచ్చి.. 'కాకిపిల్ల కాకికి ముద్దు. నాకొడుకు ఇలా వుంటేనే నాకిష్టం' అని వత్తాసు ఇచ్చింది.

ఒళ్లుమండి వచ్చేశా. మీ బావగారు తప్పు తెలుసుకున్నారులావుంది... ఇలా వచ్చేశారు"

అందరూ నోరు తెరుచుకుని వింటుండిపోయారు.

"ఇంతకీ ఇప్పుడెలా వున్నాడు మా ఆయన? అచ్చు హిందీ సినిమా హీరోలా లేడూ" గర్వంగా అడిగింది.

ఒక్కళ్లూ మాట్లాడలేదు. కామేశ్వరిని పైనుంచి కిందదాకా ఎగాదిగా చూసి ఎవరి పనుల మీద వాళ్లు వెళ్లిపోయారు.

అబ్బిగాడు మాత్రం... నడుం మీద చేతులు పెట్టుకు నిలబడి ఒక్కక్షణం ఆలోచించి మరీ చెప్పాడు, "హిందీ సినిమా హీరోలా ఏమోగాని... తెలుగు సినిమా విలన్లా మాత్రం వున్నాడు"

★ ★ ★

"ఏందోనమ్మా... ఈ కాలపు మొగుళ్లు మాకాలంలోలా కాదు. శానా అమాయకులు. ఎర్రి ఎంగళప్పలు... పెళ్లాం సేతుల్లో కీలుబొమ్మలు" పక్కింటి పార్వతికి పాలు పోస్తూ పాలనాగమ్మ అనడం గుమ్మంలో నిలబడ్డ చినబాబుకు స్పష్టంగా వినబడింది.

"ఇంతకీ... ఎవరి మొగుడే అమాయకుడు? " పార్వతి నవ్వుతూ అడుగుతోంది.

"ఇదో... సెంద్రకాంతమ్మ కూతుర్లేదూ కామేసరమ్మ... మొగుడు పేసన్‌గా లేడని వొదిలేసి ఈడొచ్చి కూకుంది. ఆయనగారు ఆమె కోసరం... గెడ్డంగిడ్డం పెంచేసి బందరు పిచ్చోడికిమల్లే తయారై వచ్చేశాడు. ఆ పయ్యాదిలో హరేరామ్‌గోరి బతుకైతే మరీ గోరం. పెళ్లాన్ని మంచానికడ్డం పడుకోబెట్టి... వండీవార్చి.. పెడతాడు. పెళ్లానికి గోరు ముద్దలు కూడా తినిపిస్తాడమ్మోవ్! పైకి మాత్రం అన్నీ ఆమేజేసినట్టు పోజు. పెళ్లాం మీద ఈగవాల్నీడు. మరీ అమాయకుల్ని చేసి ఆడిత్తన్నారీ ఆడాళ్లు... మగోళ్లని"

చినబాబుకి పాలనాగమ్మను గొంతు పిసికి చంపాలనిపించింది. పారిజాతం లాంటి పతిభక్తిపరురాళ్లు అరుదుగా వుంటారని నిన్నే తెలుసుకున్నాడతను. ఆమె పెట్టిన పూరీ-కుర్మా రుచి కూడా ఇంకా నాలుకమీంచి పోలేదు.

అందుకే ఆవేశంగా పిలిచాడు పాలనాగమ్మను "నాగమ్మా! ఇలారా"

"తమరింట్లో పాలు పోసేశానండయ్యా" చెప్పిందామె.

"అందుక్కాదులే.. ఇలా వచ్చిపో"

"తను వాళ్లక్కను దుయ్యబట్టడంగాని ఇన్లేదుకదా" నాగమ్మ భయంభయంగా చిన బాబు దగ్గరకొచ్చింది.

"హరేరామ్ వంట చెయ్యడం నువ్వు చూశావా? "

'అమ్మయ్య కామేసరమ్మ ఊసిన్లేదులే' అనుకుంది నాగమ్మ. అందుకే సంతోషంగా చెప్పింది "ఒక్క వంటేమిటి బాబూ... ఇల్లూడుస్తాడు. బట్టలు పిండుతాడు. పిండి రుబ్బుతాడు"

"నిజంగా చూశావా? "

"అంత నమ్మకం లేకపోతే పొద్దున్నే నా ఎంట రాబాబూ సూపిస్తా. అయినా ఆ బాబు ఓ పట్టాన ఎవురికీ సిక్కడనుకో"

"సర్లే... నువ్వెళ్లు" చికాగ్గా చెప్పాడు.

ఏ మూలో పెళ్లిపట్ల కాస్త స్పందించిన అతని మనసులోని అట్టడుగు పొర మళ్లీ మొద్దు బారిపోయింది.

హరేరామ్ విషయమేదో తేల్చుకోవాలను కున్నాడు.

ఉన్న పళాన బయలుదేరాడు. హరేరామ్ ఇల్లు ఆట్టే దూరంకాదు కాబట్టి కాలినడకనే వెళ్లాడు.

డోర్‌బెల్ మోగించబోయి ఒక్క క్షణం ఆగాడు. మెల్లగా సందుదారిన పెరటి గుమ్మం చేరుకున్నాడు.

అప్పుడే చెత్తబుట్టలో కసువు పారబోసి లోపలికెళుతున్నాడు హరేరాం. మెల్లగా పిల్లిలా వెనకే నడుస్తూ అతన్ని అనుసరిం చాడు. పెరటి తలుపులు వెయ్యడం మరచి పోయిన హరేరాం... మళ్లీ వెనక్కొచ్చి తలుపు మూశాడు. ఈ గేప్‌లో చినబాబు వంటగదిలోకి దూరిపోయి బియ్యం డ్రమ్ వెనక నక్కుకున్నాడు.

స్టౌమీద పాన్‌లోని అరటికాయ తాలిం పును అదే పనిగా గరిటతో తిప్పుతున్నాడు హరేరామ్.

"నేను నీ కళ్లలోనే వున్నానూ... నీవునా వూహలందే వున్నావూ... ఎన్ని జన్మాలకైనా నిన్ను విడలేనూ... నీ యిల్లాలుగా నేనుం టానూ..."

హైపిచ్‌లో పాడుతోంది పారిజాతం.

పాట వింటూ హరేరామ్ మధ్యమధ్యలో గరిట తిప్పటం ఆపి కళ్లొత్తుకుంటున్నాడు.

పాట వింటున్న తన్మయత్వంతోనా... వంట చేయాల్సి వచ్చిందన్న బాధతోనా... ఆ చెమరింపు అనేది చినబాబుకు అర్థం కాలేదు.

"తల చిక్కురావడం లేదండీ" చాలా ముద్దుగా పిల్చింది పారిజాతం.

"ఇదో... వచ్చె...వచ్చె" మంట సిమ్‌లో వుంచి డ్రెసింగ్ టేబుల్ ముందు కూర్చున్న పారిజాతం దగ్గరకెళ్లాడు.

దువ్వెన అందుకుని అతను చిక్కులు తీస్తుంటే అతని చేతినందుకుని ముద్దు పెట్టుకుని ఒక్కసారి అతని కళ్లలోకి చూసి "నీకోసమే నే జీవించునదీ..." అంటూ చాలా 'ఇది'గా పాట పాడింది.

పారిజాతం హరేరామ్‌ని ఎక్కడ దెబ్బకొ డుతోందో అర్థమైపోయింది చినబాబుకు.

హరేరామ్ చిక్కుతీయటం పూర్తిచేసి వచ్చి కూరదింపాడు. కుక్కర్‌లో పప్పుతీసి పోపు రెడీ చెయ్యసాగాడు. పాన్‌లో నూనె పోసి ఓ ఎండు మిరపకాయ తుంచేశాడు.

ఒక్కసారిగా ఖెళ్లుమన్నాడు చినబాబు.

హరేరామ్ ఉలిక్కిపడి ఇటు తిరిగాడు.

మళ్లీ ఖెళ్‌ఖెళ్‌మన్నాడు చినబాబు.

"ఎవడ్రావాడు..." చప్పున అప్పడాలకర్ర అందుకున్నాడు హరేరామ్.

ఇక లాభంలేదని చివుక్కున నిలబడ్డాడు చినబాబు. ఈ గోలకు కిచెన్‌లోకొచ్చిన పారి జాతం హరేరామ్‌తోపాటు నిర్ఘాంతపో యింది.

"ఏమిట్రా ఇది చిన్నా? " తేరుకుంటూ అన్నాడు హరేరామ్.



"ముందు నువ్వు ఆ పప్పు పోపులో తగలెయ్. ఆనక చెబుతా" చినబాబు అలవాటుగా పళ్లు కొరికాడు.

హరేరామ్ ప్రోగ్రామ్ ఫిక్స్‌చేసిన కంప్యూటర్లా ఆ పని చేసేసి... హాల్లోకెళ్లి కూర్చున్న చినబాబు దగ్గరకెళ్లాడు

"సిగ్గులేదూ!" ఉపోద్ఘాతం లేకుండానే కరిచినట్టు అరిచాడు చినబాబు.

"ఎందుకురా సిగ్గు? నువ్వుకదా మా ఇంట్లో దొంగచాటుగా దాక్కుంది. నేనెందుకు సిగ్గుపడాలి? " ఆశ్చర్యంగా అన్నాడు.

చినబాబు ఏదో అనబోయి కిచెన్‌లోంచి వస్తున్న పారిజాతాన్ని చూసి ఆగిపోయాడు. "అలా బయటికొస్తావా.. కాస్త మాట్లాడాలి" అడిగాడు చినబాబు.

"ఏమక్కర్లేదు... ఇక్కడే మాట్లాడుకోండి" చెప్పింది పారిజాతం. చినబాబు ఇబ్బందిగా కదులుతుంటే తనే అంది...

"నీ బాధ నాకర్థమైందన్నయ్యా. పెళ్లాన్ని కూర్చోబెట్టి మొగుడు వంట చెయ్యటమేంటీ అనుకుంటున్నావ్ కదూ! అందుకే మా ఇంట్లో ప్రవేశించి కూపీ లాగాలనుకున్నావ్"

చినబాబు అవునూ కాదూ అన్లేదు.

"ఏం... మొగుళ్లని కూర్చోబెట్టి పెళ్లాలే చెయ్యాలని ఏదైనా రూలుందా? నీకు తెలుసా! ఇదివరకు మాతృస్వామ్య వ్యవస్థ వుండేది. ఆడదే కుటుంబ యజమాని. వ్యవసాయమో, వ్యాపారమో ఆమే చేసేది. మగాడు ఇంటిపట్టున వుండి ఆమెకు కావాల్సినవి అమర్చిపెట్టేవాడు. అప్పుడది సాంప్రదాయం. ఇది నచ్చని కొందరు మగాళ్లు వ్యవస్థను మార్చారు. ప్రస్తుతం పితృస్వామ్య వ్యవస్థ మన సాంప్రదాయం. ఇక్కడ ఆడది వంటింటి కుందేలయింది. మళ్లీ ఉమెన్ లిబ్ మొదలైంది. ఫలితంగా ఈ సాంప్రదాయం మారొచ్చు అంతేగాని ఏ దేవుడూ ఆడదే వంట చెయ్యాలని ఆమె ముఖాన రాయలేదు"

పారిజాతం గసపెడుతుంటే హరేరామ్ చప్పున ఓ గ్లాస్ నీళ్లందించాడు. ఆమె గటగట తాగి గ్లాసుకింద పెట్టింది. మళ్లీ చినబాబువంక సూటిగా చూస్తూ అంది, "...అని వాదిస్తాననుకున్నావ్ కదూ!" నవ్వి సిగ్గుగా హరేరామ్ వంక చూసింది... "అసలు విషయం అన్నయ్యకు చెప్పెయ్యండీ"

"నో" ఆవేశంగా అన్నాడు హరేరామ్. "మన మొదటి మేరేజ్ యానివర్సరీ నాటి వరకూ ఈ విషయం చస్తే బయటపెట్టను. అలా అని నీకు మాటిచ్చా పారూ! మాట తప్పమంటావా? "

"అన్నయ్య వర్రీ అవుతున్నాడులా వుందండీ"

"అవనీ... ఎవరేమైతే నాకెందుకు! ఈ ప్రపంచం తల్లకిందులైనా.. ఈ భూగోళం రెండుగా చీలిపోయినా.. ఆకాశం విరిగిపడినా.. సముద్రం ఇంకిపోయినా..."

"ఇక చాల్లెండి చినబాబు వెళ్లిపోయాడు" చెప్పింది పారిజాతం.

"దేర్‌ఫోర్.. వడియాలు వేయించనా పారూ? " అడిగాడు కిచెన్‌లోకెళుతూ.

"వడియాలొద్దు... అప్పడాలు వేయించండి" పారిజాతం ఆనంద బాష్పాలు రాలుస్తూ చెప్పి పాట అందుకుంది.

"ఎంత మంచి వాడివిరా.. ఎన్నినోళ్ల పొగడుదురా!"

★ ★ ★

"నీ దుస్థితి చూస్తుంటే జాలేస్తోంది బావా" సిన్సియర్‌గా అన్నాడు చినబాబు.

"ఛ.. అదేంటి బాబాయ్? మామయ్య పాప్ సింగర్‌లా పంక్ స్టైయిల్లో వుంటే దుస్థితీ అదీ అంటావ్" అబ్బిగాడు ఆరాధనగా చూశాడు ఆనందరావు వంక.

"పెద్దవాళ్ల మధ్య నువ్వెందుకురా.. పానకంలో పుడకలా? " ఆనందరావు అడిగాడు ఇబ్బందిగా.

"చులకనగా చూడకు. ఆనక బాధపడతావ్! చెప్పు బాబాయ్! నా ప్రెజన్స్ ఎంత

వేల్యూబులో" రోషంగా అన్నాడు అబ్బిగాడు.

"నిజమే బావా! అబ్బిగాడు నా రైట్ హేండూ ప్లస్ లెఫ్ట్ బ్రెయినూ. చూడ్డానికి ఫిజికల్‌గా చిన్నవాడేగాని అమ్మో.. మెంటల్‌గా వాడి వయస్సు..." ఆగాడు.

"ఓ పాతికేసుకో..." చెప్పాడు అబ్బిగాడు.

ముగ్గురూ టెర్రస్‌మీద వున్నారు. ఇంటల్లుడు వచ్చాడని చంద్రకాంతమ్మ తొక్కుడు లడ్డూలు చేసింది. అవి ప్లేటునిండా పెట్టుకుని ఒక్కోటి తింటూ మాట్లాడుకుంటున్నారు.

"బావా! నేనొకటి అడుగుతా. కోపగించుకోవుగా" చినబాబు వున్నట్టుండి అన్నాడు.

"అడగవోయ్"

"భార్య కోసం నీ వ్యక్తిత్వం చంపుకుని... ఇలా వేషం మార్చుకుంటానికి నీకు మనసెలా ఒప్పింది"

"అదా" తేలిగ్గా అన్నాడు ఆనందరావు. "చూడు చినబాబూ 'భార్య కోసం' అని అంత తేలిగ్గా అనకు. మగాడికి భార్య తరవాతే ఎవరైనా. అసలీ ప్రపంచం యావత్తూ నిర్మించబడింది ఆ భార్యభర్తల బంధంమీదే. ఆ బంధమే లేకుంటే కుటుంబమే లేదు. కుటుంబం అనేది లేకుంటే సమాజం... సమాజం లేకుంటే దేశం... దేశమే లేకుంటే... ప్రపంచం... ఇలా ఏదీ లేదు. శ్రీకృష్ణుడంతటివాడు వ్యయప్రయాసలకోర్చి పారిజాత పుష్పాన్ని తెచ్చింది ఎవరి కోసం. భార్యకోసం. రాముడు శివధనుస్సు విరిచింది తన రమణి కోసం. సాక్షాత్తు శ్రీనివాసుడు ఎరుకలసాని వేషం కట్టింది పద్మావతి కోసం. 'భార్య' అనే మనిషి ఔచిత్యం అటువంటిది. దేవుళ్ళే భార్యల కోర్కెలు తీర్చడానికి పడరాని పాట్లు పడుతుంటే... మానవులం మనమెంత?

ఆఫ్టాల్... నా కామేశ్వరి నన్నేం కోరింది? జీన్స్ వేసుకోమన్నది... కాస్త క్రాఫ్ పెంచమన్నది. అంతేకాని... నన్నేం... రెఫ్లేసియా పుష్పం తెచ్చిపెట్టమన్లేదుగా"

"ఇంత తెలిసినవాడివి... అక్కయ్య చెప్పగానే వేషం మార్చుకోకూడదూ. ఆమె అలిగి పుట్టింటికి వచ్చేదాకా ఏం చేస్తున్నట్టు?" చినబాబు మంటగా అడిగాడు.

"అదే నేచేసిన పొరపాటు. పశ్చాత్తాప్పడుతున్నానిప్పుడు. ముందు ఆమె కోరిక తీర్చటానికి నా పాడు మనసు ఒప్పుకోనిమాట నిజమే. కాని... మీ అక్కయ్య నన్నొదిలిపోయాక తెలిసింది ఆమె లేని లోటు. జీవితమే శూన్యమనిపించింది. బతుకు మరీ నీళ్ళులేని చెరువులా... చెట్లు లేని అడవిలా అయిపోయింది. తప్పు తెలుసుకుని, కాకి పిల్ల కాకికే ముద్దుగాని... ఇంకెవరికీ ముద్దు రాదన్న సత్యాన్ని గ్రహించాను. అందుకే మా అమ్మను సైతం ఎదిరించి... ఇలా వేషం మార్చి నా కాముడికోసం వచ్చాను"

"పెళ్లాం... మరీ అంత పవర్‌ఫుల్లా" అని అడగలేదు చినబాబు. అనుకున్నాడు.

"చినబాబూ! నువ్వేంటో పెళ్లొద్దంటున్నావని విన్నా. అది చాలా తప్పయ్యా. పెళ్లి... జీవితానికి మహత్తరమైన వరం. కష్టసుఖాల్లో 'నీకు నేనున్నా' అని భరోసా ఇచ్చే మనిషిని మనకివ్వగలిగేది పెళ్ళి మాత్రమే. ఈ చిన్న చిన్న పంతాలు, పట్టింపులూ అంటావా? సముద్రపు అలల్లాంటివి. తాడిచెట్టు ప్రమాణంలో వచ్చిన అలైనా... తీరాన్ని ఒరుసుకుని మామూలై వెళ్ళిపోతుంది. సంసారంలో గొడవలు కూడా అంతే. నూరేళ్లూ కలిసుండే ఇద్దరి మధ్యా పొరపొచ్చాలు రావటం అతిసహజం. సర్దుకోవడమూ అంతే సహజం.

అలాంటి అల్పవిషయాన్ని దృష్టిలో పెట్టుకుని అమృతభాండంలాంటి పెళ్లిని వద్దనుకోవడం ఘోరమైన తప్పు.

కామేశ్వరి హఠం చెయ్యటం... నేనిలా వేషం మార్చడం మీకు కామెడీలాగే కనబడొచ్చు కానీ... నా గుండెల్లో నా భార్య



పట్ల వుండే ప్రేమకు భాష్యమే ఈ రూపం. నన్ను చూసి నలుగురూ నవ్వుతారని తెలిసీ... నేనిలా ఎందుకు మారాను? నేన మితంగా ప్రేమించే నా కామేశ్వరి కోసం... నా ప్రియమైన భార్యకోసం. దటీజ్ ద పవ రాఫ్ మేరేజ్"

చినబాబు మనసులో మొద్దుబారిన అట్ట డుగు పొరలో మళ్ళీ స్పందన మొదలైంది.



అర్ధరాత్రివేళ చటుక్కున మెలకువొచ్చింది చినబాబుకు.

మెయిన్‌డోర్‌నెవరో దబదబా బాదుతు న్నారు. ఇంట్లో ఎవ్వరూ లేరు. కేవలం చిన బాబూ, చంద్రకాంతమ్మ, శేషాద్రీ మాత్రమే వున్నారు. సంక్రాంతి సెలవులకని నిన్ననే ముగ్గురన్నయ్యలూ... కుటుంబ సమేతంగా వారి వారి అత్తగారిళ్లకు తలో వూరు వెళ్ళి పోయారు.

ఎప్పుడూ... ఏ పండక్కీ... ఇలా అందరూ కట్టగట్టుకుని వెళ్ళింది లేదు. ఈసారేమిటో మరి అందరూ కొత్తల్లుళ్ళయి నట్టూ, ఆ సంక్రాంతి తొలిపండగైనట్టూ... ఆఫీసులకు సెలవు పడేసి... పెళ్లాల కొంగులు పట్టుకుని వెళ్ళిపోయారు.

చివరికి అబ్బిగాడు కూడా. చినబాబు నొదిలేసి అమ్మమ్మగారి వూరు వెళ్ళిపో యాడు.

ఈసారి కాలింగ్‌బెల్ అదేపనిగా మోగింది.

బెడ్ పక్కనే వున్న స్విచ్ నొక్కాడు. నిశ్శ బ్దంగా పరచుకుంది ఫ్లోరోసెంట్ బల్బ్ కాంతి

ఇంత అర్ధరాత్రివేళ ఎవరబ్బా! అను కుంటూ మంచం దిగాడు. దిగేలోగానే మళ్ళీ దబదబ బాదారు తలుపుల్ని.

ఈసారి శబ్దానికి చంద్రకాంతమ్మ, శేషాద్రీ ఇద్దరూ లేచేశారు.

"ఈ అపరాత్రివేళ... ఎవర్రా అది. దొంగలు కాదుగదా"

తలుపు బోల్ట్ తియ్యబోతున్న చినబాబు తల్లి మాటతో ఒక్కక్షణం సందేహించాడు.

ఈలోగా మళ్ళీ మోగింది బెల్... వెను వెంటనే తలుపులుమీద చప్పుడైంది.

శేషాద్రి... లోపలపక్కే వున్న స్విచ్ నొక్కి వరండాలో లైట్ వెలిగించాడు. కిటికీ ఓ రెక్క తెరచి బయటకు చూశాడు.

ఎవరో అమ్మాయి... గుమ్మంలో నుంచుని వుంది. వీధివైపు తిరిగి తిరిగి చూస్తూ... ఆపాదమస్తకం వణికిపోతూ కనబడింది.

"ఎవరో ఆడకూతుర్రా. తలుపు తెరు"

"ఆడదొంగలు మరీ ప్రమాదంరా. వెనక బ్యాచ్ వుండే వుంటుంది" చంద్రకాంతమ్మ భయంగా అంది.

ఈసారి చినబాబు తల్లిమాటలు పట్టించు కోలేదు. తలుపు బోల్టు తీశాడు.

ఆ పిల్ల సుడిగాలిలా లోపలికి దూసుకొ చ్చింది.

"త్వరగా... తలుపులు మూయ్యండి. ప్లీజ్..." నెర్వస్‌గా వీధివైపు చూస్తూ చెప్పింది.

చినబాబు తలుపు మూసి బోల్టు పెట్టి ఇటు తిరిగాడు. ఆ అమ్మాయికి ఇరవై... ఇరవై రెండూ మధ్య వుంటుంది వయస్సు పూలజడ వేసుకుని. నుదుట బాసికం కట్టుకుని వుంది. నొసటిమీద కల్యాణతిలకం చెమటకు ముక్కుమీదకు జారుతోంది కన్నీళ్లకు కళ్లకాటుక చెదిరిపోతోంది.

చారడేసి కళ్లు కలవరంగా అటూ ఇటూ కదులుతున్నాయి. గుండెలు భయంతో కాబోలు ఎగిసెగిసి పడుతున్నాయి.

మొత్తంమీద... ఒక్క గ్లాన్స్‌లో పసిగట్టేశాడు. ఆమె పీటలమీంచి పారిపోయి వచ్చిన పెళ్లికూతురని.

"ఎవరమ్మాయ్ నువ్వు? చూడబోతే పెళ్లికూతుర్లావున్నావ్. ఏమిటీ అఘాయిత్యం?"

చంద్రకాంతమ్మ ప్రశ్నకు అటు చూసింది గానీ... వణుకుతున్న పెదవులు సహకరించకపోవడంతో జవాబు ఇవ్వలేకపోయింది.

"కాంతం... కాస్త మంచినీళ్లు తీసుకురాపో" శేషాద్రి భార్యకు చెప్పి ఆ అమ్మాయితో అన్నాడు "ముందలా కూర్చోమ్మా. నీకింకేం భయంలేదు. మేమున్నాం"

ఆమె సోఫాలో కూలబడిపోయింది. చంద్రకాంతమ్మ తెచ్చి ఇచ్చిన మంచినీళ్లు గటగట తాగేసి ఒక్కక్షణం అలసట తీర్చుకుంటున్నట్టుగా కళ్లు మూసుకుంది.

"పోనీ... పడుకోండి. రేపు మాట్లాడుకుందాం" చినబాబు అన్నాడు, ఆమె కళ్లు మూసుకున్న తీరు గమనించి.

"అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలని... ఆ పిల్లెవరో... ఏమిటో తెలుసుకోకుండా పడుకోనివ్వటమే... ఇంకా నయం" చంద్రకాంతమ్మ శేషాద్రి చెవిలో గుసగుసమంది.

ఆమె గమనించేసినట్టుంది. దెబ్బతిన్నట్టుగా చూసింది చంద్రకాంతమ్మవైపు. "అమ్మా! నా వల్ల మీకే ప్రమాదమూ రాదు. నేను దొంగనో... హంతకురాల్నో కాదు. ఒక అభాగ్యురాల్ని. నిస్సహాయురాల్ని. నాకు తల్లిలేదు. సవతితల్లి చేతుల్లో అష్టకష్టాలు పడి పెరిగాను. ఈమధ్యే తండ్రి కూడా పోయాడు. దాంతో మా పిన్ని మరింత నీచంగా చూడ్డం మొదలెట్టింది. అన్నీ భరించి పడివుంటున్నా... కానీ పక్షవాతంతో... మంచంలో తీసుకుంటున్న ఓ ముసలి షాహుకారికి పెళ్లి పేరుతో నన్ను అమ్మజూపడాన్ని మాత్రం సహించలేకపోయాను. బలవంతంగా గదిలో బంధించి పెళ్లి ఏర్పాట్లు చేస్తోంది. ఎలాగో తప్పించుకుని బస్టాండుకు వెళ్లిపోయి దొరికిన బస్సెక్కేశాను. బస్సు వెళ్లినంతదూరం ప్రయాణించాను. చివరికి ఈ వూళ్లో హాల్ట్ అయింది బస్. దిగి బస్టాండ్‌లో ఓ మూల కూర్చున్నాను. ఎలా వచ్చారో వచ్చేశారు... మా పిన్ని పంపిన మనుషులు వచ్చారు. దొరికానా జీవితం లేదిక నాకు. అందుకే పారిపోయి ఎలాగో వాళ్లకి స్లిప్ ఇచ్చి ఈ వీధిలో దొరబడ్డాను. ఎవర్నైనా బతిమిలాడి ఏదో ఒకింట్లో తల దాచుకోవడం మంచిదని తోచింది. అందుకే మీ ఇంటి తలుపు తట్టాను. నా అదృష్టం. నాకు ఆశ్రయం లభించింది" సజల నయనాలతో చేతులెత్తి నమస్కరించిందామె ఎదురుగా వున్న ముగ్గురికీ.

చినబాబుకెందుకో జాలేసిందామెను చూస్తుంటే "ఇక్కడ నీకేం భయంలేదు. హాయిగా పడుకో. ఎవడైనా వస్తే వాడి కాళ్లు విరిచేస్తా" అని చెప్పాలనిపించినా అమ్మ ఏమంటుందో అని ఆగిపోయాడు.

చంద్రకాంతమ్మ పాజిటివ్‌గానే రెస్పాండైంది. "మంచిపనే చేశావులేమ్మా. కుందనపు బొమ్మలా వున్నావ్. నీకేం ఖర్మ... ఆ పక్షవాతపు ముసలాడ్ని కట్టుకునేందుకు? దేవుడు చల్లగా చూస్తాడ్లే బాధపడకు" ప్రేమగా అన్నది.

"ఏమైనా తింటావామ్మా?" అడిగాడు శేషాద్రి.

"వద్దండీ ఆకల్లేదు" చెప్పిందామె.



"ఏం తిండిలే. భయంతోనే ఆకలి చచ్చిపోయుంటుంది"

"సరే... ఆ సోఫాలోనే పడుకుని ఓ కునుకు తియ్యి" చెప్పింది చంద్రకాంతమ్మ.

"మీరు కాస్త లేస్తారా" సోఫాలో కూర్చుని వున్న ఆమెనడిగాడు చినబాబు.

ఆమె లేచి నిలబడగానే... సోఫాను వెడల్పుచేసి బెడ్‌లా అమర్చాడు.

"థేంక్స్" చెప్పిందామె.

తరువాత... ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఆమె ఒంటరిగా సోఫా కమ్ బెడ్‌మీద ముడుచుకుని పడుకుంది.

ఓ రెండు గంటల సమయం మామూలుగానే గడిచిపోయింది.

తెల్లవారుజామున మూడు మూడున్నర ప్రాంతంలో హాల్లో ఏదో అలికిడైనట్టు అన్పించి చూస్తే పడుకుని వుండాల్సిన ఆ అమ్మాయి లేచి అటూ ఇటూ పచార్లు చేస్తోంది.

చినబాబు మెల్లగా తన గది తలుపులు తెరుచుకుని హాల్లో కొచ్చాడు. ఆమెను అనుమానంగా చూస్తూ పిలిచాడు.

'ఏమండీ"

ఆమె పలకలేదు. ఏదో ట్రాన్స్‌లో వున్నట్టూ... ఒకే చూపుతో... రెప్పలు సైతం ఆర్పటం మానేసి... నడుస్తోంది.

అలా కాసేపు నడిచాక... చినబాబు గది కేసి తిరిగింది. నేరుగా గదిలో ప్రవేశించింది. చినబాబు వెన్ను జలదరించింది.

"ఈ మనిషికి నా గదిలో ఏం పని? " మనసులోనే అనుకుని ఆమె వెనకే పిల్లిలా నడవసాగాడు. ఎందుకైనా మంచిదని టేబుల్‌మీద వున్న పేపర్ వెయిట్ పిడికిట్లో బిగించి పట్టుకున్నాడు.

ఆమె మెత్తగా సూటిగా నడుస్తూ వెళ్లి... చినబాబు ఆఫీసు ఫైళ్లు చూసుకునే.. రైటింగ్ టేబుల్ దగ్గర ఆగింది.





ఛెయిర్‌లాగి కూర్చుని... టేబుల్ లేంప్ వెలిగించింది. సొరుగు లాగి ఓ డైరీ బయటికి తీసింది.

అది చినబాబు డైరీనేగాని అతనికి డైరీ ప్రత్యేకించి రాసే అలవాటు లేదు. జస్ట్ అడ్రసులూ... ఫోన్ నెంబర్లూ రాసుకోడానికి ఉపయోగిస్తాడు దాన్ని.

ఆమె డైరీ తెరచి జనవరి తొమ్మిది అని వున్న పేజీ దగ్గర ఆగింది. పెన్ స్టాండ్ లోంచి పెన్నందుకుని రాయటం మొదలెట్టింది.

ఆమె వెనకే నిలబడి వూపిరి బిగబట్టి చూస్తున్నాడు చినబాబు.

ఓ ఐదు నిమిషాల తర్వాత ఆమె డైరీ మూసి యధాస్థానంలో పెట్టి తిరిగి ట్రాన్స్‌లో వున్నట్టే... నడుచుకుంటూ వెళ్ళి సోఫామీద మళ్ళీ యధాప్రకారం ముడుచుకుని పడుకుంది.

ఆమె పడుకుందని రూఢి చేసుకోగానే చినబాబు ఆత్రంగా డైరీ తెరిచాడు.

'ఈ నీచ నికృష్ట దుష్ట ప్రపంచంలో తొలిసారిగా ఈ ఇంట మంచిని చూశా'-

'ఈ నీతి బాహ్య నిర్దాక్షిణ్య దానవుల మధ్య తనివి తీరగా నీలో ఓ మనిషిని చూశా-'

చినబాబు గుండెందుకో ఒక్కక్షణం లయ తప్పింది. ఆమె రాసింది తన గురించీ తన ఇంటి గురించేనా!

నమ్మకం కలగలేదేమో! మళ్ళీ చదువుకున్నాడు డైరీలోని ఆమె చేతిరాతని.

నిజంగానే అది తన గురించే రాసింది ఆమె.

ఇన్నాళ్ల తన జీవితంలో చినబాబూ ఏం చదువుతున్నావ్? ఎక్కడ ఉద్యోగం చేస్తున్నావ్? జీతమెంత? పెళ్లి చేసుకోవా ఏంటి? ఆస్థి పంపకాలు చేశాడా మీ నాన్న? నీ వాటా ఎంతొస్తుంది? లాంటి నోటిమాటలు తప్ప ఇలాంటి మంచీ, మానవత్వం అనే మనసు మాటలు వినలేదు తను.

తనలో మనిషిని చూసిందట ఆమె.

ఎంతో పొయెటిక్‌గా కాంప్లిమెంట్ ఇచ్చింది.

చినబాబుకు చాలా సంతోషంగా అన్పించింది. ఒక్కసారిగా తనెంతో ఎత్తుకు ఎదిగిపోయినట్టు ఫీలయ్యాడు. అతనిమీద అతనికే గౌరవంలాంటిదేదో కలిగింది.

నిద్రపోతున్న ఆమెకేసి... ఇదీ అని చెప్పలేని అభిమానంతో చూశాడు.

★ ★ ★

"మీకభ్యంతరం లేకపోతే కాస్త ఈ పూల జడ విప్పి స్నానం చేస్తానండీ. ఇలాగే ఈ వేషంలో బయటకెళితే..." ఆమె ఆపి సందేహంగా చూసింది చంద్రకాంతమ్మవైపు.

"అయ్యో దానికేం భాగ్యం తల్లీ. నువ్ స్నానం చేసినంతమాత్రాన మా మళ్లూ మాన్యాలు పోతాయా? వెళ్లు. తలస్నానం చేసిరాపో. బడలిక తీరుతుంది"

ఆమె బాత్‌రూమ్‌లో కెళ్లబోతుంటే పిలిచింది చంద్రకాంతమ్మ "ఇదుగో అమ్మాయ్... ఇలారా" ఆమె వచ్చి నిలబడింది.

బీరువా తెరిచి ఓ చీరా, రవికా తీసి ఆమె చేతుల్లో పెట్టింది.

"మళ్లీ... ఆ పట్టుచీరే... ఏం చుట్టుకుంటావ్‌గాని... ఇదో ఇది కట్టుకో స్నానం చేసి"

ఆమె కృతజ్ఞతగా చూసి బాత్‌రూమ్‌లోకెళ్లింది.

స్నానం చేసి రాగానే వేడిగా కాఫీ అందించింది చంద్రకాంతమ్మ. "అయ్యో... మీకెందుకండీ శ్రమ. నేవెళ్ళిపోతాను" నొచ్చుకుంటూ అందా అమ్మాయి.

"వెళుదువ్‌గానీలే. కాఫీ అదీ తాగి కాస్త తెరిపిన పడు"

ఆమె నిశ్శబ్దంగా కాఫీ తాగసాగింది.

"అధ్సరేగానమ్మాయ్. ఇంతకీ ఎక్కడికెళతావ్? " శేషాద్రికి కాఫీ అందించి వచ్చి అడిగింది.

ఆమె దిగులుగా చూసింది "అదే అర్థం కావడంలేదండీ"

"బంధువులెవరూ లేరా? "

"వున్నా ఏం లాభం. ఏ బంధువులింటికో వెళ్ళాననుకోండి. ఖచ్చితంగా మా పిన్నికి నా ఆచూకీ తెలియజేస్తారు. నా భారం మొయ్యాల్సిన ఖర్మ వాళ్లకేం పట్టిందండీ"

"అదీ నిజమేలే" చంద్రకాంతమ్మ ఒప్పుకుంది. కాసేపు సాలోచనగా వుండిపోయి అంది "ఇంతకీ... ఇక ఇంటికి వెళ్లనంటావ్"

"అది ఇల్లు కాదండీ నరకం. అంతకన్నా ఏట్లో దూకి చావటం నయం"

బెడ్‌మీద కళ్లు మూసుకుని పడుకుని వున్నాడన్న మాటేగాని చినబాబు ఆ ఇద్దరి సంభాషణ వింటూనే వున్నాడు.

"రేయ్ చిన్నా లే... వెళ్ళి స్నానం చెయ్"

చంద్రకాంతమ్మ ఆమెతో మాట్లాడుతూనే మధ్యలో కేకేసింది.

అలాగే పడుకుని వాళ్ల మాటలు వినాలని వున్నా తప్పదన్నట్టు లేచాడు. లేచి వెళుతూ వంటగది గుమ్మంలో కూర్చుని వున్న ఆమెకేసి క్రీగంట చూశాడు.

లేతగోధుమ రంగు చీర కట్టుకుని... తలస్నానం చేసిన జుట్టు విరబోసుకుని వుంది.

చూస్తుంటే ఫ్రెష్‌గా... మనసుకు హాయిగా... హోమ్లీగా అన్పించింది.

ఆమె కూడా ఓసారి కళ్లెత్తి అతనికేసి చూసింది.

అనుకోకుండా చినబాబు కళ్లు ఆ కళ్లతో క్షణంలో పదోవంతు కలుసుకున్నాయి.

వెంటనే ఆమె రాత్రి తన గురించి రాసిన వాక్యాలు గుర్తొచ్చి ఇబ్బందిగా తలదించుకుని గబగబ వెళ్ళిపోయాడు.

చంద్రకాంతమ్మ ఇడ్లీపాత్ర స్టౌమీద కెక్కిస్తూ అన్నది "మరేంచేస్తావమ్మాయ్? "

"తోచటంలేదండీ ఆలోచించుకుంటాను"

చెప్పింది. చంద్రకాంతమ్మ చట్నీ రుబ్బడాని కుపక్రమిస్తూ "మిక్సీలో వేస్తే మా అబ్బాయి తినడమ్మా? మామూలుగా రుబ్బాల్సిందే"

"నేరుబ్బి పెట్టనాండీ"

"నీకెందుకు లేమ్మా శ్రమ"

"పర్లేదులెండి. పెద్దవారు మీరు కష్టపడు తుంటే చూస్తూ ఎలాగండీ వుండటం?" ఆమె లేచి చొరవగా రోటి దగ్గర కెళ్ళింది.

"నా తల్లే. పరాయిదానివైనా నువ్వే మేలు. ఎందుకూ ముగ్గురు కోడళ్ళున్నారు నాకు. ఒక్కరూ సాయం చెయ్యరు"

"ఏరండీ వాళ్ళు?"

"పుట్టిళ్ళకు పోయార్లేమ్మా పండక్కని"

"ఓ పనిపిల్లనైనా పెట్టుకోకూడదండీ"

"నావల్ల కాదమ్మా. వెనకుండి అన్నీ వాళ్ల చేత చేయించుకునే బదులు మనం చేసుకో వడమే మేలు. అదీగాక ఆయనకు నాచేతి వంట తప్ప సయించదు"

ఆమె చట్నీ రుబ్బడం పూర్తిచేసింది.

చినబాబు, శేషాద్రి డైనింగ్ హాల్లో కూర్చు న్నారు. "నువ్వూ కూర్చోమ్మా" చెప్పింది చంద్రకాంతమ్మ "వాళ్లది కానీలెండి మని ద్దరం కూర్చుందాం" అందామె.

చంద్రకాంతమ్మ భర్తకీ, కొడుక్కూ ఇడ్లీ వడ్డించి చట్నీ వేసింది.

శేషాద్రి చట్నీలో ఇడ్లీముక్క ముంచి నోట్లో పెట్టుకుని అన్నాడు "పచ్చడి రుచి మారిందే"

"ఏమండీ బాగా లేదా?" చంద్రకాంతమ్మ తను రుబ్బనందుకు నొచ్చుకుంటూ అడి గింది.

"అమోఘంగా వుంది. ఎప్పుడూ ఇంత రుచిగా కుదర్లేదు" చెప్పాడాయన.

చినబాబుక్కూడా అది నిజమే అన్పిం చింది.

"ఆ అమ్మాయి రుబ్బిందండీ. బహుశా పచ్చడి రుచికి అది కారణం అయి వుంటుంది" చంద్రకాంతమ్మ ఆమెను చూసి మెచ్చుకోలుగా నవ్వింది.

శేషాద్రి తనవైపు చూస్తుంటే సిగ్గుగా తల వంచుకుందామె.

"పాపం ఎటుపోవాలో నిర్ణయించుకోలేక పోతోందండీ ఆ అమ్మాయి"

"పోనీ ఓ రెండు రోజులు ఇక్కడే వుండమ్మా. నిదానంగా ఆలోచించుకుని వెళుదువ్‌గాని"

ఆమె నమ్మలేనట్టు చూసింది ఆయన వైపు.

"అంతే నాన్నా. అదే బెస్ట్" చినబాబు వెంటనే అన్నాడు.

"లేదండీ నేవెళతాను" ఆమె ఏమను కుందో దృఢంగా అంది.

చంద్రకాంతమ్మ ఆమెకేసి 'నీ ఖర్మ' అన్నట్టు చూసింది.

"ఏదో లోపలికి రానిచ్చారని ఇక్కడే తిష్ట వెయ్యడం మర్యాదన్పించుకోదండీ. నా తిప్పలేవో నేపడతాను. పక్కవూర్లో మా నాన్నగారి ఫ్రెండొకాయన వున్నారు. అక్క డికెళతాలెండి"

"నీ ఇష్టం" ముక్తసరిగా అంది చంద్రకాం తమ్మ.

చినబాబుకి ఇడ్లీ తినాలన్పించలేదు. అమ్మ అలా "నీ ఇష్టం" అనకుండా వుంటే బాగుండేదన్పించింది.

ఇక సంభాషణేం సాగలేదు.

"చిన్నా నువ్వు బేంక్ కెళ్లేప్పుడు ఈ అమ్మాయిని కాస్త రైల్వే స్టేషన్లో దిగబెట్టు" చెప్పింది.

"అలాగే" ముభావంగా అన్నాడు.

అయినా తనకెందుకీ బాధ. జస్ట్ కొన్ని గంటలక్రితం అనుకోకుండా ఆశ్రయం కోరి వచ్చిన అపరిచిత. అవసరం తీరింది వెళ్లిపో తోంది.

సర్దిచెప్పుకుని త్వరత్వరగా రెడీ అయ్యాడు. ఆమె వెళ్లేలోగా మాత్రం తన డైరీ పేజీలో తన గురించీ, తన ఇంటి





గురించీ గొప్పగా రాసినందుకు థాంక్స్ మాత్రం చెప్పాలనుకున్నాడు.

"ఈ చీర..." సందేహంగా చూసింది చంద్రకాంతమ్మవైపు ఆమె.

"వుంచేసుకోలేమ్మా మా పెద్దమ్మాయి చీరే అది. అత్తారింటినుంచి అప్పుడప్పుడూ అలిగి వున్నఫళంగా వస్తుంటుంది. అందుకే నాలుగు చీరెలిక్కడ పడేసి వుంచుకుంది. దాంతో పెద్ద ఉపయోగం లేదులే" చెప్పింది

చంద్రకాంతమ్మ.

"వెళ్ళొస్తానండీ. రాత్రి అంత ఆపదలో ఆశ్రయమిచ్చారు. మీ మేలు ఈ జన్మకు మరువలేను" కళ్లలో నీళ్లు తిరిగాయామెకు.

చేతులెత్తి చంద్రకాంతమ్మకూ, శేషాద్రికీ నమస్కరించింది.

స్కూటర్ వెనక సీట్లో బుద్ధిగా కూర్చుం దామె.

స్కూటర్ స్టార్ట్ చెయ్యబోతూ అడిగాడు చినబాబు.

"మీ పేరు చెప్పనేలేదు"

"విరాజిత" చెప్పిందామె.

"రాత్రి... డైరీలో అలా రాసినందుకు థేంక్స్. మరీ పొగిడేశారులా వుంది"

విరాజిత చినబాబుకేసి అయోమయంగా చూసింది. "డైరీ... ఏమిటండీ" అడిగింది ఆశ్చర్యంగా.

ఈసారి ఆశ్చర్యపోవటం చినబాబు వంత యింది. "అదేనండీ రాత్రి మీరు నా గదిలో కొచ్చి నా డైరీ తీసుకుని రాయలేదూ?"

"నేనా?" ఇదెక్కడి విడ్డూరం అన్నట్టు చూసింది.

చినబాబు ఏదో అనబోయి విరమించు కుని స్కూటర్ స్టార్ట్ చేయబోతుండగా విన బడింది ఓ వెర్రికేక ఇంట్లోంచి. అది చంద్ర కాంతమ్మ గొంతు.

చినబాబు ఒక్క పరుగున వెళ్ళాడు. లోపల బాత్‌రూమ్‌లో జారిపడి లేవలేక అలాగే వుండిపోయిన చంద్రకాంతమ్మను శేషాద్రి లేపటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఒక్క ఉదుటున వెళ్లి తండ్రికి సాయం పట్టాడు. ఇద్దరూ చంద్రకాంతమ్మను మోసు కొచ్చి బెడ్‌మీద పడుకోబెట్టారు.

ఆమె మూలుగుతూ లేవబోయింది. కుడి కాలు సహకరించలేదు. కళ్లనీళ్లు పర్యంతమ వుతూ అంది "కుడికాలు విరిగినట్టుందండీ"

బాధకు ఓర్చుకోలేని ఆమె కళ్లనుంచి నీళ్లు జలజలరాలిపడ్డాయి.

"ఏమిటికాంతం. ఏం పనొచ్చిందిప్పుడు నీకు బాత్‌రూమ్‌లో" శేషాద్రి బాధగా విసు క్కున్నాడు.

"ఆ అమ్మాయ్ పట్టుచీర అక్కడ మర్చిపో యిందండీ. స్కూటర్ ఎక్కి కూర్చుంటూ! తెచ్చిద్దామని హడావుడిగా వెళ్ళా" ఆమె పళ్ల బిగువున బాధనాపుకుంటూ అంది.

స్కూటర్ దిగి తనూ కంగారుగా లోనికొ చ్చిన విరాజిత చంద్రకాంతమ్మ పడిన కారణం విని దెబ్బతిన్నట్టుగా చూసింది.

"పాపిష్టిదాన్ని వచ్చి మీకు మంచిసా యమే చేశానండీ" అంది నొచ్చుకుంటూ.

"చినబాబూ! డాక్టర్‌కి ఫోన్ చెయ్" చెప్పాడు శేషాద్రి.

పదిహేన్నిముషాల్లో వాళ్ల ఫ్యామిలీ డాక్టర్ పరమేశ్వర్ వచ్చి చెప్పాడు. "బోన్ ఫ్రాక్చరైనట్టుంది. క్లినిక్‌కి తీసుకురండి. ఎక్స్‌రే తీసిగానీ ఏ విషయం చెప్పలేం" అన్నాడు.

"ఇదేం ఖర్మండీ... పిల్లలెవరూ ఇంట్లో లేని సమయంలో ఇలా అయ్యింది. మిమ్మల్నీ, చినబాబునీ ఇంకెవరు చూసు కుంటారు?" చంద్రకాంతమ్మ ఘొల్లుమంది.

"వూరుకో కాంతం. మా తిప్పలేవో మేం పడతాంగానీ ముందు నీ కాలు విషయం చూడనీ" ఓదార్చాడాయన.

విరాజిత కళ్లలో అసంకల్పితంగా నీళ్ళు తిరిగాయి.

చటుక్కున చంద్రకాంతమ్మ సమీపంగా వచ్చి మంచంపక్కనే మోకాళ్ళమీద కూర్చుని

ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని చెప్పింది. "మీకభ్యంతరం లేకపోతే... మీకు తగ్గేవరకూ నేనిక్కడే వుండి మీకు సాయప డతాను. మీ రుణం ఇలా తీర్చుకోనీండి"

"మంచిదమ్మా. అలాగే కానీ" చెప్పింది చంద్రకాంతమ్మ సంతోషంగా.

చినబాబు ఒక్కక్షణం "అమ్మ పడ్డం ఒకందుకు మంచిదే అయిందే" అనుకున్నాడు. మళ్ళీ అంతలోనే మనసులోనే లెంపలు వాయించుకుని "ఛీ... అమ్మ పడ్డం తనకి సంతోషమా! ఎంత దారుణంగా వుంది తన ఆలోచన!" అని తన్నుతానే తిట్టుకున్నాడు.

మొత్తంమీద ఇప్పుడు తనకి విరాజిత డైరీలో ఎందుకలా రాసీ రాయలేదని అబద్ధ మాడుతోందో తేల్చుకునే ఛాన్స్ దొరికినందుకు మహాసంతోషంగా అన్పించింది.

★ ★ ★

చంద్రకాంతమ్మకు కాలు ఫ్రాక్చర్ కాలేదు గాని, బోన్ డిస్‌లొకేట్ అయిందని చెప్పి కట్టుకట్టారు. ఓ ఇరవైరోజుల వరకూ కదల కూడదని చెప్పారు. పదకొండు గంటలకల్లా హాస్పిటల్ నుండి ఇంటికి వచ్చేసిందావిడ కాలికి కట్టుతో.

విరాజిత కిచెన్‌లోకెళ్ళింది. బాగా అలవాటున్న మనిషిలా వంట చాలా తొందరగా ముగించేసింది. చంద్రకాంతమ్మ వద్దని మొహమాటపడుతున్నా వినకుండా అన్నం కలిపి ఆమె నోటి కందించింది. ఆ పని పూర్తయ్యాక చినబాబునీ, శేషాద్రినీ భోజనానికి పిల్చింది.

చినబాబు ఆరోజు బేంక్‌కి సెలవు పెట్టేసి వున్నాడు. విరాజిత అన్నం కలిపి తల్లికి పెడుతోంది. అతను గమనిస్తూనే వున్నాడు. ఎందుకో ఆ దృశ్యం చాలా బాగున్నట్టనిపించింది.

"మీరూ కూర్చోండి" చెప్పాడు చినబాబు వడ్డించబోతున్న విరాజితకు.





"మీరు కానివ్వండి" చెప్పి వడ్డించసాగింది.

"కూరలు చాలా బాగున్నాయమ్మా" శేషాద్రి అన్నాడు.

చినబాబు మాట్లాడకుండా భోజనం కానిచ్చాడు. సాయంత్రం కాఫీలు. రాత్రి భోజనం అన్నీ చక్కగా అమర్చింది. చంద్రకాంతమ్మకు కావలసిన వన్నీ దగ్గరే వుండి చేసింది.

"నా కన్నకూతుళ్లు కూడా ఇలా ఎప్పుడూ చెయ్యలేదమ్మా" చంద్రకాంతమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ఎందుకు చెయ్యరులేమ్మా. ఇలాంటి అవసరం ఎప్పుడూ వచ్చుండదులే. అయినా ఇదంతా నా మూలంగానే జరిగింది. మీకు లోటు చేస్తే నన్నాభగవంతుడు క్షమించడు" బాధగా అంది విరాజిత.

ఆ రాత్రి చాలాసేపటివరకూ చంద్రకాంతమ్మ దగ్గరే గడిపి, ఆమె నిద్రపోయాక లేచివచ్చి హాల్లో సోఫాదగ్గరకొచ్చింది పడుకోడానికి.

అప్పటికే చినబాబు దాన్ని బెడ్‌గా అరేంజ్ చేసేసి వున్నాడు ఆమె కోసం.

ఆమె మౌనంగా పడుకుని చలిగా అన్పిస్తుంటే నిండుగా దుప్పటి కప్పుకుంది.

ఆమె పడుకోవటాన్ని కిటికీలోంచి గమనించాక తన గదిలో తనూ పడుకున్నాడు చినబాబు.

సమయం రెండు కావస్తున్నప్పుడు ఆమె చివుక్కున లేచింది.

అప్పుడే బాత్‌రూమ్ కెళ్ళొచ్చి పడుకున్న చినబాబుకు హాల్లో అలికిడి స్పష్టంగా విన్పించింది. కిటికీలోంచి చూశాడు.

విరాజిత నిన్న రాత్రిలాగే... అటూ ఇటూ కాసేపు నడిచింది. తరువాత మెల్లగా తన గదికేసి రావడం ప్రారంభించింది. చినబాబు లోపల్నుంచి తలుపు బోల్ట్ తీసేసి ఏమీ ఎరగనట్టు పడుకున్నాడు.

అచ్చం నిన్నలాగే ఆమె అతని రైటింగ్ టేబుల్ దగ్గరకెళ్ళి ఛెయిర్లో కూర్చుంది. డ్రాయర్ లాగి డైరీ తీసి పెన్నందుకుంది.

టేబుల్ లైట్ వెలుగులో స్పష్టంగా కన్పిస్తున్న ఆమె ముఖంకేసి పరీక్షగా చూశాడు చినబాబు పడుకునే.

ఆమె ముఖంలో ఏదో అబ్‌నార్మల్సీ. కళ్ళు తెరచుకునే వున్నా, నిద్రలో వున్నట్టే వుంది. దీక్షగా కనురెప్పలు కూడా మలపకుండా డైరీలోకే చూస్తూ ఏదో రాస్తోంది.

రాశాక లేచింది. వెళ్ళిపోయి పడుకుంటుందేమో అనుకున్నాడు చినబాబు.

ఉహు... ఆమె నేరుగా తన బెడ్ వైపే వస్తోంది. గుండె దడదడమంది చినబాబుకు.

ఆమె బొమ్మలా నడుచుకుంటూ వచ్చి చినబాబు ముఖంమీదికి వంగింది.

ముచ్చెమటలు పోశాయి. నోరు తడారిపోతుండగా లేచికూర్చోబోయాడు.

అతనికా అవకాశం ఇవ్వకుండా ఆమె అటో చెయ్యి ఇటోచెయ్యివేసి మరింత ముందుకు వంగింది.

ఆమె ఏం చెయ్యబోతుందో వూహించేలోగానే చటుక్కున అతని పెదవులమీద గాఢంగా ముద్దుపెట్టుకుంది.

తిరిగి మరబొమ్మలా నిలబడి నేరుగా హాల్లోకి వెళ్ళిపోయి యధాప్రకారం పడుకుంది.

చినబాబు లేచి కూర్చుని ఓ గ్లాసు నీళ్ళు గటగట తాగేశాడు. అప్పటిగ్గాని అతని గుండె దడ తగ్గలేదు. పెదవుల్నోసారి తడిమి చూసుకున్నాడు. అనంతరం లేచెళ్ళి డైరీ అందుకున్నాడు.

"నీలో మనిషిని చూశాను అని కదూ అన్నాను. నువ్వసలు మనిషివే కాదు"

చదువుతూ, చదువుతూ వులిక్కిపడి ఆపాడు 'నేను మనిషినే కానా!'

నొచ్చుకుంటూ కిందలైను చూశాడు.

"నువ్వు మనీషివి. మరో మాటలో చెప్పాలంటే నువ్వో దేవుడివి. ఈ ఇల్లో దేవాలయం"

డైరీ మూసి ఆలోచనలోపడ్డాడు.

పొగడ్త బాగానే వుందిగాని ఆమె తనను ముద్దుపెట్టుకోవడమే మింగుడు పడడం లేదు.

'ఎందుకలా చేసింది' పెదవులు అదేపనిగా తడుముకుంటూ, పదిసార్లు అనుకున్నాడు.

రేపు ఉదయం అదేమిటో తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడుగాని ఆరాత్రి అతనికి మరి నిద్రపట్టలేదు.

విరాజిత మాత్రం ఏమీ జరగనట్టే హాయిగా నిద్రపోతోంది.

★ ★ ★

చినబాబు ఉదయం లేచిన దగ్గర్నుంచీ గమనిస్తూనే వున్నాడు. విరాజితలో ఎటువంటి తొట్రుపాటూలేదు.

తను ఎదురుపడ్డా ఏమి జరగనట్టే మామూలుగా వుంది. ఆమె పని ఆమె చకచక చేసుకుంటూ పోతోంది.

అర్ధరాత్రివేళ తను ఓ పరపురుషుడ్ని పెదవులమీద గాఢంగా చుంబించానన్న స్పృహే ఆమెకున్నట్టుగా అన్పించలేదు చినబాబుకు.

అడగాలి, అడగాలి అనుకుంటున్నాడేగాని ఎలా మొదలుపెట్టాలో, ఎలా అడగాలో అతనికి అర్థంకావటంలేదు. అప్పటికీ కాఫీ ఇచ్చేప్పుడూ, టిఫిన్ తినేప్పుడూ, "ఏమండీ" అని పిలిచాడు. "ఏమిటండీ" అనడగ్గానే "ఏంలేదులెండి" అనేశాడు.

ఏమని అడగ్గలడు. రాత్రి మీరు నన్ను ముద్దుపెట్టుకున్నారెందుకు? అని ప్రశ్నించగలడా తను!

ప్చ్... అడగలేడుగాక అడగలేడు. మరెలా? పోనీ డైరీలో రాసిన విషయం ఏంటని అడిగితే బాగుండును.

ఆమె... ఆ విషయం తనకు తెలియదుగాక తెలియదన్నదిగా నిన్న!

అయినా మరోసారి ట్రైచేస్తే పోయిందేముంది అనుకున్నాడు.

ఆమె కేరియర్ కట్టి అందిస్తున్నప్పుడు అడిగాడు, "రాత్రి మళ్ళీ మీరు నా డైరీలో ఏదో రాశారు"

"చూడండీ... నేనుండటం మీకిష్టం లేక పోతే వెళ్ళిపొమ్మని చెప్పండి. అంతేగాని ఇలా అభాండాలు వేయొద్దు. మీగదిలో కొచ్చి, మీ డైరీ తెరచి రాసే అవసరం, ధైర్యం నాకెందుకుంటాయ్? ఈ రోజు డైరీ అన్నారు, రేపు మరేదైనా అంటే"

విరాజిత ముఖం మ్లానమైపోగా అభిమానంగా అంది.

అదిరిపోయాడు చినబాబు ఆమె మాట తీరుకు.

"అబ్బే లేదండీ. మీరేం రాయలేదు. ఒక వేళ నేనుగాని కలకన్నానేమో! సారీ... అండీ... టేకిటీజీ" స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. పోతూపోతూ అనుకున్నాడు. "ఈరోజు తేల్చుకుంటానీవిషయం. అప్పటికప్పుడే రెడ్‌హేండెడ్‌గా పట్టుకుని కక్కిస్తా నిజం"

★ ★ ★

సాయంత్రం బాంక్‌నుండి వస్తూ దార్లో మెడికల్‌షాపు దగ్గర ఆగి తల్లికి మందులు కొన్నాడు చినబాబు. షాపు యజమానిచ్చిన చిల్లర తీసుకుని షాపు మెట్లు దిగుతుండగా వినబడింది స్వరం.

"సర్... ఈ ఫొటోలోని అమ్మాయిని ఎక్కడైనా చూశారా?"

అడిగిన వ్యక్తికేసి చూశాడు. నల్లగా లావుగా వున్నాడు. ముప్ఫయ్యేళ్ళుంటాయి. క్రాఫ్ వుండాల్సిన దానికన్నా కాస్త ఎక్కువగా పెంచేసి వున్నాడు. కళ్ళు క్రూయల్‌గా వున్నాయి. అతని పక్కనే బక్కపలచగా వున్న మరో వ్యక్తి వున్నాడు. అతనికీ దాదాపు మొదటి వ్యక్తి వయసే వుంటుంది.

"పెళ్ళి పీటల మీంచి పారిపోయి వచ్చేసింది సార్. మీరుగాని చూసుంటే చెప్పండి సార్ ప్లీజ్..." మళ్ళీ అడిగాడా వ్యక్తి.

అప్పుడు చూశాడు చినబాబు ఫొటోకేసి.

ఆమె విరాజిత.

గుండె ఝల్లుమంది.

"పాపం... విరాజిత" అనుకున్నాడు.

ఆమె చెప్పింది కట్టుకథేమో అని ఏమూలో వున్న అనుమానం కాస్తా ఈ యిద్దరి మనుషుల ఎంక్వయిరీతో తుడిచిపెట్టుకుపోయింది.

ఈ రాక్షసులు విరాజిత పిన్నికి సంబంధించిన మనుషులై వుంటారు అనుకున్నాడు.

"చూశారా సార్" బక్కపలచని వ్యక్తడిగాడు.

చినబాబు ఆలోచనల్నుంచి తేరుకుని ఈ లోకంలో కొచ్చాడు. "ఎబ్బే.. నేనెక్కడా చూడలేదు" హడావుడిగా చెప్పి స్కూటర్ స్టార్ట్ చేసి ఆఘమేఘాలమీద ఇంటికి చేరుకున్నాడు.

అతను వెళ్ళేసరికి బత్తాయి పళ్ళరసం తీసిస్తోంది విరాజిత చంద్రకాంతమ్మకు.

"మీరసలు గుమ్మంలో క్కూడా వెళ్ళకండీరోజు" ఉపోద్ఘాతం లేకుండా కంగారుగా చెప్పాడు.

విరాజిత నొసలు ముడిచి చూసిందతనికేసి.

"ఏమైందిరా?" అనుమానంగా అడిగింది చంద్రకాంతమ్మ.

"మెడికల్ షాపులో మందులు తీసుకొని వస్తుంటే ఇద్దరు మనుషులు విరాజిత ఫొటో చూపించి... ఈమెనెక్కడైనా చూశారా అనడిగారమ్మా. అన్ని వీధుల్లో ఎంక్వయిరీ చేస్తున్నారులావుంది"

విరాజిత వణికిపోతూ చూసింది.

"వాళ్ళలో ఒకడు నల్లగా లావుగా వున్నాడా?" అడిగింది భయపడుతూనే.

"ఆఁ... వాడే నన్నడిగింది" చినబాబు చెప్పాడు.

"వాడు మా పిన్ని తమ్ముడు. మహాక్రూరుడు. అసలు వాడే నాకీ ముసలి షావు





కారు సంబంధం చూసింది. ఇప్పుడెలా? "

చినబాబు భరోసా ఇస్తున్నట్టు అన్నాడు. "మీరేం భయపడకండి. వెధవలు... ఈ ఛాయలకొస్తే కాళ్లూచేతులు విరిచెయ్యనూ"

"మీకు కరాటేలాంటి దేమైనావచ్చా? "

"ఉహూం రాదు"

"నాగరాజు కొచ్చు"

"వాడెవడు? "

"వాడే... మా పిన్ని తమ్ముడు"

ఒక్కక్షణం గతుక్కుమన్నాడు చినబాబు. మళ్లీ సర్దుకుని చెప్పాడు "వాడి ముఖం, రానివ్వండి. వాడూ... వాడి కరాటే ఏమాత్రమో తేల్చిపారేస్తా. మీరుమాత్రం నిశ్చింతగా వుండండి"

ఆమె తలూపింది. కిచెన్‌లోకెళ్ళి కాఫీ కలుపుకొచ్చి అతనికిచ్చింది. మళ్ళీ ఏదో పని మీద లోపలికెళ్ళింది.

"నాన్నేడమ్మా" శేషాద్రి కనపడకపోవడంతో అడిగాడు.

చంద్రకాంతమ్మ నిట్టూర్చింది "చిన్నది ఉత్తరం రాసిందిరా ఏమిటో గొడవలట వాళ్ళాయనతో. అర్జంటుగా బయలుదేరి వెళ్ళారు"

చిన్నదంటే చినబాబు చిన్నక్క శోభ. పెళ్ళయి రెండేళ్ళయింది. ఎప్పుడూ భర్తతో గొడవలే.

"చస్తానని రాసిందా? " అడిగాడు ఆందోళనగా.

"నువ్వేం కంగారుపడకురా అదెప్పుడూ అంతేగా. నాన్న వెళ్లారు. అన్నీ సర్దుకుంటాయిగాని, నువ్వీ అమ్మాయిని కాస్త కనిపెట్టి వుండు. పాపం వట్టి అమాయకురాల్లా వుంది. ఎంత సేవచేస్తోందో నాకు. రుణానుబంధరూపేణా అని, ఏ జన్మలో రుణమో ఇలా తీర్చుకుంటోంది".

"ఈమెమీద ఈగవాలనివ్వను లేమ్మా" తల్లితో చెప్పి తన గదిలోకి వెళ్ళాడు.

అతనూహించినట్టు... ఆరోజుకి ఎవ్వరూ ఆమెను వెదుక్కుంటూ రాలేదు.

'థ్యాంక్ గాడ్' అనుకున్నాడు పడుకోబోతూ.

పడుకోబోయేముందు గుర్తుకొచ్చింది. రాత్రి తన పెదవులమీద ఆమె ఇచ్చిన ముద్దు. రాత్రి భయమేసిందిగాని ఆమె అనుచిత ప్రవర్తనకు ఇప్పుడది తలచుకుంటుంటే మాత్రం ఎందుకో ఒళ్లంతా జివ్వుమన్నట్టనిపించింది.

ఓసారి లేచి సోఫాలో పడుకుని వున్న ఆమెకేసి చూసి, మళ్ళీ పడుకున్నాడు. గది తలుపులకు మాత్రం బోల్టుపెట్టలేదు.

పడుకున్నాడేగాని కంటిమీద కునుకు రాలేదు. ఎప్పుడో అర్ధరాత్రి దాటుతుండగా పట్టింది నిద్ర.

మళ్లీ మెలుకువవొచ్చి చూసేసరికి తెల్లగా తెల్లారిపోయివుంది.

రాత్రి ఆమె గదిలోకి వచ్చిందా రాలేదా? అర్థంకాలేదతనికి.

వెళ్ళి డైరీ తీసి చూశాడు.

"నాకు తెలుసు... నీ మనసు నాకోసం తపిస్తోంది. నాక్కావలసిన రక్షణ నువ్వు నాకిస్తావ్.

ఇక నా భయాలూ, బాధలూ నీకే వదిలేసి నిశ్చింతగా వుంటాను"

"అమ్మదొంగా, రాత్రిపట్టలేకపోయా. ఇక ఈ రోజు తప్పించుకోలేవు. ఎందుకంటే ఈ రాత్రి నేనసలు నిద్రపోను" గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఓ విషయం మాత్రం అతనికర్థంకాలేదు. తన పెదవులమీద ఆమె మొన్న రాత్రిలా ముద్దుపెట్టిందా లేదా!

పాడు నిద్రతో అది 'మిస్' అయినందుకు కాస్త వెలితిగా అన్పించింది చినబాబుకు.

★ ★ ★

"స్లీప్ వాకర్ అయివుంటుందిరా. నిద్రలో నడిచే అలవాటు చాలామందికి వుంటుంది"

"నేనూ అదే అనుకున్నా. కానీ, నిద్రలో



ఆమె అంత చక్కగా తన భావాల్ని ఎలా రాయగలుగుతోంది. అదీ... నేరుగా నా రూమ్‌లోకొచ్చి, పర్టిక్యులర్‌గా నా డైరీ తీసి"

"కొంపతీసి దొంగపిల్లేమో చూడరోయ్. మీ అన్నయ్యలూ, వదినలూ లేని సమయంలో కోటలో పాగావేసిందంటే కాస్త జాగ్రత్తగావుండు, ఎందుకైనా మంచిది"

"ఛఛ... ఆ అమ్మాయి అలాంటిదనిపించడంలేదురా" చెప్పాడు చినబాబు.

"ఖచ్చితంగా దొంగపిల్లేరా" హరేరామ్ అటూ ఇటూ చూసి దగ్గర్లో వున్న ఓ బల్ల గుద్దాడు.

చినబాబు ముఖం జేవురించింది.

"అనుమానంలేదు. ఐయామ్ సెంట్ పర్సెంట్ రైట్" రెట్టించాడు హరేరామ్.

"హరీ... ఏమిట్రా ఆ మాటలు? "

"మాటలేమిట్రా. అక్షరసత్యాలు. ఆ పిల్ల నీమనసును దోచేసిందని నీ ముఖం చూస్తుంటేనే తెలుస్తోంది. మరి దొంగపిల్ల కాదంటావా? "

చినబాబు సిగ్గుపడ్డానికి బదులు అంతెత్తున లేచాడు.

"మాటలు తిన్నగా రానీ. పెళ్ళికి నేనెంత వ్యతిరేకినో తెలుసుగా!"

"చూద్దాంగా" హరేరామ్ పంతంగా అన్నాడు.

"లేదురా హరీ, నిన్న మా శోభక్క లెటర్ రాసింది ఏవో గొడవలని. నిజానికి మా బావగారే అమాయకుడు. అతనిచేత వేరుకాపురం పెట్టించాలనే మా అక్క చీటికిమాటికి ఇంట్లో గొడవలు రేపుతుంటుంది. పాపం మా బావ ఆ ఇంట్లో ఏకైక సంతానం. మా అక్కతో వేరుగా వచ్చేస్తే అతని తల్లిదండ్రులు ఒంటరైపోతారు అదీ అతని బాధ. అలాని అక్కని వదులుకోలేడు. నడుమ నలిగిపోతున్నాడనుకో.

"అంతదూరమెందుకు... ఇప్పుడు మా ఇల్లు చూడు అన్నలంతా ఎవరిదారి వారు చూసుకున్నారు. ఒకే ఇంట్లో వుంటున్నా ఎవరికి వాళ్ళమే మేం. నేనొక్కడ్నే అమ్మనీ నాన్ననీ అంటిపెట్టుకుని వున్నా. నాకు తెలుసు. పెళ్ళయితే నేనూ అన్నయ్యల్లా కాక తప్పదు. పెళ్ళాం పవర్ అలాంటిది. అమ్మా నాన్నలకు నేను కూడా దూరమైతే వాళ్ళు భరించలేరు. అందుకేరా నాకు పెళ్ళంటే అసహ్యం"

"ఓ. కే. ఓ. కే. లీవిట్. ఇక పాయింట్లోకి వద్దాం. ఈరోజు అలర్ట్‌గా వుండు. మనిషిని కదిపిచూడు స్పృహలోకొస్తుందేమో!"

"అదే అనుకుంటున్నా. ఫ్రెండ్‌వి కదా నీకు చెప్పాలనిపించింది అందుకే చెప్పారా"

"మంచి పని చేశావ్‌లే. అన్నట్టు నాదో సలహా. నువ్ ప్రేమించకపోతే పోయావ్ గాని ఆ పిల్లను మాత్రం ఎవరికీ అప్పగించకు. ఆమె కోసం ఇద్దరెవరో తిరుగుతున్నారన్నావ్‌గా? "

"అలా ఎందుకు చేస్తాన్రా. నన్ను దేవుడు అని నమ్ముతున్న మనిషిపట్ల నేను దయ్యంలా ప్రవర్తిస్తాననుకున్నావా? "

"మొత్తానికి అదృష్టవంతుడివిరా" చెప్పాడు హరేరామ్.

"ఎందులో? " నవ్వాడు చినబాబు.

"అర్ధరాత్రి ఓ అందాల రాశి... తలుపు తట్టి మరీ అడక్కుండా ముద్దులిస్తోందంటే మైగాడ్ దేన్నికైనా యోగం వుండాలిరా"

"అదుగో మళ్ళీ" చిరుకోపం ప్రదర్శించాడు చినబాబు.

"మరి నేవస్తా. మీ చెల్లాయ్ ఎదురుచూస్తుంటుంది" లేచాడు హరేరామ్.

"ఏంకూరోయ్ ఇవాళ? " చినబాబు ఉడికిస్తూ అడిగాడు.

చుట్టుపక్కలెవరైనా విన్నారేమో అని కంగారుగా అటూ ఇటూ చూశాడు హరేరామ్.

"జాగ్రత్త, నన్నాటపట్టిస్తే నా దగ్గరావుంది ఆయుధం. నిన్నూ ఆటపట్టిస్తా" హెచ్చరిం





చాడు చినబాబు.



బెడ్‌మీద పడుకునే చినబాబు కళ్ళు పత్తి కాయల్లా తెరుచుకుని వున్నాడు. ఒకటి రెండుసార్లు నిద్రపట్టబోతే బలవంతంగా ఆపుకుని అటూ ఇటూ తిరిగి తన్నుతాను నిద్రకు దూరం చేసుకున్నాడు.

మాటిమాటికీ సోఫాకమ్ బెడ్‌లో పడుకుని వున్న విరాజితకేసి తన గది కిటికీ లోంచి చూస్తున్నాడు. దాదాపు రెండు కావస్తుండగా అతని నిరీక్షణ ఫలించింది.

విరాజిత నిటారుగా లేచి కూర్చుంది. కీ ఇచ్చిన బొమ్మలా నిలబడి రెండుసార్లు ఆమూలనుంచి ఈ మూలకూ ఈ మూల నుంచి ఆ మూలకు తిరిగింది. అనంతరం ఓ టర్నింగ్ తీసుకుని చినబాబు గదికేసి నిర్నిమేషంగా చూసింది.

చినబాబు కిటికీ దగ్గర్నుంచి ఒక్క అంగలో బెడ్‌మీద పడి గుండెలవరకూ దుప్పటి కప్పుకున్నాడు.

గది తలుపులు మెల్లగా తీసిందామె. ఈసారి ముందు టేబుల్ దగ్గరకు పోలేదు. నేరుగా చినబాబు బెడ్ దగ్గరకొచ్చి నిలబడింది.

చినబాబు ఒక్కసారి పెదవులు నాలుకతో తడుపుకుని ముద్దుకోసం రెడీ అయిపోయి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

ఎంతసేపటికీ ఆమె పెదవులు తన పెదవులమీద ముద్రవేయక పోవడంతో కొద్దిగా కుడికంటి రెప్పపైకెత్తి చూశాడు.

ఆమె అలాగే అతన్ని రెప్పవాల్చకుండా చూస్తోంది.

అర్ధరాత్రి. ఆ నిలబడ్డం ఆ చూడ్డం, ముద్దుమాట దేవుడెరుగుగాని చినబాబుకెందుకో కాస్త భీతిగా అనిపించింది.

అయినా తనామెను రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవాలనుకున్నాడు కదా! మరి ఆమె రాగానే... ఇదేమిటి... ముద్దుకోసం వాచిపోయి అన్నీ మరిచిపోయి ఇలా బిగదీసుకుని "చినబాబూ! యూ ఆరే ఫూల్" తన్ను తానే తిట్టుకుంటూ లేవబోయాడు.

అప్పుడు కదిలింది విరాజిత. లేవబోతున్న అతన్ని సున్నితంగా వెనక్కి నెట్టి అతని గుండెలమీద పసిపాపలా తలపెట్టుకుని పడుకుంది.

"గొంతేమైనా కొరికి రక్తం తాగదు కదా!"

భయంగా అనుకున్నాడు. ఈమధ్యే చూసిన ఓ ఇంగ్లీషు సినిమా అలా కళ్ళ ముందు కదలిపోయింది.

ఓ రెండునిముషాలు టెన్షన్‌గా గడిచిపోయాయి గాని చినబాబు అనుకున్నట్టు విరాజిత గొంతు కొరకడం కాదుకదా గిచ్చడం లాంటిది కూడా చెయ్యలేదు.

అలాగే వెచ్చగా అతని గుండెలమీద పడుకుండిపోయింది. ఆమెవల్ల ప్రమాదం లేదని క్లియర్‌కాగానే భయం కాస్తా మాయమైపోగా... మొదలైంది చినబాబు ధమనుల్లో సిరల్లో ఓ తీయని ప్రకంపన.

మూడోనిముషం గడుస్తుండగా ఆమె చివుక్కున లేచింది. మగతలోనే నడుస్తూ టేబుల్ని సమీపించి కుర్చీలో కూర్చుని డైరీ అందుకుంది. ఏదో రాసేసి ఎప్పట్లా వెళ్లి సోఫాలో పడుకుంది.

చినబాబు స్ప్రింగ్‌లా లేచి డైరీ అందుకున్నాడు.



"నీ గుండెల సవ్వడి విన్నాను. అది నా పేరే పదేపదే జపిస్తోంది. మెనీమెనీ టెండర్ థాంక్స్"

ఓసారి కాదు... రెండుమూడు సార్లు చదువుకున్నాడు. ఆమె రాసిన దాన్నే మననం చేసుకుంటూ నిద్రలోకి జారిపోయాడు.

తెల్లవారుజామున ఐదు గంటల వేళ మామూలుగా లేచింది విరాజిత. ఆమెతో పాటు మెలకువవచ్చిన చినబాబుకు ఇక పడుకోబుద్ధి కాలేదు. అలవాటుకు విరుద్ధంగా త్వరగా లేచేశాడు.

విరాజిత గుమ్మంలో శుభ్రంగా వూడ్చి నీళ్లు చల్లింది.

సంక్రాంతి నెల కావటంతో ప్రతి గుమ్మం ముందూ ఆడవాళ్లు చలికి నరాలు జివ్వు మంటున్నా పట్టించుకోకుండా పోటీలుపడి ముగ్గులు పెడుతున్నారు.

విరాజిత కూడా గుమ్మంలో కూర్చుని ముగ్గుతో చుక్కలు పెట్టింది. పదహారు చుక్కలు పదహారు వరుసల్లో పెట్టి కలపడం మొదలెట్టింది. దాదాపు ముగ్గు పూర్తి కావస్తుండగా నాగరాజూ, అతని అనుచరుడూ ఆ వీధిలోకి ప్రవేశించారు.

ఆసరికి... చీకట్లు విడిపోయి తూర్పు ఎర్రబడుతోంది.

సన్నటి ఎర్రటి వెలుతుర్లో... విరాజిత వేస్తున్న తెల్లటి ముగ్గు ఓ వింత కాంతితో ధగధగ మంటోంది.

"ఈ ఫొటోలో అమ్మాయిని మీరుగాని చూశారా? "

గాలివాలుకి చెవికి సోకిన ఆ మాటలకు విరాజిత చేతుల్లోని ముగ్గు గిన్నె జారినేల మీదపడింది.

గుండెలు గుబగుబ లాడుతుండగా తల తిప్పి చూసింది. ఆ ఇంటికి రెండిళ్ల అవతలగా ముగ్గు పెడుతున్న ఓ నడి వయసు స్త్రీని... ఫొటో చూపించి అడుగుతున్న నాగరాజు ఆమె కళ్లబడ్డాడు.

అంతే... తుపాకి గుండులా ఇంట్లోకి దూసుకు పోయింది. కుర్చీ తట్టుకోబోయి.. టీపాయ్‌మీద ఫ్లవర్ వాజ్‌ని తోసేసి గోడకు గుద్దుకోబోయి... దార్లో అడ్డొచ్చిన వస్తువుల్ని తన్నేసి... అప్పుడే బాత్‌రూమ్ లోంచి స్నానం చేసి వస్తున్న చినబాబును అలాగే వాటేసుకుంది.

"ఏయ్.. ఏమిటిది" అయోమయంగా ఆమెను తన నుంచి విడదీయబోతూ అడిగాడు.

"నా.. నాగరాజు" చూపుడు వేలితో గుమ్మంవైపు చూపించి గట్టిగా కళ్లుమూసుకుని అతన్ని ఇంకా ఇంకా హత్తుకుపోయింది.

ఓ పరువంలో వున్న అమ్మాయి... తన రక్షణ కోరుతూ భయంతో తన్ను హత్తుకుపోవటం... గమ్మత్తుగా మత్తుగా అన్పించింది చినబాబుకు.

"వాడి ముఖం... రానీ రాస్కెల్‌ని... నాలుగు తగిలిస్తా"

"వాడికి కరాటే వచ్చు"

"ఓసారి చెప్పావుగా"

"గుర్తు చెయ్యటం మంచిదని. పైగా పక్కనున్నాడే బక్కపల్చగా వాడి ఫ్రెండ్.. బలరాం.. వాడికి కర్రసామూ కత్తితిప్పటం తెలుసు"

ఆమె అవన్నీ చెప్పటం చినబాబుకి ఇన్‌ఫీరియర్‌గా అన్పించింది. "అయితే నాకేం భయమనుకున్నావా? చూడు వాళ్లనేం చేస్తానో" ఆమెను పక్కకు తోసేసి గబగబ వెళ్లి మెయిన్‌డోర్ బోల్ట్ మీద చెయ్యేశాడు.

అతను బోల్ట్‌మీద చెయ్యివెయ్యటం... కాలింగ్ బెల్ మోగడం ఒక్కసారే జరిగాయి.

ఉలిక్కిపడి చెయ్యి వెనక్కు తీసుకున్నాడు. "వాళ్లేనేమో!" ఆమెతో అన్నాడు.

"ఏమో ఏంటి... వాళ్లే నేను కిచెన్‌లో దాక్కుంటా. మీరు మేనేజ్ చెయ్యండి"

ఆమెను లోపలికి వెళ్లనిచ్చి చినబాబు





మెల్లగా తలుపుతీసి బిక్కుబిక్కుమంటూ బయటకు చూశాడు.

అనుకున్నట్టే నాగరాజూ, బలరాం నిల బడి వున్నారు.

నాగరాజు రఫ్‌గా చినబాబు ముందుకు వచ్చి టవల్ చుట్టుకుని వున్న అతన్ని ఎగా దిగా ఓసారి చూసి గరగర మంటున్న గొంతుతో అడిగాడు. "ఈ ఫొటోలో అమ్మాయి మీ ఇంట్లో వుంది పిలువ్ బయ టకు"

మరీ ఏకవచనంలో అంత వైల్డ్‌గా అడిగే సరికి చినబాబు కాస్త షాక్ అయ్యాడు. అయినా బింకంగా అన్నాడు "మా ఇంట్లో అమ్మాయి లెవరూ లేరు"

"నాకు కరాటే వచ్చు" బెదిరిస్తూ చూశాడు.

"నాకు..." బలరామ్ చెప్పబోతుంటే,

వెంటనే అందుకున్నాడు చినబాబు "తెలుసు... నీకు కత్తిసామూ... కఱ్ఱ సామూ వచ్చు ఆ అమ్మాయ్ చెప్పింది"

"ఏ అమ్మాయ్?" నాగరాజు అడిగాడు అనుమానంగా.

గతుక్కుమన్నాడు చినబాబు. వంట గదిలో నక్కి వాళ్ల మాటలు వింటున్న విరా జిత ప్రైప్రాణాలు పైనే పోయాయి. చిన బాబు ఏం చెబుతాడోనని చెవులు రిక్కిం చింది.

"ఏ అమ్మాయంటే నే చదువుకునే రోజుల్లో విరూపాక్షి అని నా క్లాస్‌మేట్ వుండేది. ఆమెదీ మీ వూరే అనుకుంటా. ఎప్పుడూ బలరామ్... బలరామ్ అంటూ నీ పేరే పలవరిస్తూ వుండేది. బలరామ్ ఎవ రంటే జానపద సినిమాల్లో కాంతారావుకు మల్లే కత్తియుద్ధం, కఱ్ఱయుద్ధం చేస్తాడనీ, అతనికి మల్లే.. వుంటాడనీ తెగ చెప్పేది. ఆమె వర్ణనల్ని బట్టి నిన్ను చూడగానే ఆ రాకుమారుడి పర్సనాలిటీ నీదే అని పసిగ ట్టేశా"

బలరామ్ బక్కపలచని దేహం అంగు ళంలో వెయ్యోవంతు ఉబ్బింది.

"ఇప్పుడా విరూపాక్షి ఎక్కడుంది?" ఆత్రంగా అడిగాడు.

నాగరాజు బలరామ్ వీపు మీద ఒక్కటి చరిచాడు. "మనమొచ్చింది నీ గర్ల్‌ఫ్రెండ్ కోసం కాదురా బేవకూఫ్. మా అక్క కూతురు విరాజిత కోసం..."

అతను చరిచిన దెబ్బకు ముందుకు పడ బోయి నిలదొక్కుకుని తనూ కోపంగా చూశాడు బలరామ్ "నా గర్ల్ ఫ్రెండ్ విష యంలో నాకు సాయపడితేనే మీ అక్క కూతురు విషయంలో నీకు సాయం చేస్తా. ఇక మన మధ్య స్నేహం లేదు. బిజినెస్ మాత్రమే"

నాగరాజు ఏం చెప్పకుండా బలరామ్‌ని మింగేసేలా చూశాడు.

"నీ ఇష్టం. ఈ రోజుల్లో ఒక్క కరాటేతోనే అన్నీ సాధించలేరు. నాలాంటి ప్రాచీన విద్యలు తెలిసిన వాడితోడు ఎంతో అవ సరం. 'భారతీయుడు' సినిమా చూళ్లా?" బలరామ్ అడిగాడు.

నాగరాజుకి వెంటనే కమల్‌హాసన్ కేవలం రెండువేళ్లు మడిచి మార్షల్ ఆర్ట్స్ తెలిసిన ఇన్‌స్పెక్టర్లని సైతం మట్టి కరిపిం చడం కళ్లముందు మెదిలింది.

విధిలేక ఒప్పుకుంటున్నట్టుగా చేతిని ముందుకు చాపాడు.

"ఇక అయిందా" అంతవరకూ ఓపిగ్గా వారి వివాదాన్నే గమనిస్తున్న చినబాబు అడిగాడు విసుగ్గా.

"అయింది. ఇంతకీ విరూపాక్షి అడ్రస్" బలరామ్ నసిగాడు.

"వుండు.. ముందు విరాజిత సంగతి కనుక్కోనీ" కసిరాడు నాగరాజు.

"విరాజిత ఎవరో నాకు తెలీదు" చెప్పాడు చినబాబు.

"మీ ఇంటి ముందు ఓ అమ్మాయి ముగ్గు పెట్టడం నేను కళ్లారా చూశాను. పైగా మీ ఇరుగు పొరుగు వాళ్లు మీ ఇంట్లో ఈమధ్య

ఓ కొత్త ఫేస్ తిరగడం గమనించామని చెప్పారు"

"ఓహో... ఆ అమ్మాయా! ఆమె మా పక్కింటి ప్రేమాన్వితండీ ఆ అమ్మాయి నన్ను ప్రేమిస్తోంది. వన్‌వే లవ్. నన్నెలాగైనా ముగ్గులోకి దించాలని రోజూ ఉదయాన్నే మా ఇంటి ముందు ముగ్గులేస్తుంటుంది"

"అంతేనంటావా? " నాగరాజు హుంకరించాడు.

చినబాబు బలరామ్‌కేసి తిరిగి "విరూపాక్షి అడ్రసు కావాలా? " అడిగాడు.

"రేయ్ నాగరాజూ... అతనంతగా చెబుతుంటే అనుమానించటం భావ్యంకాదు" బలరామ్ చినబాబుకి సపోర్ట్ చేశాడు.

చినబాబు బలరామ్‌కేసి కృతజ్ఞతగా చూసి అడ్రస్ చెప్పటం మొదలెట్టాడు. "కనక మహాలక్ష్మి గుడి తెలుసుగా.. ఆ గుడికి నాలుగు వీధులవతల.. ఓ ఎలక్ట్రిక్ పోల్ వుంటుంది"

"ఎలక్ట్రిక్‌పోల్స్ ఎక్కడబడితే అక్కడ వుంటాయిగా" బలరామ్ అనుమానంగా అడిగాడు.

"ఈ ఎలక్ట్రిక్ పోల్ మీద ఓ కాకి కూర్చుని వుంటుంది"

"కాకి ఎప్పుడూ అక్కడే వుంటుందా? " చినబాబుకేసి బ్రెయినుందా అన్నట్టు చూశాడు బలరామ్.

చినబాబు మందహాసం చేసి చెప్పాడు "ఆ కాకి ఎప్పుడూ అక్కడే వుంటుంది. అది దాని హాబీ. నీకు అర్నిథాలజీ తెలుసా? "

"అంటే"

"అది పక్షుల శాస్త్రంలే... వాటి అలవాట్లూ.. జీవన విధానం అదంతా అందులో రాసుంటుంది. కాకుల హాబీ గురించి అందులోనే చదివి తెలుసుకున్నాను నేను"

"సర్లే అడ్రెస్ చెప్పు"

"ఆ ఎలక్ట్రిక్ పోల్ దగ్గరకెళ్లి.. దానికి ఎడమ వైపుగా వున్న ఓ సందులోకి తిరుగు... నేరుగా వెళ్లి మెయిన్ రోడ్డెక్కి ఎక్కడా ఆగకుండా ఓ కిలో మీటర్ సూటిగా నడువ్. నడిచాక కుడివైపు తిరుగు.. తరువాత ఎడమ... తరువాత కుడి.. అక్కడాగిపో అదే విరూపాక్షి వుండే చోటు"

బలరామ్ చినబాబుకు కరచాలనం చేశాడు. నాగరాజు లోపల్లోపలే పళ్లు నూరుకున్నాడు.

ఇద్దరూ వెళ్లిపోయాక తలుపు మూసేశాడు.

విరాజిత వంట గదిలోంచి ఇవతలకొచ్చి "థాంక్యూ" అంది.

"అమ్మాయ్... విరాజితా!" చంద్రకాంతమ్మ నిద్ర లేచిందేమో విరాజితను పిలిచింది.

"వస్తున్నానండీ" హడావుడిగా వెళ్లింది విరాజిత.

"ఎవరూ వచ్చింది? " అడిగింది.

"మీ అబ్బాయిగారి ఫ్రెండ్స్" చెప్పింది ఆమెనెందుకులే నిజం చెప్పి ఉదయాన్నే కంగారు పెట్టటం అని.

"అంతేనా.. ఇంకా ఆయనేమో అనుకున్నాలే" చిన్న కూతురింటికి వెళ్లిన శేషాద్రిని తలచుకుంటూ అంది చంద్రకాంతమ్మ.



చినబాబు రెడీ అయి బ్యాంక్‌కి బయలుదేరబోతున్నప్పుడు పిలిచింది చంద్రకాంతమ్మ.

"ఏమ్మా" అడిగాడు.

"మీ నాన్నకు ట్రంకాల్ చెయ్యరా వెళ్లి రెండ్రోజులైంది. ఇంకా రాలేదంటే గొడవ కాస్త ముమ్మరమైనట్టే. కాకుంటే నాకిలా బాగలేదని తెలిసీ... చస్తే వుండడాయన అక్కడ ఇన్ని రోజులు"




"అలాగేలేమ్మా! అయినా రెండ్రోజులేగా అయింది" అన్నాడు.

"ఇంకో మాటరా"

"ఏంటమ్మా"

"పాపం ఆ పిల్ల నాలుగు రోజులబట్టీ... ఇంటెడు చాకీరి చేస్తోంది. ఇక నన్నయితే తల్లిలా చూస్తోంది. పాపం తల్లిలేని పిల్ల. పండగిక నాలుగు రోజులు వుంది. సాయంత్రం అలా బజారుకి తీస్కెళ్లి రెండు చీరలేమైనా కొనిపెట్టరా. ఏదో మనమూ ఆ పిల్ల రుణం తీర్చుకున్నట్టు వుంటుంది"

చినబాబుకిది నచ్చింది. హుషారుగా కిచెన్‌లోకెళ్లి కాఫీ కలుపుతున్న విరాజితకు చెప్పాడు "సాయంత్రం రెడీగా వుండండి బజారుకెళ్దాం"

అయోమయంగా చూసిందామె.

"అమ్మ చెప్పింది. మీకు చీరెలు కొని పెట్టమని" చెప్పాడు. చెప్పి ఆమె సమాధానం కోసం వెయిట్ చెయ్యకుండా వెళ్లిపోయాడు.

విరాజిత చంద్రకాంతమ్మకు నచ్చజెప్పబోయింది తనకు చీరెలు వద్దని. ఆమె విన్లేదు. పైగా 'నీ తల్లినయితే ఇలా అంటావా? ' అని నిష్టూరపడింది.

విరాజిత ఇక చేసేది లేక చినబాబు వచ్చేసరికి రెడీ అయిపోయింది.

కామేశ్వరి చీరెల్లోంచి గులాబీల ప్రింటున్న ఓ తెల్ల షిఫాన్ చీరెతీసి కట్టుకుంది. జడలూజుగా అల్లి వదిలేసి ఓ తెల్ల గులాబీ చెవి పక్కగా అమర్చుకుంది.

"ఫెంటాస్టిక్" అనుకున్నాడు చినబాబు.

చినబాబు ముఖం కడుక్కుని కాఫీ తాగాక చంద్రకాంతమ్మకు తోడుగా పక్కింటి పదేళ్ల ప్రేమాన్వితను వుంచి బయలుదేరారిద్దరూ. విరాజిత అతని వెనక స్కూటర్ మీద కూర్చోడానికి తటపటాయిస్తుంటే అడిగాడు. "పోనీ ఆటో పిలవనా? "

"వద్దులెండి" ఆమె మొహమాటంగా అని ఎక్కి కూర్చుంది.

అతనికి తగలకుండా సాధ్యమైనంతవరకూ జాగ్రత్తపడుతూ సర్దుకుంది.

మొన్న పెదవుల మీదిచ్చిన ముద్దూ.. నిన్న గుండెల మీద నిద్రా... ఉదయపు కౌగిలింతా కళ్లముందు మెదిలి నవ్వుకున్నాడు చినబాబు.

స్కూటర్ కాస్త దూరం వెళ్లాక అడిగింది.

"ఒకవేళ నాగరాజూ, బలరామ్ కనిపిస్తే..."

"తుక్కుకింద కొడతాను" చెప్పాడు చినబాబు. మనసులో మాత్రం వాళ్లు కనబడకూడదని ఇష్టదైవాన్ని ప్రార్థించుకున్నాడు.

షాపులో చీరెల సెలక్షన్ దాదాపు గంట పట్టింది. ఆమె వద్దంటున్నా వినకుండా రెంటికి బదులు నాలుగు చీరెలు ప్యాక్ చేయించాడు.

దార్లో... ఐస్‌క్రీమ్ పార్లర్‌కెళ్లారిద్దరూ. విరాజితకిష్టంలేదు గాని అతను పడనీలేదు.

ఇద్దరూ మౌనంగా ఐస్‌క్రీమ్ తింటున్నారు.

ఉన్నట్టుండి అందామె "ఇంకో అయిదారు రోజుల్లో మీ అన్నయ్యలూ వదినలూ వచ్చేస్తారుగా. వాళ్లంతా రాకముందే వెళ్లిపోవాలనుకుంటున్నా"

చినబాబుకి ఆమె అలా అనటం నచ్చలేదు.

"ఎక్కడికెళతారు? " తన ఫీలింగ్స్ కప్పిపుచ్చుకుంటూ అడిగాడు.

"చెప్పాగా... పక్కవూళ్లో మా నాన్నగారి ఫ్రెండొకాయన వున్నారు. మా నాన్నగారు బతికున్నప్పుడు ఆయనోసారి మా ఇంటికి వచ్చారు. నన్ను అభిమానంగా పలకరించి 'ఎప్పుడైనా రావాలనుంటే మా వూరికి రామ్మా' అని చెప్పారు. ఆ ఆహ్వానం ఇప్పటికి పనికొచ్చింది" చెప్పింది విషాదంగా.

"ఇక్కడే వుంటే మీకొచ్చే ఇబ్బందేమిటి? "

ఆమె తలెత్తి అతని కళ్లలోకి చూసింది. "నేనున్నది మీ అమ్మగారికోసం. వాళ్లొస్తే





నా అవసరమేముంది!"

"మా అమ్మకు మీలా సేవలు చేసే కోడళ్లుకాదులెండి మా వదినలు"

"పోనీ ఓ పని చెయ్యండి" నవ్వుతూ చూసిందామె.

"ఏమిటి? "

"ఓ మంచి పిల్లను చూసి పెళ్లి చేసుకోండి. మీ అమ్మగారికి చేదోడు వాదోడుగా పనికొస్తుంది"

'పెళ్లి' అన్నమాట వినగానే ఎప్పట్లా మామూలుగా రియాక్టయ్యాడు చినబాబు. ముఖం అయిష్టంగా పెట్టి అన్నాడు "పెళ్లి అనే పదం నా లైఫ్ డిక్షనరీలోనేలేదు"

"అదేమిటి? " అదిరిపోతూ చూసింది.

"అదంటే నాకసహ్యం"

"ఎందుకని"

"పెళ్లాం అనే మనిషి రాగానే మగాడు మారిపోతాడు. తల్లిదండ్రుల్ని మరచిపోతాడు. చివరికి తన్నుతానే కోల్పోయి ఆమెకు బానిసవుతాడు. నాకలా కావడం ఇష్టంలేదు"

"పెళ్లాం రాగానే మగాడు మారిపోవడానికి కారణం ఆమె అని ఎందుకనుకోవాలి. అది ఆ మగాడి బలహీనత కావచ్చు"

"కారణం ఏదైనా.. కుటుంబాలు విడిపోయేది భార్య రాకతోనే" స్థిరంగా చెప్పాడు.

"పొరబడుతున్నారు" ఆమె ఐస్క్రీమ్ తినడం ఆపి అతన్ని సూటిగా చూసింది. "ఈ పురుషాధిక్య ప్రపంచంలో ఒక ఆడది మగాడ్ని మార్చడం అనేది శుద్ధ అబద్ధం. బేసికల్‌గా పురుషుడు స్వార్థపరుడు. పెళ్లి పేరుతో ఓ ఆడది తన జీవితంలో ప్రవేశించగానే అతడిలో అంతకాలం నిద్రాణమై వున్న స్వార్థం వెర్రితలలు వేస్తుంది. తన కంటూ ఓ ఇల్లూ... సంపాదనా వుండాలన్న తపన పెరుగుతుంది. భార్య తెలిసీ తెలియక అనే మాటల్ని ఆసరాగా తీసుకుని.. నెపం తెలివిగా భార్యమీద పెట్టి తల్లిదండ్రుల్నుంచి విడివడతాడు. ఆస్తి పంచమంటాడు. ఇదంతా భార్య వచ్చాక జరిగే తంతు కాబట్టి సహజంగా అందరూ ఆమెనే ఆడిపోసుకుంటారు. భర్తమాత్రం అమాయకుడిగా కీర్తించబడతాడు. ఏం పెళ్లాం కొంగుపట్టుకుని నోట్లో వేలేసుకుని ఆమె చెప్పినట్టల్లా ఆడ్డానికి అతనేమన్నా లోకం తెలియని పసివాడా? వయసూ, వ్యక్తిత్వం, జ్ఞానం అన్నీ వున్నాయిగా. అవన్నీ పక్కన పెట్టి భార్య చెప్పింది వింటున్నట్లు నటిస్తూ ఆమెకోసమే అన్నీ చేస్తున్నట్టు నమ్మిస్తూ తననుకున్నది సాధించటమే మగాడి తెలివి"

ఆవేశంగా ముగించి ఐస్క్రీమ్ కప్పుకేసి చూసింది. ఐస్క్రీమ్ కాస్తా ఎప్పుడో కరిగిపోయింది.

"మరోటి ఆర్డరివ్వనా? " అడిగాడు చినబాబు.

"అక్కర్లేదు. నేచెప్పింది రీజనబులేనంటారా? " అడిగింది.

"మీరూ ఆడవారే కాబట్టి అట్నుంచి నరుక్కొచ్చారు"

"మీరు మరీ నేరుగా ఆలోచిస్తున్నారు" చెప్పిందామె.

బేరర్ బిల్ పట్టుకొచ్చాడు.

యాభై నోటు సాసర్‌లో పడేశాడు చినబాబు. అది తీసుకుని అతను వెళ్లగానే విరాజిత అంది "నేను అందరి మగాళ్లనీ అలా అనటంలేదు. కొందరినే! ఇప్పుడు మిమ్మల్నే తీసుకోండి. మీరు ఖచ్చితంగా అందరిలాంటి మగాడు కాదు. సమ్‌థింగీజ్ స్పెషల్ విత్ యూ"

"ఏమిటో అది" కుతూహలంగా అడిగాడు.

"మీ పర్సనాలిటీ చూస్తుంటే మీరు భార్య మాట వినేవారిలా అనిపించటంలేదు. అలాగని ఆమెని నిర్లక్ష్యం చేస్తారని కాదు. ఎవరికివ్వాల్సిన విలువ వారికిస్తారు. మీ వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటారు. ముఖ్యంగా



మీలో స్వార్థంలేదు. అదే మీ ఎస్సెట్. భార్యా, తల్లీ, చెల్లీ ఎవరూ మిమ్మల్ని మార్చ లేరు. లైఫ్‌లాంగ్ మీరు మీరుగానే వుంటారు. సో మీరు పెళ్లి చేసుకోండి.. ప్లీజ్"

బేరర్ మిగతా చిల్లరతో వచ్చి సాసర్ టేబుల్ మీద పెట్టాడు. చినబాబు కాస్త టిప్‌కింద వదిలి మిగతాది పర్సులో వేసుకు న్నాడు.

ఇద్దరూ బయటకు వచ్చారు. చినబాబు రిస్ట్‌వాచ్‌కేసి చూసుకున్నాడు. తొమ్మిది దాటి అప్పుడే ఇరవై నిముషాలైంది.

"అమ్మ ఒకతేకదూ... త్వరగా వెళదాం" అన్నాడు. విరాజిత మౌనంగా స్కూటరెక్కి కూర్చుంది.

"ఇంతకీ ఏం నిర్ణయించుకున్నారు? పెళ్లి చేసుకుంటారా? "

"చేసుకోను. నా అనుభవాలు అలాంటివి"

"మీ ఇల్లే మీ ప్రపంచమా? " అడిగిం దామె.

"ప్రపంచం నిండా వుండేది మాలాంటి ఇళ్లే" చెప్పాడతను.

"అయితే ఘోటక బ్రహ్మచారిగానే వుండి పోతారన్న మాట"

"ఎగ్జాట్లీ"

విరాజిత మరి మాటలు పొడిగించలేదు.

సగం దూరం వచ్చాక వెనకెవరో ఫాలో అవుతున్నట్టు అనుమానం కలిగింది చినబా బుకు. రియర్‌వ్యూ మిర్రర్‌లోంచి పరీక్షగా చూశాడు.

వెనకనే మరో స్కూటర్ మీద వస్తు న్నారు నాగరాజూ, బలరామ్‌లు.

"వాళ్లు మనల్ని ఫాలో అవుతున్నారు" మెల్లగా చెప్పాడు విరాజితకు.

అంతవరకూ అతన్ని అంటుకోకుండా కూర్చున్న విరాజిత చప్పున అతని నడుం వాటేసుకుంది "ఇప్పుడెలా"

"కంగారుపడకు. దగ్గర్లో మా ఫ్రెండ్ ఇల్లుంది. వీళ్లకి స్లిప్ ఇచ్చి అక్కడికెళ్లి పోదాం. వాళ్లు చూస్తుండగా ఇంటికి వెళ్లటం అంత మంచిదికాదు"

"మీ ఇష్టం" చెప్పిందామె గట్టిగా కళ్లు మూసుకుని అతన్ని మరింత గట్టిగా పట్టు కుంటూ.

చినబాబు శరవేగంతో పోనిస్తున్నాడు. స్కూటర్‌ని తోచిన దిక్కుకల్లా పరిగెత్తిస్తు న్నాడు.

స్కూటర్ని ఓ నాలుగైదు వీధులు తిప్పి ఎలాగో నాగరాజూ బలరామ్‌లకు స్లిప్ ఇచ్చి హరేరామ్ ఇంటి ముందు ఆపాడు.

హడావుడిగా వెళ్లి కాలింగ్ బెల్ నొక్కాడు. అతని వెనకే వణికిపోతూ నిల బడి వుంది విరాజిత.

ఓ నిముషం తర్వాత తలుపు తెరుచు కుంది.

"అరె నువ్వా" అంటున్న హరేరామ్‌ని తోసుకుంటూ లోపలికెళ్లాడు. విరాజిత అతని వెనకే ఒక్క దూకులో లోపల పడి తలుపు బిగించేసింది.

ఏదో అడగబోతున్న హరేరామ్‌తో చెప్పాడు చినబాబు "ఇప్పుడేం అడక్కు. ఈ అమ్మాయిని లోపల దాచెయ్. బయటనా స్కూటరుంది. ఎవరొచ్చి అడిగినా అది నీదని చెప్పు. నీ వెనుక వచ్చింది ఎవరంటే నీ వైఫ్ అని చెప్పు. చూపించమంటే చెల్లా యిని చూపించు ప్లీజ్" అర్థింపుగా చూశాడు.

"సరే.. మరి నువ్ లోపలికి తగలడు. ఆ అమ్మాయిని కూడా తీసుకెళ్లు" చెప్పాడు హరేరామ్.

సిట్యుయేషన్ అర్థంకాకపోయినా అందులో టెన్షన్ని అర్థం చేసుకుని హరే రామ్ పక్కకొచ్చి నిలబడింది పారిజాతం.

చినబాబు ఒక్క అంగలో లోపలికెళ్లిపో యాడు విరాజితతో పాటు.





వెళ్లగానే అక్కడున్న ఓ శాల్తీని చూసి ప్రాన్పడిపోయాడు.

ఆమె... నేరెళ్ల విజయభారతి.

"అరె మీరిక్కడ... వెరీ గ్లాడ్ టూ మీట్ యూ" చేయి చాచింది పక్కనే వున్న విరాజితను కోరగా చూస్తూ.

ఆమె చేతిని అందుకోకుండా నమస్కారం పెట్టాడు చినబాబు అదోలా నవ్వుతూ.

"కూర్చోండి" చెప్పిందామె.

ఇద్దరూ కూర్చున్నారు.

"మిసెస్సా? " అడిగింది విరాజితకేసి అనుమానంగా చూస్తూ.

"ఎబ్బే కాదండీ" కంగారుగా చెప్పాడు.

వెయ్యివాట్ల బల్బ్ వెలిగింది విజయభారతి ముఖంలో "నిజంగా" అడిగింది నమ్మలేనట్టు.

ఆమె అంత ఎగ్జయిటింగ్‌గా అడగటం విరాజితకు నచ్చలేదు. పైగా విచిత్రంగా అన్పించింది.

"నిజంగా" విజయభారతి అలా అడగటం ఎబ్బెట్టుగా అన్పించినా సమాధానం ఇవ్వాలి కాబట్టి చెప్పాడు చినబాబు.

విజయభారతి తన చెయిర్ని అతనిక్కాస్త దగ్గరగా లాక్కుంది. ఆపైన అతని కళ్లలోకి ఆరాధనగా చూస్తూ అడిగింది. "నా లెటర్ అందిందా? "

చినబాబు ఇబ్బందిగా విరాజితకేసి చూశాడు.

"ఎంతో ఇదిగా రాశానది. చెప్పండీ... చేరిందా? " మళ్ళీ అడిగింది.

"ఆc..." పొడిగా అన్నాడు.

"చదివారా? "

"ఆc..."

"సమాధానం ఇవ్వలేదేం? "

చినబాబు ఏదో అనబోతున్నంతలో హరేరామ్, పారిజాతం లోపలికొచ్చారు. "ఎవరూ రాలేదురా"

"వెధవలు... కనుక్కోలేక పోయుంటారు" రిలాక్సింగ్‌గా చూశాడు చినబాబు.

"ఇక చెప్పు విషయం" సావధానంగా కూర్చున్నాడు హరేరామ్.

"ఈమె మా చెల్లెలన్నయ్యా. పేరు విజయభారతి. అందరూ నేరేళ్ల అంటారు. రచయిత్రిలెండి. దానికి కథల పిచ్చీ... నాకు పాటల పిచ్చీ" నవ్వింది పారిజాతం.

"ఆయన్నాకు ఇంతకుముందే తెలుసక్కా. ఓనెల కిందట పెళ్లిచూపులు జరిగాయి నాకు. గుర్తుందా? " అడిగింది పారిజాతాన్ని విజయభారతి.

"ఎందుకు గుర్తులేదూ, అప్పుడు జ్వరంగా వుండి నేను రాలేకపోయాకదా!" చెప్పింది పారిజాతం.

"ఆ పెళ్లి చూపుల కొచ్చింది ఈయనే"

"హర్రే" ఆశ్చర్యపోయింది పారిజాతం అదేదో ఎనిమిదో వింతన్నట్టు.

"అదా సంగతి! ఈ ఘోటక బ్రహ్మచారి జీవితంలో పెళ్లి చూపుల ప్రహసనాలు వున్నాయన్నమాట" అనుకుంది విరాజిత.

"అమ్మయ్యా పరిచయాలైనయ్‌కదూ! లేడీస్ ఫస్ట్‌గదా అని వూరుకున్నా. ఇక నా సందేహాలు తీర్చుకోనీ" హరేరామ్ భార్యా మరదళ్లతో అని "ఇకనైనా చెప్పవోయ్" అడిగాడు చినబాబును.

"చెప్పాకదరా ఒక అమ్మాయి గురించి నీకు... ఆ అమ్మాయే ఈ అమ్మాయి" అంటూ మొదలెట్టి విషయమంతా చెప్పాడు.

విజయభారతి చెవులు రిక్కించి అంతా విని "ఫెంటాస్టిక్... ఈ అమ్మాయి జీవితాన్ని నవలగా రాసేస్తా" ఆనందంగా అంది.

హరేరామ్ ఓ పదినిముషాలపాటు కిచెన్‌లో కెళ్లిపోయి లోపల గుంభనంగా ఏదో చేసేసి మళ్లీ వచ్చి కూర్చున్నాడు. తరువాత పారిజాతం వెళ్లి కాఫీ కప్పులు ట్రేలో పెట్టుకుని వచ్చి అందరికీ ఇచ్చింది.

"కాఫీ రుచిగా వుంది" చినబాబు హరేరామ్‌తో కావాలనే అన్నాడు.

భార్య అందించిన కాఫీ కప్పును దర్జాగా పట్టుకుని సిప్ చేయబోతున్న హరేరామ్‌కి పొలమారింది. ఇబ్బందిగా విరాజితకేసి చూశాడుగాని విరాజిత ఇవేవీ గమనించే స్థితిలో లేదు.

విజయభారతినే పరీక్షగా చూస్తోంది. విజయభారతి కూడా విరాజితను తినేసేలా చూస్తోంది.

పారిజాతం విజయభారతి చెవిలో ఏదో అంది. ఆమె సిగ్గుపడి పారిజాతం చెవిలో తనూ ఏదో అంది.

పారిజాతం క్షణం తటపటాయించి హరేరామ్ చెవి కొరికింది.

హరేరామ్ చెవిని బరబర గోక్కుంటూ చినబాబుకేసి చూసి 'ఇహి' అన్నాడు.

"పారిజాతం ఈసారి కాస్త గట్టిగానే అంది, "ఇహి ఏమిటండీ... అడగమంటుంటే"

హరేరామ్ విరాజితకేసి భయంగా చూస్తూ అడిగాడు చినబాబును " మా విజయభారతి విషయం ఏంచేశావ్? అహం... నీకు పెళ్లంటే గిట్టదని నాకు తెలుసనుకో. అయినా ఆడవాళ్లు అడగమంటున్నారు కదా! ఏ పుట్టలో ఏ పాముందోననీ..." అంటూ ముగించాడు.

చినబాబు ఏదో చెప్పబోయేంతలో విరాజిత ఠకీమని చెప్పింది, " ఆయన పెళ్లి చేసుకోరండీ, ఘోటక బ్రహ్మచారి మీరలాంటి ఆశలేవీ పెట్టుకోవద్దు"

విజయభారతి చివ్వున తలెత్తి మిన్నాగులా చూసింది విరాజితకేసి.

★ ★ ★

చినబాబూ విరాజితా ఇంటికి చేరేసరికి పదిన్నర దాటింది. చంద్రకాంతమ్మ ఏమనుకుంటుందోనని భయపడుతూ చినబాబు వెనకే లోపలికి అడుగుపెట్టిన విరాజిత... సోఫాలో కూర్చుని వున్న శేషాద్రినీ... ఆయన పక్కనే వున్న మరో అపరిచిత స్త్రీని చూసి సందేహంగా ఆగిపోయింది.

"దామ్మా... దా... ఈమె మా రెండో అమ్మాయి శోభ" శేషాద్రి విరాజితతో చెప్పాడు.

విరాజిత సమస్తే అందిగాని... శోభ ప్రతి నమస్కారం చెయ్యలేదు. కాస్త సర్దుక్కూర్చుందంతే.

"శోభా, నీకు చెప్పానే విరాజిత అని... ఈ అమ్మాయే"

"ఆఁ... ఆఁ..." అంటూ శోభ విరాజిత చేతిలోని పేకెట్టుకేసీ... చినబాబుకేసి మార్చి మార్చి చూస్తూ తలూపింది.

చినబాబు తండ్రినీ... అక్కనీ పరామర్శిస్తుండగా విరాజిత చేతిలోని పేకెట్‌ని అక్కడే వున్న టీపాయ్ మీదపెట్టి గబగబ చంద్రకాంతమ్మ గదిలోకెళ్లింది.

"ఏమ్మా... ఇంతాలశ్యమైంది? "

"సినిమా కెళ్లారేమో" వెనకే వచ్చిన శోభ నవ్వుతూ అంది.

"ఛ... అదేంకాదండీ. అమ్మగారికిలావుంటే సినిమాకెలా వెళతాం? "

"మరి? " అంది నవ్వడం ఆపి.

విరాజిత చంద్రకాంతమ్మవైపు తిరిగి అంది, "మా మామయ్య, నాగరాజు ఫాలో అవుతుంటే ఆయన వాళ్లకి టోకరా ఇచ్చి.. ఎవరో ఫ్రెండింటికి తీసుకెళ్లారు. ఎందుకైనా మంచిదని అక్కడో అరగంట గడిపి బయలుదేరాం. అసలు చీరెలు కొనేసరికి దాదాపు తొమ్మిదయింది. తరవాతే ఈ గొడవ. దాంతో లేటయింది. అన్నం పెట్టేదాండీ" ఆప్యాయంగా అడిగింది.

"నేపెట్టాలెండి పెద్దావిడ ఇంతసేపెలా వుంటుంది" శోభ అన్నది.

"మీరటు వెళ్లగానే వీళ్లిటు దిగారమ్మా. వీళ్ల భోజనం కూడా అయిందిగానీ... నువ్వూ అబ్బాయి తినెయ్యండిక. బాగా పొద్దుపోయింది"

విరాజిత తలూపి వెళ్లిపోతుంటే... వెనకే శోభ అంది చంద్రకాంతమ్మతో "చీరెలెవ




రికీ? "

"ఆ పిల్లకేనే. పాపం కట్టుబట్టలతో వస్తే నేనే ఇప్పించమన్నాను"

"మరీ నాలుగా? " సణిగింది శోభ.

"రెండిప్పించమన్నానే. పోన్లే కట్టుకుం టుంది"

విరాజితకు ఆ మాటలు వినబడుతూనే వున్నాయి. కిచెన్‌లో కెళ్లబోయిందల్లా తిరిగి వచ్చి.. టీపాయ్ మీద పెట్టిన పేకెట్ విప్పి... ఎరుపు రంగు జరీ బోర్డర్ వున్న నల్లటి చీర తీసి శోభకివ్వబోతూ అంది స్నేహంగా "మీరు తెల్లటి తెలుపు. ఇది మీరు తీసుకోండి. చక్కగా నప్పుతుంది"

"నలుపు నాకు అచ్చిరాదు. అయినా నాకు చీరెలెందుకు? మా ఆయన కొన్న చీరలకే బీరువా పట్టటం లేదు" నిర్లక్ష్యంగా అంది శోభ.

ఎందుకామె జోలికి వెళ్లానా అనుకుంది విరాజిత. మౌనంగా వెళ్లి... డైనింగ్‌టేబుల్ మీద రెండు ప్లేట్లూ పెట్టి అన్నం వడ్డిం చింది. వడ్డిస్తుండగానే వచ్చి కూర్చున్నాడు చినబాబు. రోజూ అతనితోపాటు భోజనా నికి కూర్చోదు విరాజిత. కానీ ఈ రోజెం దుకో విజయభారతి, శోభా వీళ్లంతా గుర్తు కొచ్చి ఉక్రోషంగా అన్పించింది.

కావాలని అతనితోపాటు కూర్చుని భోజనం చేయసాగింది.

ఈ మార్పును చినబాబు గమనించాడు గాని కామెంట్ చెయ్యలేదు.

వాళ్లు తింటుండగా రెండుసార్లు పను న్నట్టు ఆ గదిలోకొచ్చి వెళ్లింది శోభ.

మూడోసారి వచ్చి.. చినబాబు పక్కనే చెయిర్లో కూర్చుంది. కూర్చుని అదీ ఇదీ... వద్దంటున్నా వడ్డించసాగిందతనికి. విరాజి తను పట్టించుకోకుండా అసలామె ఉనికే గుర్తించనట్టు చినబాబుతో హస్కేసుక్కూ ర్చుంది.

"రేయ్ చిన్నా! రేపు ఆఫీసునుంచి త్వరగా వచ్చెయ్ బజారుకెళ్దాం. పట్టుచీరె కొనిపె ట్టాలి నాకు" గారంగా అడిగింది.

ఇప్పుడేగా చీరల అవసరమే లేదంది. నవ్వుకుంది విరాజిత.

"అలాగే. పండగరోజుకి బావగారొస్తా రుగా. ఆయన క్కూడా తీసుకుందాం" చెప్పాడు చినబాబు.

"ఆయన రాడు. వచ్చినా అతనికేం అక్క ర్లేదు. ఆ డబ్బు కూడా కలిపి నాకు ఖరీదైన చీరె కొను" ఖచ్చితంగా చెప్పింది.

"టూ పొసెసివ్" ప్లేట్స్ తీస్తూ అను కుంది విరాజిత.

ఆ రాత్రి సోఫాలో పడుకున్న విరాజితకు తల్లి గదిలోనే పడుకున్న శోభ స్వరం స్పష్టంగా వినపడింది.

"అమ్మా... ఈవిడగారి పెళ్లీ... పారిపో వడం... ఎవరో ఈవిడ్ని వేటాడ్డం ఇదంతా ఓ స్టంటులా వుంది. ఎందుకైనా మంచిది, ఈ మనిషినో కంట కనిపెట్టాలి"

"నోర్ముయ్యవే ఆ పిల్లనలాగన్నావంటే కళ్లు పోతాయ్. దేవతలా వచ్చిందీ ఇంటికి. ఎవరూ లేని సమయంలో నన్నెంత బాగా చూసుకుంటోందనీ. ఎందుకూ వున్నారు మీరంతా!"

చంద్రకాంతమ్మ కూతురికిచ్చిన సమా ధానం విని విరాజిత తృప్తిగా కళ్లు మూసు కుని పడుకుంది.



"వానమబ్బులా వచ్చాను నీ హృదయాకా శంలోకి. ఏ గాలి తాకిడికో కురిసి వెలసిపో తాను. ఆనవాలైనా మిగలకుండా"

నిద్రలేవగానే డైరీ తెరిచాడు చినబాబు. తెరవగానే కనబడ్డ వాక్యాలివి. రాత్రి బజా రుకెళ్లి రావటం. దార్లో నాగరాజుతో రిస్క్ ఫేస్ చెయ్యటం. విజయభారతి అనుకో కుండా తటస్థపడటం ఇంటికొచ్చేసరికి తండ్రీ అక్కయ్యా వచ్చి వుండటం. వీటన్నిటి దృష్ట్యా ఆలస్యంగా పడుకోవటంతో చినబా బుకు తెల్లగా తెల్లవారేవరకూ మెలుకువ



అనేదే రాలేదు. 'విరాజిత రాత్రి ఎప్పట్లా తన గదిలోకి వచ్చివుంటుందా' అని ఆలోచిస్తూ... డైరీ ఆత్రంగా చదివితే అలా రాసి వుంది.

చినబాబు మనసు చేదుగా అయింది. ఎందుకో ఆమె అలా రాయటం రుచించలేదతనికి.

"నిద్రలో రాసిన రాతలకి అర్థమేముందిలే" అని సరిపెట్టుకున్నాడు. అయినా మనసు మొరాయించింది. విరాజిత దేనికో బాధపడుతోందన్పించింది.

ఆ రాత ప్రభావం ఆమె ముఖంలో కనబడుతుందేమో చూడాలనుకున్నాడు.

లేచి బాత్‌రూమ్‌లోకెళ్లబోతూ పనున్నట్టు కిచెన్‌లోకెళ్లాడు.

విరాజిత ఎప్పట్లా మామూలుగానే వుంది. ఆమె ముఖంలో ఏ విచారమూ కనబడలేదతనికి. పైగా చినబాబును చూసి స్నేహంగా నవ్వింది. "స్నానం చేసి రండి. కాఫీ ఇస్తాను" అంది.

"శోభక్కేదీ?" ఏదో ఒకటి అడగాలి కాబట్టి అడిగాడు.

"ఇంకా లేచినట్టు లేదు" చెప్పిందామె.

ఎవరో పరాయిపిల్ల లేచి ఇంట్లో పని చక్కబెడుతుంటే ఇంటి మనిషి అయ్యుండీ శోభ లేవకపోవడం చిరాకన్పించిందతనికి.

"ఎలా వేగుతున్నాడో బావ అక్కతో" అనుకుంటూ బాత్‌రూమ్ కెళ్లాడు.

బ్రష్ చేసుకోబోతూ అలవాటుగా బ్రష్ కోసం చూశాడు. తన బ్రెష్ వుండాల్సిన స్థానంలో నాలుగైదు వేపపుల్లలు దర్శనమిచ్చాయి. పేస్ట్ ఎక్కడా కనబడలేదు. చివరికి సోప్ కూడా.

మూసిన బాత్‌రూమ్ తలుపు తీసుకుని ఇవతలికొచ్చాడు. కిచెన్ గుమ్మంలో నిలబడి విరాజితను అడిగాడు.

"బాత్‌రూమ్‌లో నా బ్రష్షూ, పేస్టూ, సోపూ ఏమీ కనబడ్డంలేదే? "

అటుతిరిగి పనిచేసుకుంటున్న విరాజిత ఇటు తిరిగింది.

"నిన్నటివరకూ తెలీక తప్పు చేశానండీ. ఈరోజు అన్నీ అమర్చిపెట్టాను సాంప్రదాయబద్ధంగా"

"ఏమిటీ అమర్చేది? " అయోమయంగా అడిగాడు.

"మీరు బ్రహ్మచర్యం పాటిస్తున్నారుకదండీ" అడిగింది.

"అవును" ఆ విషయం ఇప్పుడెందుకో అర్థం కాలేదతనికి.

"మీరు ఘోటక బ్రహ్మచారిగానే మిగిలిపోదల్చుకున్నారు కదండీ"

"అవును"

"పెళ్లి చేసుకోనే చేసుకోరుగా"

"అవును"

"మీరు మహాభారతం చదివారా? "

"లేదు"

"అందుకేనండీ మీరిన్నాళ్లూ పొరపాటు చేశారు. ఇకమీదట అలా జరక్కుండా చూసే బాధ్యత నాది. అందుకే ఈ ఏర్పాటు"

"ఏ ఏర్పాటు? "

"ఓహో... మీకు విషయం అర్థం కాలేదు కదూ! సారీ. మహాభారతంలో ఘోటక బ్రహ్మచారి పాటించాల్సిన కొన్ని సూత్రాలు ఉదహరించబడివున్నాయి. అందులో ఒకటి "బ్రహ్మచారి పరిమళ ద్రవ్యాల్ని ఉపయోగించకూడదూ" అన్నది. అందుకే ఆ మేన్ మేడ్ సింథటిక్ వస్తువులన్నీ తీసేసి దంత ధావనం కోసం ప్రకృతి సిద్ధమైన వేపపుల్లలూ, ఒళ్లు రుద్దుకోవడానికి మంచి నాణ్యమైన కొబ్బరి పీచూ పెట్టాను. నియమమంటే నియమమే పాటించక తప్పదు"

అతనికలా చెప్పి ఆమె తనపనిలో మునిగిపోయింది. చినబాబు ఓ పది క్షణాలు పాటు అలాగే రాటలా నిలబడిపోయి తరువాత ఓ నిర్ణయానికొచ్చినవాడిలా బాత్‌రూమ్‌లోకెళ్ళాడు. వేపపుల్లతో కష్టపడి పళ్లు తోముకుని కొబ్బరి పీచుని ఓసారి ముట్టుకు చూసి భయపడి దాన్ని ఉపయోగించకుండానే స్నానం ముగించివచ్చాడు.

"స్నానం చేసినట్టే లేదేమిట్రా ముఖం. అదేమిటి జిడ్డోడుతోంది" అప్పుడే లేచిన శోభ అడిగింది.

చినబాబు సమాధానం ఇవ్వలేదు. విరాజిత అందరికీ ఘుమఘుమలాడే ఫిల్టర్ కాఫీ అందించి చినబాబుకు మాత్రం ఓ కప్పు పాలందించింది.

అందరూ టిఫిన్‌కి కూర్చున్నప్పుడు ఎవరికిష్టమొచ్చినంత వాళ్లు తినడం ఆ ఇంట్లో అలవాటు.

ఆరోజు మాత్రం చినబాబు ప్లేట్లో రెండు ఇడ్లీలు మాత్రమే పెట్టి, "రెండో నియమం ఇది. బ్రహ్మచారులు మితంగా భోజనం చేయాలి" అతనికి మాత్రమే వినబడేలా చెప్పింది.

ఆ రెండు ఇడ్లీలే తిని లేస్తున్న కొడుకు వంక ఆశ్చర్యంగా చూస్తూ, "కొబ్బరి చట్నీ పక్కనుంటే డజను ఇడ్లీలు అవలీలగా లాగించే నువ్వు రెండు తిని లేవటమేమిట్రా" అన్నాడు శేషాద్రి.

"ఆకల్లేదు నాన్నా" ముఖంలో ఏ భావం




కనబడనీకుండా చెప్పాడు.

అతను వాష్‌బేసిన్ దగ్గర చేతులు కడుగుతుంటే వెనకే వెళ్ళి అంది విరాజిత, "బ్రహ్మచారి అబద్ధాలాడకూడదు. సత్యావాక్పాలన అతని విధి. నాన్నగారికి నిజం చెప్పెయ్యండి"

"ఇప్పుడు టైంలేదు సాయంత్రం వచ్చి తీరిగ్గా చెబుతాలే" పళ్లు కొరకబోయి బాగోదని ఆగిపోయాడు.

డ్రెస్సింగ్ టేబుల్ ఎదురుగా నిలబడి... పౌడర్ రాసుకోబోతుంటే హడావుడిగా వచ్చి పౌడర్ టిన్ లాగేసింది విరాజిత. "ఇదీ పరిమళద్రవ్యమే. పైన మరో సూక్తి ఏమిటంటే సౌందర్యం కోసం అలంకరణతో స్నేహం చెయ్యకూడదు"

ఇందాకైతే ఎలాగో పళ్లు కొరక్కుండా తమాయించుకున్నాడుగాని ఈసారి ఆగలేకపోయాడు. పటపటమని కొరికేశాడు. అది గమనించిన విరాజిత నొచ్చుకుంది, "బ్రహ్మచారులకు కోపం తగదు. ఉదయం సాయం సంధ్యవేళల్లో శాంతిమంత్రాన్ని గానం చెయ్యాలి"

"గానం చెయ్యడానికి నా గాత్రం బాగుండదులెండి" కసిగా అని స్కూటర్ గుడ్డతో శుభ్రం చేసుకోసాగాడు.

"ఉదయమే తుడిచి పెట్టానండీ" చెప్పిందామె.

గుడ్డ అవతలికి విసిరేసి స్కూటర్ స్టార్ట్ చేశాడు.

"చిన్నా... సాయంత్రం బజారుకెళ్లే విషయం మర్చిపోకు. పట్టుచీరె కొనిస్తానన్నావ్‌గా" ఇడ్లీ తింటున్న శోభ హడావుడిగా అరిచింది డైనింగ్ హాల్లోంచే.

ఆమెకు సమాధానం ఇవ్వకుండానే వెళ్ళిపోయాడు చినబాబు.

శోభకు అవమానంగా అన్పించింది. "నా ఖర్మ. అటు అత్తింట్లో ఇటు పుట్టింట్లో ఎక్కడా గౌరవం లేదు నాకు. అసలు నేను పుట్టకపోయినా బాగుండేది" అంది.

"అయ్యో... వాడికి వినపడి వుండదులేవే ఆ స్కూటర్ రొదలో సాయంత్రం వస్తాడుగా. రెడీ అయ్యుండు. అలాగే వెళుదువుగాని..." చెప్పింది చంద్రకాంతమ్మ తన గదిలోంచి మంచంమీద దిండ్లకానుకుని కూర్చుని ఇడ్లీ తింటూ.

"ఏం... వినబడుతుందీ మనమాట! వెనక వెనకే తిరుగుతూ... గుసగుస లాడుతుంటే" శోభ తల్లికి వినబడేలా అరిచింది.

ఆ విసురు ఎవరిమీదో విరాజితకు తెలుసు. అయినా బాధ పడలేదు. ఒక్క చూపుతోనే శోభ మెంటాలిటీ కనిపెట్టేసిన విరాజితకు... ఆమె మాటలు నవ్వు తెప్పిస్తున్నాయిగాని... మరో భావం కలిగించటంలేదు.

శోభ... అదీ ఇదీ సణుగుతూనే నీట్‌గా రెడీ అయిపోయింది. తల్లి దగ్గరకెళ్లి చెప్పింది. "నేను రాజ్యం ఇంటికెళుతున్నా మధ్యాహ్నం మేట్నీ చూసుకుని సాయంత్రానికి ఇంటికి వస్తా... వచ్చాక చిన్నాతో వెళ్లి చీరె తెచ్చుకుంటా"

రాజ్యమంటే శోభ ఫ్రెండ్. ఇద్దరూ క్లాస్‌మేట్స్. పెళ్లిళ్లయినా ఫ్రెండ్‌షిప్ మాత్రం మెయిన్‌టెయిన్ చేస్తూనే వున్నారు. రాజ్యాన్ని వున్న వూర్లోనే ఇచ్చారు. శోభ పరాయి వూరెళ్లినా... పుట్టింటికి వచ్చినప్పుడల్లా రాజ్యం దగ్గర ఓ రోజైనా గడుపుతుంది.

శోభ చెప్పులేసుకొని వెళ్ళిపోయింది హేండ్‌బ్యాగ్ వూపుకుంటూ.

"చూశావటమ్మా! ఇదీ వరస. అక్కడ మొగుడితో దెబ్బలాడి వచ్చింది! ఆ బాధే లేదు. పోనీ నాకు బాగాలేదు కదా ఇంటిపట్టున వుండి కాస్త నన్ను చూసుకోవచ్చుగా. ఏం బిడ్డలో తల్లీ... నువ్వు నయం పరాయి అమ్మ కన్నదానివైనా"

"నేను మీకు తోడుండబట్టే ఆవిడలా వెళ్లారండి. లేకుంటే ఖచ్చితంగా మీ దగ్గరే వుండేవారు" చంద్రకాంతమ్మకు సర్దిచెప్పింది విరాజిత

"ఏమిటోలేమ్మా... వీళ్లందర్నీ చూసే చిన్నాడలా మారిపోయాడు. ఈ పెళ్ళిళ్ళూ... ఈ గొడవలూ... చూసి చూసి వాడి మనసు దెబ్బతిన్నది. పెళ్లే వద్దని భీష్మించుకున్నాడు. చివరికి వాడి జీవితం భగవంతుడు ఏంచెయ్యదలుచుకున్నాడో"

"అబ్బబ్బ... నీ సోదేమిటి కాంతం! ఆ అమ్మాయిని ప్రశాంతంగా వుండనీ" శేషాద్రి విసుక్కున్నాడు.

వుండనీక నేనేం చేస్తున్నానండీ. అసలు మీ వల్లే మన సంతానం ఇలా మారిపోయింది. మీ మెత్తదనం చూసే నన్నందరూ ఆడిస్తున్నారు. కోడళ్లకు అత్తనన్న గౌరవం లేదు. కొడుకులకూ కూతుళ్లకు అమ్మనన్న గౌరవంలేదు, ప్రేమలేదు. మిమ్మల్ని కట్టుకోవడమే నా ఖర్మండీ. పెళ్ళిచూపుల్లో నేను మీకు నచ్చడం, ముహూర్తాలు పెట్టుకోవడం, నా మెళ్లో మీరు మూడుముళ్లు వెయ్యడం. ఇదంతా నా దురదృష్టం. మీరు నన్ను చేసుకోకుండుంటే ఈ వెధవలంతా పుట్టుకొచ్చేవాళ్లూ కాదు. నా బ్రతుకిలా తగలబడేదికాదు"

చంద్రకాంతమ్మ వాక్ప్రవాహం అలా సాగిపోతూనే వుంది.

"నేనలా బయటకెళ్లొస్తా... తలుపేసుకోమ్మా" విరాజితకు చెప్పి వెళ్లిపోయాడు శేషాద్రి.

విరాజిత తలుపులు మూసి వస్తుంటే "చూశావుటమ్మాయ్... ఎలా వెళ్లిపోయాడో ఆయన. అన్నీ ఈయన బుద్ధులే పిల్లలకు. నా మాటంటే ఒక్కరికీ ఖాతరులేదు"

ఆమె అలా మాట్లాడుతుండగానే కాలింగ్ బెల్ మోగింది.

విరాజిత గుండె ఝల్లుమంది. బిర్రబిగుసుకుపోయి చూసింది మూసివున్న తలుపుల వంక.

మళ్లీ మోగింది బెల్.

"ఎవరో వచ్చారల్లేవుంది చూడమ్మా" చెప్పింది చంద్రకాంతమ్మ

"మా నాగరాజు మామయ్యేమోనని భయంగా వుందండీ"

"అదీ నిజమేనమ్మాయ్ తెరవకు"

అవతలి మనిషికి విసుగొచ్చినట్టుంది. బెల్ మోగించడం మానేసి... తలుపు మీద దబదబ బాదడం మొదలెట్టాడు. దాంతోపాటూ...'నాన్నమ్మా... నాన్నమ్మా' అంటూ తారాస్థాయిలో వినబడింది ఓ స్వరం.

"నాన్నమ్మా అంటూ అరుస్తున్నాడండీ" చెప్పింది విరాజిత చంద్రకాంతమ్మ గదిలోకి తొంగిచూసి.

"అమ్మాయ్... మా అబ్బిగాడయ్యుంటాడు. తీసిచూడు"

అయినా విరాజితకు ధైర్యం చాలక కిటికీ రెక్క కాస్త తీసి తొంగిచూసింది.

ఓ పదేళ్ల పిల్లాడు... భుజానికి జీన్స్ బ్యాగ్ తగిలించుకుని నిలబడి వున్నాడు.

విరాజిత హాయిగా నిట్టూర్చి బోల్టు తీసింది.



**బేం**క్ కని బయలుదేరిన చినబాబు నాలుగు మలుపులు తిరిగి... మెయిన్ రోడ్డెక్కి ఓ అరకిలోమీటరు దూరం వెళ్లి... లెఫ్ట్ టర్నింగ్ తీసుకొని ఓ అడ్డరోడ్డులో ప్రవేశించి కొంచెం దూరం వెళ్లగానే ఎదురయ్యారు నాగరాజు, బలరామ్‌లు.

ఇంకొక్క మలుపు తిరిగితే చాలు బేంక్





వచ్చేస్తుంది. చినబాబు తప్పించుకోవాలని చూశాడుగాని వాళ్లు స్కూటర్‌కి అడ్డంగా నిలబడ్డంతో ఆగక తప్పలేదు.

బలరామ్ సూటిగా చినబాబు కళ్లలోకి చూస్తూ ఒక్కసారి లుంగీ విప్పి కట్టుకు న్నాడు.

అప్పుడు చూశాడు చినబాబు... బల రామ్ నీలం కలర్ నిక్కరుకి ఓ పక్కగా మొలనుంచి వేళ్లాడుతున్న కత్తి ఒరని.

మరి అందులో కత్తి వుందో లేదో అర్థం కాలేదు.

చినబాబు స్కూటర్ హేండిల్ మీద చెయ్యేసి అన్నాడు బలరామ్ ' చూశావ్‌గా'

"ఆ ఒరలో నిజంగా కత్తుందా బలరామ్ గారూ? "

"ఏం చూపించనా? " లుంగీమీద చెయ్యే శాడు

"వద్దు" కంగారుగా చెప్పాడు చినబాబు.

"నాకు కరాటే వచ్చని చెప్పినా కూడా భయంలేకుండా మాతో పరాచికాలాడ తావా? " నాగరాజు హుంకరించాడు.

"మీతో నేనేం పరాచికాలాడానండీ బాబూ. నాకవతల బేంక్‌కి టయమవు తోంది. నన్నొదిలెయ్యండి. ప్లీజ్"

"విరూపాక్షి... అంటూ మమ్మల్ని తప్పు దారి పట్టిస్తావా. నీ ఆట కట్టించడానికే వచ్చాంరా" బలరామ్ క్రూరంగా చూశాడు.

చినబాబుకేదో చప్పున గుర్తు కొచ్చింది "అర్రె... విరూపాక్షి అడ్రస్ ఇచ్చాకదూ! వెళ్ళారా? " అడిగాడు బలరామ్‌ని.

"వెళ్లాంరా స్మశానానికి" కసిగా చెప్పాడు బలరామ్.

"కరెక్ట్‌గా కనుక్కున్నారే. అక్కడే... విరూపాక్షి వుండేది. పాపం... రెండేళ్లక్రితం మిమ్మల్నే కలవరిస్తూ మంచంలోపడి తీసు కుని తీసుకునిపోయింది. అప్పటినుంచి కోర్కెలు తీరని ఆమె ఆత్మ అక్కడే మీకోసం తిరుగుతోందని అందరూ చెప్పుకుంటుంటే విని మీకా అడ్రస్ ఇచ్చా. ఇంతకీ మిమ్మల్ని గుర్తుపట్టిందా విరూపాక్షి ఆత్మ"

"రేయ్" బలరామ్ ఒక్క గుద్దు గుద్దాడు రియర్ వ్యూ మిర్రర్‌ని! ముక్కలు ముక్కలై పోయిందది.

చినబాబు ఖిన్నుడైపోయాడు. అటూ ఇటూ చూశాడు. ఆ వీధిలో పెద్ద జనసం చారం లేదు. తిరిగి కొడితే... తనని వాళ్ళు పచ్చడి చెయ్యొచ్చు అందుకే కాస్త తెలివిగా తప్పించుకోవాలని అన్నాడు. "మీ మనస్సు నొప్పించినందుకు క్షమించండి. చేతికి దెబ్బ తగిలిందా పాపం? "

బలరామ్ వికటంగా నవ్వి... ఆ వూపుకు తూలిపడబోయి నిలదొక్కుకున్నాడు. మిర్ర ర్‌ని బద్దలుచేసిన చేతిని చినబాబు కళ్ల ముందుకు చాపాడు.

అతని ముంజేతికి... సినిమాల్లో హీరోలు, విలన్లు వేసుకునే లాంటి కడియం వుంది. దాన్ని ముందుకు లాక్కుని అద్దం పగలగొట్టాడని... అందుకే అతని చేతికి గాయం కాలేదనీ అర్థమైంది చినబాబుకి.

చినబాబు ఇవన్నీ అర్థం చేసుకునేలోగా నాగరాజు చినబాబును పక్కకునెట్టి స్కూటర్ సీట్ పరపర కోసేశాడు.

"ఇదన్యాయం" చినబాబు ఏడుపు గొంతుతో అరిచేశాడు.

బలరామ్ లైట్ తుక్కుకింద పగల గొట్టి.... ఆపైన స్కూటర్‌టేంక్‌లోని పెట్రో లంతా లీక్ చేసేశాడు.

చినబాబు ఇక సహించలేకపోయాడు 'రేయ్... ఇక స్కూటర్ మీద చెయ్యేశా రంటే మర్యాద దక్కదు"

"ఇక వెయ్యం. మా టార్గెట్ ఈ మూడు పార్ట్‌లే. పాడుచేశాం. మా కక్ష తీరింది."

బలరామ్, నాగరాజు వచ్చిన దారినే వెళ్లి పోయారు.

చినబాబు స్కూటర్ని నడిపించుకుని వెళ్లి దగ్గర్లోనే వున్న ఓ మెకానికల్ షాపులో ఇచ్చేసి కాలినడకన బ్యాంక్ కెళ్లాడు.



సీట్లో కూర్చుని వర్క్ చేస్తుంటే... తలనొప్పిగా అన్పించింది. వెంటనే తను ఉదయం అలవాటుగా తాగే కాఫీకి బదులు పాలు తాగిన విషయం గుర్తుకొచ్చింది.

ప్యూన్ని పిలిచి ఓ స్ట్రాంగ్ కాఫీ తెమ్మని చెప్పాడు.

ప్యూన్ వెళ్లగానే విరాజిత ఎదురుగా నిలబడి ఫక్కుమని నవ్వినట్టనిపించింది. "ఘోటక బ్రహ్మచారి" అని వెక్కిరించినట్టు కూడా ఫీలింగ్ కలిగింది.

ప్యూన్ కాఫీ తీసుకు రాగానే చెప్పాడు.

"నాకొద్దు... నువ్ తాగెయ్"

అతను చినబాబుకేసి చిత్రంగా చూసి వెళ్లిపోయాడు.

"హు... విరాజితా... ఆ మాత్రం నియమాలు పాటించలేని బలహీనుడు కాదీ చినబాబు" మనసులోనే నవ్వుకున్నాడు.

సాయంత్రానికి తలనొప్పి మరీ ఎక్కువైంది. ఒక్కక్షణం కేంటిన్ కెళ్లి కాఫీ తాగేద్దామా అనుకుని మళ్ళీ అంతలోనే తన్ను తానే కంట్రోలు చేసుకున్నాడు.

మూలిగే నక్కమీద తాటికాయన్నట్టు... ఆరోజే మేనేజర్ హాఫ్ ఇయర్లీ స్టేట్‌మెంట్స్ రాసే పని పురమాయించాడు. "హెడేగ్గా వుంది సర్" అంటే... ఫర్లేదయ్యా... వెళ్ళు ఇంటికి ఫట్టుకెళ్ళి పూర్తిచెయ్ వర్క్. రేపు భోగి... వరసగా మూడురోజులు శెలవులు హాయిగా పనిచేసుకో" అన్నాడు. బేంక్ క్లోజింగ్ టయం అవగానే ఫైల్స్ తీసుకుని బయటకొచ్చిన చినబాబు అలవాటుగా స్కూటర్ స్టాండ్ కేసి వెళ్ళాడు.

అక్కడ స్కూటర్ లేకపోవడం చూశాక... చప్పున గుర్తుకొచ్చింది అది తను మెకానిక్‌కి ఇచ్చిన విషయం.

కాళ్ళీడ్చుకుంటూ అక్కడికెళితే, అతనింకా దాన్ని రిపేర్ చెయ్యలేదు. ఓ రిక్షా పిలిచి ఎక్కి కూర్చున్నాడు.

చినబాబు ఇంటికెళ్ళేసరికి వాకిట్లోనే తన కోసం ఎదురుచూస్తున్న అబ్బిగాడు దర్శనమిచ్చాడు.

చినబాబుకు అంత బాధలోనూ ఆనందమన్పించింది.

"ఇదేమిట్రా... పండక్కి ముందే వచ్చేశారా అందరూ" ఆశ్చర్యంగా అడిగాడు.

"నువ్వులేని పండగ ఒక పండగేనా బాబాయ్ నాకు? అందుకే అమ్మనీ, నాన్ననీ అక్కడే వదిలేసి నేనొక్కడినే నీకోసం రెక్కలు కట్టుకు వచ్చేశా"

"నిజంగా!" నమ్మలేనట్టు చూశాడు.

"పిన్ని మీదొట్టు" చెప్పాడు అబ్బిగాడు.

"పిన్నెవర్రా? " ఆశ్చర్యంగా చూశాడు చినబాబు.

"నాదగ్గర వేషాలెయ్యకు. పిన్ని నాకంతా చెప్పేసింది"

"చంపుతాను. పిన్నెవర్రా అంటుంటే"

"నాచేత పేరు చెప్పించాలనా? సరే విను... విరాజిత పేరు బాగుంది కదూ! మనిషి కూడా బాగుందిలే. నాకు నచ్చింది"

"నోర్ముయ్. పిన్నీలేదూ పిన్నీసూలేదు. ఆ అమ్మాయి..."

"నువ్వు చెప్పక్కర్లేదు... ఆ అమ్మాయి ఐ మీన్ పిన్ని ఎవరో ఏమిటో... ఇక్కడి కెలా వచ్చిందో... నాన్నమ్మ నడిగి ఎప్పుడో కూపీ లాగేశా"

"మంచి పని చేశావ్‌గాని ఆమెను పిన్నీ గిన్నీ అనకు ఏమైనా అనుకుంటుంది"

"నీకా భయం అక్కర్లేదులే. నువ్వామెను ప్రేమిస్తున్నావని ఆమెకు ఎప్పుడో తెలిసిపోయింది. అంచేత ఏమీ అనుకోదు"

చినబాబు ఫైల్స్ ఎత్తి టీపాయ్ మీద విసిరి కొట్టాడు.

"నేనామెను ప్రేమిస్తున్నానని ఎవర్రా చెప్పింది? "

"పళ్ళు కొరక్కు" అబ్బిగాడు వెంటనే అన్నాడు "నీ డైరీ చెప్పింది. అందులోని నీ కవిత్వం చెప్పింది"

చినబాబు మనసు తేలికైంది. "అదా





విషయం అది రాసింది నేను కాదులేరా. అయినా వచ్చీరాగానే నా డైరీలు అవన్నీ కలబెట్టాలా? " నిష్ఠూరంగా అన్నాడు.

"అదేంటి బాబాయ్... నా దగ్గర కూడా నీకు దాపరికాలా! నీ మనసునే చదివే నేను... నీ డైరీ చదవడంలో తప్పేముంది! పైగా నేనది నా హక్కుగా భావిస్తున్నా"

"ఏమిట్రోయ్... మాటలు మరీ ముదిరినట్టున్నాయ్"

"వయసుకూడా ముదిరిందిగా బాబాయ్. నిన్న మన బర్త్‌డే సెలబ్రేషన్ జరిగిందక్కడ. సో... పదినిండి పదకొండు! నౌ ఐ యామ్... రన్నింగ్ ఎలెవన్"

"ఓహో... నిన్న తమరి బర్త్‌డే కదూ! బాగా జరిగిందా" అడిగాడు చినబాబు.

"కనీసం గ్రీటింగన్నా పంపకూడదూ! అయినా ఎందుకు పంపుతావ్‌లే... ప్రేమ వ్యవహారంలో తలమునకలైన వాడికి మేమేం గుర్తుంటాం"

"మళ్ళీ మొదలెట్టావా! ఆ డైరీలో పైత్యం నాదికాదు"

"పిన్ని కూడా చదివి... నువ్వే రాశావన్నదే"

"అలా చెప్పిందా ఆవిడ ఏదీ ఎక్కడుంది? "

"రేపు భోగి కదా! లడ్డూలు చేస్తోంది వంటింట్లో"

చినబాబు లేచి చంద్రకాంతమ్మ గదిలోకెళ్లాడు.

"ఎందుకమ్మా... అవన్నీ ఆ అమ్మాయి చేత చెయ్యించడం. వద్దని చెప్పలేకపోయావా? " నొచ్చుకుంటూ అన్నాడు.

"అయ్యో! నేను వద్దనే చెప్పాన్రా. అబ్బిగాడ్ని చూసి... ముచ్చటపడి చేస్తోంది. ఈ భడవ చూశావట్రా. ఒక్కడే బస్సెక్కి వచ్చేశాడు నీకోసం"

"ఇంతకీ అన్నయ్యకి చెప్పే వచ్చుంటాడా? "

"స్వయంగా మా నాన్నగారే బస్సెక్కించారు బాబాయ్ నాపోరు పడలేక" వెనుక నుంచి వచ్చిన అబ్బిగాడు చెప్పాడు.

"శోభేది? "

చినబాబు అడుగుతుండగానే వచ్చేసింది శోభ.

"రాజ్యం ఇంటికెళ్లాలేరా చిన్నా. ఇద్దరం ప్రేమదేశం సినిమాకెళ్లి వస్తున్నాం. క్షణంలో వచ్చేస్తా... కాఫీ తాగి! నువ్వు రెడీనే కదూ!" హడావుడిగా అనేసి కిచెన్‌లోకి దూరింది.

ఒకవంక లడ్డూలు చేస్తూనే కాఫీ కాచి ఫ్లాస్క్‌లో పోసి వుంచింది విరాజిత.

శోభ వంటగదిలోకి రాగానే చెప్పింది "ఫ్లాస్క్‌లో వున్నాయండీ. మీరుతాగి... మీ బ్రదర్‌కి కూడా ఓ కప్ ఇవ్వండి"

"లడ్లు చేస్తున్నావా! వెరీగుడ్" శోభ ఓ లడ్డూ రుచి చూసి కాఫీ రెండు కప్పుల్లోకి వంచి తనోటి తీసుకుని చినబాబుకి ఒకటి ఇవ్వబోయింది.

"నేను కాఫీ తాగను. పాలుకావాలి" విరాజితకు వినపడేలా చెప్పాడు.

"ఇదెప్పటి నుంచి" శోభ సణుక్కుంటూ కిచెన్‌లోకెళ్ళి సన్నగా నవ్వుకుంటున్న విరాజితను చూసి అడిగింది. "ఎందుకు నవ్వుతన్నారు? "

"ఏంలేదులెండి. అదో అక్కడున్నాయ్ పాలు... కాసిని వంచి యివ్వండి"

శోభ ఇచ్చిన పాలు తాగి కప్పు పక్కన పెట్టాడు చినబాబు.

"ఇక వెళ్దామా" అడిగింది శోభ.

"రేపెళ్దామా? కాస్త తలనొప్పిగా..."

అతని మాటలు పూర్తికాకముందే పెద్దగా అరిచేసింది శోభ "తెల్లవారితే పండగ. రేపేమిటి నువ్ కానిచ్చేది!"

వెంటనే లేచి చెప్పులేసుకున్నాడు.



"అబ్బిగాడికలా ఎందుకు చెప్పారు? "

అందరూ పడుకున్న తర్వాత... చివరిగా పనులన్నీ చేసుకుని వచ్చి పడుకోబోతున్న

విరాజితను అడిగాడు చినబాబు.

"ఎలా చెప్పాను?" ఆమె భృకుటి ముడి వడింది.

"డైరీలో రాసిన రాతలు నావనీ పైగా అవి మిమ్మల్ని ఉద్దేశించి రాసినవనీ"

"నిద్ర లేపండి. మీ అబ్బిగాడ్ని... అడుగుదాం... నేనలా అన్నానేమో? !" ఆవేశంగా అంది.

"ష్... మెల్లగా. ఎవరైనా వింటారు" భయపడిపోయాడు.

"వింటే విన్నివ్వండి. నాకేం· నాపనులేవో నే చేసుకుంటుంటే... అనవసరంగా మీ అబ్బిగాడే... మీ డైరీ తీసుకొచ్చి బలవంతంగా నాచేత చదివించాడు. ఇలారాసే అలవాటు మా బాబాయ్‌కి లేదే... ఎవరు రాసి వుంటారు అని అడిగాడు. నాకూ తెలీదన్నాను. కాకపోతే వూరికే విసిగిస్తుంటే... మీ బాబాయ్ డైరీలో మీ బాబాయ్ కాక ఇంకెవరు రాస్తారూ... ఒకవేళ హేండ్ రైటింగ్ కావాలని మార్చిరాశారేమో... నీకు చిక్కకుండా వుండటానికి, అని జోక్ చేశానంతే. అయినా ఓ మాటడుగుతాను. నిజం చెప్పండి" అంది.

ఏమిటన్నట్టు చూశాడు.

"ఓ వంక... బ్రహ్మచారినని చెబుతూ అవ్వ! అవేం రాతలండీ. డేట్స్ చూస్తే అది నేను మీ యింటి కొచ్చాక రాసిన పేజీలేనని తెలుస్తోంది. కొంపదీసి అవి రాసింది నన్ను ఉద్దేశించి కాదు కదా! ఈ అనుమానం నాకు రాలేదు. మీ అబ్బిగాడికే వచ్చింది"

చినబాబుకు ఎన్నడూ రానంత కోపం వచ్చింది. అర్ధరాత్రుళ్ళు మోహినీ పిశాచంలా లేచివచ్చి.. తన్ను ముద్దులు పెట్టుకుని... కౌగలించుకునీ... తన డైరీ అంతా గిలికింది కాక... అవి తనే రాశానంటుందా! ఇంత అన్యాయం ఎక్కడైనా వుంటుందా? చెబితే నమ్మటం లేదూ... బాధపడుతుందీ... ఏదో నిద్రలో నడిచే అలవాటేమోలే... అని తను సరిపెట్టుకుంటుంటే ఇంత అభాండం వేస్తుందా నాపైన!

ఓర్చుకోలేక పోయాడు చినబాబు. "విరాజితగారు! ఇక దాచి లాభంలేదు. నిజం చెప్తున్నా వినండి. నా డైరీలో రోజూ అలా రాసేది మీరే... మీకు నిద్రలో నడిచే అలవాటుంది. ప్రతిరోజూ... నా గదిలోకొచ్చి నా టేబుల్ సొరుగు లాగి నాడైరీ తీసీ...."

"ఆపండి" పళ్ళు బిగువున అరిచేసింది.

"హు.... బ్రహ్మచారట బ్రహ్మచారి! బ్రహ్మచారి అయినవాడు ఇతరులను గాయపరిచే వాక్కులు పలుకరాదు అన్న సూక్తిని పాటించి తీరాలి. మీ మాటల ఈటెలతో నా గుండెను ఇంత గాయం చేసిన మీరేం బ్రహ్మచారండీ. కనీసం 'స్త్రీతో ప్రసంగించకూడదూ అనే నిబంధనైనా తెలుసా మీకు! ఇక మాట్లాడకండి నాతో. రేపే వెళ్లిపోతాను. ఇంతనిందపడ్డాక... ఈ యింట్లో వుండే బదులు... ఏట్లో దూకి చావడం మేలు"

"విరాజితగారూ.... ప్లీజ్..."

"స్త్రీతో ప్రసంగించకూడదని చెప్పానా. వెళ్ళండి కనీసం ఇదైనా పాటించండి"

ఆమె అతని సమాధానంకోసం ఎదురు చూడకుండా కాళ్ళనుంచి ముఖంవరకూ దుప్పటి తన్నిపెట్టి పడుకుంది.

మ్లానమైన ముఖంతో చినబాబు దీనంగా తనగదిలోకి వెళ్లి... తన బెడ్ మీద వెల్లకిలా పడుకుని, గాఢ నిద్రపోతున్న అబ్బిగాడి పక్కనే కాస్త సందుచేసుకుని పడుకున్నాడు.

మళ్లీలేచి గది తలుపులు మూసి బోల్ట్ పెట్టి "ఇకరా ఈరోజు నా గదిలోకి ఎలా వస్తావో నేనూ చూస్తా" కసిగా అనుకున్నాడు. ముసుగు తన్ని పడుకున్న విరాజితకేసి కిటికీలోంచి చూస్తూ

★ ★ ★





తెల్లవారుఝామున నాలుగ్గంటలప్పుడు అబ్బిగాడు తట్టి లేపుతుంటే విసుగ్గా కళ్ళు విప్పాడు చినబాబు.

"ఎందుకురా లేపుతున్నావ్... పడుకో..."

"ఏంటి బాబాయ్ మరీ నువ్వు. ఈ రోజేంటి? భోగి పండుగ లే... భోగిమంటొద్దా"

"ఈవేళ్టికి నువ్వేసుకోరా రేపు నేను వేస్తాలే" మళ్లీ నిద్రకుపక్రమిస్తూ చెప్పాడు.

"ఏమిటేమిటి భోగి రెండుసార్లు వస్తుందా? లాభంలేదు. నువ్ పూర్తిగా ప్రేమలో మునిగిపోయావ్" చెప్పాడు అబ్బిగాడు.

ఆ మాటతో చివుక్కున లేచి కూర్చున్నాడు చినబాబు "ఏమిట్రా వాగుతున్నావ్? "

"పండగ పూట తిట్టకు బాబాయ్. పరధ్యానంగా మాట్లాడుతుంటే అదేనేమో అనుకున్నా అయినా ప్రియమైన అమ్మనీ... నాన్ననీ... ముద్దుల తాతయ్యనీ... మురిపాల అమ్మమ్మనీ వదిలి.. నీకోసం వచ్చానే! నా అభిమానానికి ప్రతిఫలం అవమానమా? "

చినబాబుకి నిజమే అన్పించింది. పిల్లలు పండగలకెంత ప్రాధాన్యతనిస్తారో తనకు తెలీంది కాదు. పండగ సంబరమంతా తమదే అన్నట్టు భావించే పిల్లల్ని నిరాశపరచకూడదు.

అలా అనుకున్నదే తడవుగా హుషారుగా లేచేశాడు చినబాబు. "పదరా... మనవీధిలో అందరికంటే పెద్దమంట మన్దే"

అబ్బిగాడు పట్టపగ్గాలు లేనట్టు పరుగెత్తాడు బయటకు.

చినబాబు లేచి గదిలోంచి రాబోతూ అలవాటుగా టేబుల్‌వైపు చూశాడు. సొరుగులో వుండాల్సిన డైరీ టేబుల్‌మీద దర్శనమిచ్చింది.

అనుమానంగా వెళ్లి తెరిచాడు.

"నా మనసును నీ మునివేళ్లతో అలవోకగా తాకావు. అది పులకరించి ప్రియరాగాలు పాడేవేళ... నాగుండెల మీంచి నిర్దాక్షిణ్యంగా నడిచి వెళ్లాలని చూస్తున్నావు. పాపం కదూ!"

చినబాబుకు కోపం రాలేదు.

అప్పుడప్పుడూ అలవాటుగా స్పందించే అతని మనసు అట్టడుగు పొర కదిలింది.

అది కదిలి మళ్లీ సెట్ అయ్యాక గుర్తొచ్చింది... తను రాత్రి గది తలుపుకు బోల్ట్ పెట్టి పడుకున్న విషయం.

ఎవరూ తట్టిన గుర్తుగానీ... తను తీసిన గుర్తుగానీ లేదు. మరి ఆమె ఎలా వచ్చింది తన గదిలోకి.

"బాబాయ్... హరియప్" గుమ్మంలోంచి అబ్బిగాడి కేక వినబడింది.

గబగబవెళ్లి ఆసరికే అబ్బిగాడు పెట్టిన మంటలో తనూ తాటాకులు వేస్తూ ఆనందించసాగాడు చినబాబు.

మధ్యలో ఓసారి అబ్బిగాడ్ని కదిలించాడు.

అబ్బీ... రాత్రెవరైనా... మనగది తలుపులు తడితే నువ్వు గాని తీశావా? "

"అలాంటిదేం లేదే" చెప్పాడు అబ్బిగాడు. కాసేపటి తరువాత తనే అన్నాడు "బాబాయ్ ఒంటిగంటప్పుడు మాత్రం బాత్‌రూమ్ కెళ్లాల్సి వచ్చి తలుపులు తీశా. మళ్లీ వేశానో లేదో గుర్తులేదు. ఏం... ఏమైనా పోయిందా? "

"ఎబ్బే... ఏమీ పోలేదులే. వూరికే అడిగా" చెప్పాడు చినబాబు.

అతను విరాజిత కేసి అప్పుడప్పుడూ చూస్తూనే వున్నాడు ఏమైనా దొరికిపోతుందేమోనని. ఆమె ఎప్పట్లా మామూలుగానే వుంది.

"పాపం... నిజంగానే ఆమె రాసేది ఆమెకు తెలీదులావుంది. తను కాబట్టి సరిపోయింది. మరొకడైతే ఆమెను అపార్థం చేసుకుని వుండును" జాలిగా అనుకున్నాడు.





శోభ పండగనేమో కాస్త ప్లెజెంట్‌గా మాట్లాడుతూ విరాజితకు వంటలో కాస్త సాయం చేసింది.

గారెలు, పాయసం, పొంగలి, పులిహోరా ఐటమ్స్ చాలానే రెడీ అయ్యాయి. ముందు చంద్రకాంతమ్మకు పెట్టి అందరూ భోజనా లకు వరసగా నేలమీద కూర్చున్నారు. పండగరోజు సాంప్రదాయ బద్ధంగా అరిటా కుల్లో తినడం అలవాటు వాళ్ళకు.

అందరికీ ఐటమ్సన్నీ హెవీగా వడ్డించి చినబాబుకు మాత్రం... ఓ గుప్పెడు మెతు కులు.. కాస్త పప్పూ... ఒక్కగారె... ఓ స్పూన్ పులిహోర వడ్డించింది విరాజిత.

"బ్రహ్మచారులు మితంగా భుజించాలి కదూ!" గుర్తు తెచ్చుకున్నాడు చినబాబు... ఆ వడ్డన చూడగానే.

"ఏమిటో... పిల్లవాడికి ఆకలే లేకుండా పోయింది" శేషాద్రి జాలిపడ్డాడు. రేపోసారి హాస్పిటల్ కెళ్లి ఆకలికేదైనా టానిక్ కొను క్కోరా" చెప్పాడు కొడుక్కి.

"అలాగే నాన్నా" చెప్పి ఓసారి విరాజిత కేసి చూశాడు.

ఆమె అటు తిరిగి అబ్బిగాడికీ శోభకీ కొసరి కొసరి వడ్డిస్తోంది.

"ఈ తిండి తగ్గించటం ఎప్పట్నుంచి? " శోభ అడిగింది చినబాబుకేసి చూస్తూ.

సంభాషణ ఎటుపోయి ఎటు వస్తుందో నని భయపడ్డ చినబాబు చప్పున ఆమె దృష్టిని తన భోజనంమీంచి మళ్ళిస్తూ అన్నాడు "ప్చ్... బావగార్ని ఒంటరిగా వది లొచ్చావ్. పండగ పూట ఏం తింటు న్నాడో... ఎలా వున్నాడో? " అన్నాడు.

"ఆయనకేం రోగం. వాళ్లమ్మ కొసరి కొసరి తినిపించుకుంటుందిలే. అసలావిడ అతి ప్రేమతోనే కదూ ఆయన అమ్మకూ చిగా మారిందీ... పెళ్ళామంటే పడకుండా తయారయిందీను"

"ఇప్పుడు నిన్నేమన్నాడక్కయ్యా బావ? నువ్వే కదా... వేరుకాపురం. వేరుకాపురం అంటూ రెండ్రోజులకోసారి పరిగెత్తుకొస్తావ్ ఇక్కడికి! పాపం ఒక్కడే కదా తల్లిదండ్రు లకు... అతనివతలికొచ్చేస్తే... వాళ్ళు బాధ పడరూ? "

శోభ ముఖం కందగడ్డలా మారడం... ఆమె కళ్లలో నీటిపొర సన్నగా కమ్ముకో వడం... పెదవులు ఆవేశంగా వణకడం లాంటివి గమనించిన విరాజిత చప్పున అంది "మీ తప్పేం లేదండీ. చూడకపో యినా చెబుతున్నా. మీవారే ఘటికుడిలా వున్నారు. పండక్కదా... తనే వచ్చి మిమ్మల్ని పలకరించవచ్చుగా"

శోభ ముఖం ప్రసన్నంగా మారిపో యింది.

"బాగా చెప్పావ్! ఇక నువ్వూ కూర్చో ఎవ రికి వాళ్లం వడ్డించుకోవచ్చు" విరాజిత కేసి అభిమానంగా చూసింది.

చినబాబు అర్ధాకలితో లేచిపోయి బేసిన్ దగ్గర చేతులు కడుక్కుంటుంటే అతని వెనకే వెళ్లిన అబ్బిగాడు అన్నాడు "బ్రహ్మచా రులు ప్రియంగా మాట్లాడాలట లేకుంటే లేనిపోని తగాదాలొస్తాయని చెప్పమంది పిన్ని"

చినబాబు మౌనంగా తన గదిలోకెళ్ళిపో యాడు. నడుం వాల్చగానే గుర్తుకొచ్చింది ఆఫీస్ ఫైళ్ల పెండింగ్ వర్క్.

"బాప్‌రే" అనుకుంటూ చెయిర్లో కూర్చుని టేబుల్ మీదున్న ఫైల్స్‌లోంచి ఓదాన్ని ముందుకు లాక్కున్నాడు.

కాసేపు వర్క్ చేసేసరికి మళ్లీ తలనొప్పి వచ్చేసింది.

"అబ్బీ... కాస్త జండూబామ్ పట్రా" అడి గాడు.

"అబ్బిగాడు... నిద్రపోతున్నాడు" అన్చెప్పి విరాజిత బాటిల్ తెచ్చి టేబుల్ మీద పెట్టింది.

"స్త్రీతో ప్రసంగం చెయ్యగూడదని చెప్పారు. మళ్లీ మీరే మాట్లాడుతున్నారు"

గుర్తు చేశాడు.

"ప్రసంగం చెయ్యకూడదు. అవసరమైనంత మేరకు మాట్లాడవచ్చు" చెప్పిందామె.

"ఇప్పుడంత అవసరం ఏమీ లేదులెండి"

విసురుగా అని జండూబామ్ రాసుకుని మళ్లీ పనిలో మునిగిపోయాడు.

అంతకంతకూ నెప్పి ఎక్కువవుతుంటే... యాస్ప్రిన్ వేసుకున్నాడు. కాసేపటికల్లా మత్తుగా నిద్రకు జోగుతూ... అలాగే టేబుల్ మీద తల పెట్టుకుని పడుకుండిపోయాడు.

రెండుగంటల తరువాత మెలకువొచ్చి ఉలికిపాటుగా లేచి చూశాడు. "ఛ... ఏమిటిలా నిద్రపోయాడు తను! టాబ్లెట్ ప్రభావం అయివుంటుంది."

ఫైల్స్‌కోసం చూస్తే టేబుల్ మీద ఒక్కటీ లేదు. ఆశ్చర్యంగా వెనక్కు తిరిగి చూశాడు. ఆ గదిలోనే నేలమీద ఫైల్సన్నీ పరుచుకుని... దీక్షగా ఏదో రాస్తోంది విరాజిత

చినబాబు...లేచిన అలికిడికి తలెత్తి స్నేహంగా నవ్వింది.

"వర్కంతా పూర్తయినట్టే"

అతను నమ్మలేనట్టు చూశాడు "మీరు... ఈ వర్కు"

"బేంక్ టెస్ట్‌లు చాలాసార్లు రాసిన అనుభవం ప్లస్... మా పక్కింట్లో రంగనాథంగారికి... ఇలాంటి స్టేట్‌మెంట్స్ ప్రిపేర్ చేసిచ్చే అలవాటూ..." చెప్పిందామె.

"తరువాత మళ్లీ ఫైళ్లలో తలదూర్చింది మధ్యలో ఓసారి అతన్ని చూసి "మీరలా పడుకోండి. పది నిముషాల్లో అయిపోతుంది" అంది.

చినబాబు బెడ్‌మీద బోర్లా పడుకుని క్రీగంట ఆమెనే గమనిస్తున్నాడు. చకచక కదులుతున్న ఆమె వేళ్లను చూస్తుంటే ఎందుకో ముద్దాడాలన్పించిందతనికి. ఆమె వంగి రాస్తుంటే విండోపేన్ మీదపడి పరావర్తనం చెందిన నీరెండ... ఆమె కుడి చెంపమీద పడ్డంతో చెవి జూకా ధగధగలాడుతోంది. తను బ్రహ్మచారినన్న విషయం గుర్తొచ్చి ముఖం అటు తిప్పుకున్నాడు.

అయినా అతని మనోఫలకం మీంచి ఆ అద్భుతమైన సిల్‌హౌటీ చెరిగిపోవటం లేదు.

"విరాజిత... చాలామంచిదిలా వుంది. తన వదినల్లా... అన్నయ్యల్లా కాకుండా... ప్రత్యేకంగా వుంది. యస్. షి ఈజ్ డిఫరెంట్ పర్సనాలిటీ"

మొదటిసారిగా అనుకున్నాడు.

విరాజిత ఫైల్స్ రాయటం ముగించి ఎప్పుడు వెళ్లిందో మరి చేతులలో పొగలు కక్కే కాఫీ కప్పుతో వచ్చింది.

"కాఫీ తీసుకోండి"

బోర్లా పడుకుని అటు తిరిగి వున్న చినబాబు చివుక్కున లేచి కూర్చున్నాడు.

ఆమెవైపు... కాఫీ కప్పువైపు మార్చి మార్చి చూశాడు.

"మీ తలనొప్పికి కారణం ఇదే. కాఫీ తాగే ప్రాణులు అదిలేకుండా వుండలేరు" నవ్వింది.

"మీరేగా తాక్కూడదన్నారు" ఉడుక్కున్నట్టుగా చూశాడు.

"బ్రహ్మచారులు తాక్కూడదన్నాను"

"నేను బ్రహ్మచారినే"

"ఊహూ... మీ ముఖం చూస్తుంటే మీరు త్వరలో పెళ్లి చేసుకుంటారన్పిస్తోంది"

"అది జరగని పని"

"మంచిదేలెండి... ఇప్పుడీ కాఫీమాత్రం తాగండి. కాఫీ తాగికూడా పెళ్లి చేసుకోకుండా వుండొచ్చు. నేను సరదాగా చెప్పానా నియమాన్ని. పురాణకాలం నాటివి ఈకాలంలో ఎలా కుదుర్తాయి"

"మీరు సరదాగా చెప్పినా నేను సీరియస్‌గానే తీసుకుంటున్నా నేను కాఫీ తాగను గాక తాగను"

"సరే... మీయిష్టం"

విరాజిత ముఖం గంటుపెట్టుకుని వెళ్ళి





పోయింది.





తలారా స్నానంచేసి చివర్లో ముడి పెట్టుకుని ఓ మందార మొగ్గ అలవోకగా ముడిలో తురుముకుని వుంది విరాజిత.

నీళ్లోడుతున్న కురులు వీపు భాగంలోని ఆమె రవికను తడి పేస్తుంటే, అతుక్కుపోయిన పల్చని రవికలోంచి బ్రా స్ట్రాప్ ప్రొవోకింగ్‌గా కనిపిస్తుంటే...

సన్నటి నీటిపాయల్లా దూకుతున్న చీరెకుచ్చిళ్ల పసుపు రాసిన పాదాల మీద జీరాడుతుంటే. అటూ ఇటూ కదిలినపుడు వెండి పాంజేబులు ఘల్లుమంటుంటే...

ఈమేనా... రాత్రి తన గదిలోకి నడిచి వచ్చి తన క్రాఫ్ చెరిపేసి నుదుటిమీద ముద్దిచ్చింది.

ఎంత బ్రహ్మచారైనా చినబాబు గుండె ఒక్క క్షణం లయతప్పింది.

కిచెన్ గుమ్మంలో నిలబడి అలాగే తనను గుడ్లప్పగించి చూస్తున్న చినబాబును గమనించి కూడా గమనించనట్టే వుండిపోయింది విరాజిత.

ఆమె నిశ్శబ్దంగా కప్పులోకి కాఫీ పోస్తుంటే స్వర్గలోకంలో... నక్షత్రశాలలో... ఓ అప్సర నిలబడి... సువర్ణభాండంలోంచి అమృతాన్ని వంపుతున్నట్టు అన్పిస్తుంటే,

ఆమె అందించిన కాఫీని, మంత్రముగ్ధుడిలా అందుకుని గుక్కగుక్కగా తాగేస్తున్న చినబాబును చిలిపిగా చూసింది విరాజిత.

అతను ఆఖరి గుక్క తాగేసి కప్పు అందిస్తుంటే, ఫక్కుమని నవ్వేసింది.

"మీరిప్పుడు తాగింది కాఫీ"

ఉలిక్కిపడ్డాడు చినబాబు.

ఇదేమిటి? తను బ్రహ్మచారి అయ్యుండీ... నియమోల్లంఘన చేయనని, నిన్న సాయంత్రమే కోతలు కోసి ఇప్పుడిలా కాఫీ తాగాడేమిటి? తనకేమైంది?

విరాజిత కప్పు సింక్‌లో పడేసి చెప్పింది "స్త్రీ సమ్మోహనశక్తి అంటే ఇదేనండీ. అలనాడు క్షీరసాగరమథనంలో ఉద్భవించిన అమృతాన్ని. శ్రీమహావిష్ణువు దేవతలకు మాత్రమే పోస్తున్నా రాక్షసులు వెర్రి వెంగళప్పల్లా చొంగ కార్చుకుంటూ... ఆ దేవదే వుడ్నే చూస్తూ కిమ్మనకుండా ఎందుకుండిపోయారనుకున్నారు? ఆయన మోహినీ, అంటే, స్త్రీ రూపంలో వయ్యారాలు ఒలకబోస్తుండబట్టే ఇక మీరెంత?"

అప్పటికి మామూలయ్యాడు చినబాబు "అంటే, మీ వుద్దేశ్యం... నేను మిమ్మల్నీ, మీ అందాన్నీ చూస్తూ నన్ను నేనే మర్చిపోయి కాఫీ తాగాననా?"

కోపంతో జేవురించిన అతని ముఖాన్నే గమ్మత్తుగా చూస్తూ అన్నది విరాజిత "ఖచ్చితంగా అంతే గదా"

"మీకు మీ అందంమీద చాలా ఓవర్ కాన్ఫిడెన్స్ వున్నట్టుంది. ఒక్కసారి ముఖం అద్దంలో చూసుకోండి"

"చాలాసార్లు చూసుకున్నానండీ. సముద్రపు అలల్లాంటి తెగ బారెడు జుట్టూ, పాలూ సింధూరం కలగలసిన దేహచ్ఛాయ, చేరడేసి కళ్లూ, లక్కపిడత లాంటి బుల్లి నోరూ, సంపెంగ మొగ్గలాంటి నాసికా, అన్నీ కావ్యనాయిక లక్షణాలే కనబడుతున్నాయ్ నాలో నాకు"

"దానిమ్మ గింజల్లాంటి పలువరస మర్చి పోయారు పాపం" ఎకసెక్కంగా చూశాడు.

"అబ్బ! ఎంత కీన్ అబ్జర్వేషనండీ మీది. మరీ నా అణువణువునూ పట్టిపట్టి చూస్తు న్నారల్లేవుంది" సిగ్గుసిగ్గుగా చూసి కనురె ప్పలు రెపరెపలాడిస్తోంది.

"మిమ్మల్ని చూడ్డం తప్ప నాకింకో పనిలే దనుకున్నారా? అసలు నాకిలాంటి లక్షణా లుండే ఆడవాళ్ళంటే పడదు. నల్లగా, లావుగా, పొట్టిగా, కాస్త పళ్లెత్తుగా, పొట్టిజ డతో వుండే వాళ్ళంటే ఇష్టం. నా కళ్ళకు వాళ్లే గ్లామరస్‌గా కనబడతారు"

"తావలచిందే రంభ కదండీ. మీటేస్ట్ మీది. అయినా... ఆడవాళ్ళ గ్లామర్ గురించి కూడా బ్రహ్మచారులు ఉపన్యాసం ఇస్తారని ఇప్పుడే తెలిసింది. మనలో మాట. నిన్న సాయంత్రం నుంచి తెల్లవారే లోగా, అప్పుడే మీరు రెండు నియమాలు ఉల్లంఘించారు. ఒకటి కాఫీ తాగడం... రెండోది స్త్రీతో ప్రసంగం చెయ్యటం"

ఇక చినబాబు నిలబడలేక అక్కడనుంచి గిరుక్కున వెనుదిరిగాడు.

"చూడండీ... మాటల్లో పడి మరిచిపో యాను. రేపు ఉదయాన్నే వెళ్ళిపోతున్నాను" చెప్పింది విరాజిత.

అలాగే ఆగిపోయాడు చినబాబు. కోప మంతా ఆవిరై మనసదోలాగ అయిపో యింది "అప్పుడేనా!" అన్నాడు అసంకల్పి తంగా.

"ఈరోజు కనుము కదండీ. రేపు మీవా ళ్ళంతా రావచ్చు చెప్పాగా ఎవరూ రాక ముందే వెళ్ళిపోతానని. అయినా ఎన్నా ళ్ళున్నా వెళ్ళిపోవాల్సిన దాన్నేకదండీ"

తనేం జవాబివ్వకుండా మౌనంగా వెళ్ళి పోయాడు. పోతూ పోతూ ఒక్కసారి వెను దిరిగి విరాజితకేసి చూశాడు. ఆమె అప్ప టికే పనిలో పడిపోయింది

ఆ సాయంత్రం... అబ్బిగాడితోపాటు టెర్రెస్‌మీద ఎప్పట్లాగే పేరాపిట్ వాల్ నానుకుని నిలబడి వున్నాడు చినబాబు.

ఎంతసేపటికీ పెదవి విప్పని అతన్ని కాస్త విసుగ్గా చూస్తూ అన్నాడు అబ్బిగాడు. "భగ్న ప్రేమికుడిలా ఇలా ఫోజులిచ్చే బదులు అసలు విషయం చెప్పి పిన్నిని వుండమనొచ్చుగా"

"మక్కెలిరుగుతాయ్. ఏమిట్రా అసలు విషయం?" అబ్బిగాడి చెవి మెలిపెట్టేశాడు చినబాబు.

"నువ్వు పిన్నిని ప్రేమిస్తున్నావ్. నీ డైరీ చదివిన వాణ్ని. నా కెందుకు బాబాయ్ మస్కా కొడతావ్"

"అది నేను రాయలేదురా బాబూ అంటే వినవేం"

"వూరుకో బాబాయ్. నాకు పదకొండేళ్ళు. దాదాపుగా ప్రేమలో పడే వయసు. ఆమాత్రం అర్థంచేసుకోలేనా"

"కిందకెళ్ళి డైరీ తీసుకురా పో. నీకో క్లూ చూపించి అది నేను రాసింది కాదు అని రుజువుచేస్తా"

అబ్బిగాడు కిందకెళ్ళి డైరీ తెచ్చి చెప్పాడు. "పిన్ని బట్టలు సర్దుకొంటోంది. చీకటితో బయలుదేరుతుందట"

అది వినబడనట్టే చినబాబు డైరీ తెరచి విరాజిత తను వచ్చిన రెండోరోజు రాసిన వాక్యాలు చూపించాడు అబ్బిగాడికి.

"నీలో మనిషిని చూశానూ. అని కదూ అన్నాను. నువ్వసలు మనిషివే కాదు. నువ్వు మనీషివి. నువ్వోదేవుడివి, ఈ యిల్లో దేవాలయం"

చదివిన అబ్బిగాడు చినబాబుకేసి భృకుటి ముడిచి చూశాడు.

"చూశావుగా. అదిగనక నేను ఆమె నుద్దే శించి రాసుంటే "నువ్వో దేవుడివి" అన్న చోట నువ్వో దేవతవి అని వాడేవాణ్ని ఇక 'ఈ యిల్లో దేవాలయం' అనే బదులు 'మా యిల్లో దేవాలయం అనేవాణ్ని. ఇప్పటికైనా నన్ను నమ్మురా అబ్బీ"




అబ్బిగాడు కాసేపు మాట్లాడకుండా వుండి పోయి తరువాత అన్నాడు "ఓ.కే. బాబాయ్. నిన్ను నమ్ముతున్నా. అసలు మొదటినుంచీ ఈ వ్యవహారంలో నా అను మానాలు నాకున్నాయ్‌లే. నీలాంటి బుద్ధావ తారమేంటీ.. ఇలా రాయడమేంటీ అని ఆరోజే అనుకున్నా"

అబ్బిగాడు తనను 'బుద్ధావతారం' అన్నం దుకు మనసు కలుక్కుమన్నా... నిజం తెలుసుకున్నందుకు సంతోషమన్పించింది చినబాబుకి.

"అయితే... ఇదెవరు రాసుంటారు?" అబ్బిగాడు సాలోచనగా చూశాడు.

"ఇంకెవరు?... మీ పిన్నే రాసుం టుంది?"

"ఎవర్రాసుంటారన్నావ్? మా పిన్ని రాసుంటుందా"

"అవును"

"మా పిన్ని... మా పిన్నే..."

"అవును మీ పిన్నే..." చప్పున ఆపేసి నాలుక్కరుచుకున్నాడు చినబాబు.

"బాబాయ్ పెళ్లాన్నే కదా పిన్ని అంటారు?"

"ఒరేయ్... అబ్బీ ఎరక్కపోయి నీనోట్లో తలదూర్చాన్రా" చినబాబు తలపట్టుకు న్నాడు.

"నువ్వు పిన్నీ... పిన్నీ... అంటుంటే ఆమాట అనుకోకుండా నా దరిద్రపు నోట్లోంచి వచ్చిందిగాని... మరోటికాదు"

"లేదు . బాబాయ్. నువ్వు ప్రేమలో పడ్డావ్"

"కల్లోకూడా జరగదది"

"సరే బాబాయ్" అబ్బిగాడు చెప్పాడు. "ఇప్పుడు డైరీ విషయంలో నీ నిర్దోషిత్వాన్ని నువ్వు రుజువు చేసుకున్నట్టే, నీ ప్రేమ విషయం నన్ను రుజువు చెయ్యమంటావా? ధైర్యముంటే బెట్ కట్టు"

"బెట్" ఆవేశంగా అన్నాడు చినబాబు.

"వినుమరి. నువ్వు పిన్నిని ప్రేమిస్తు న్నట్టు నేను ఋజువు చెయ్యగలిగితే... నువ్వామెను పెళ్లి చేసుకోవాలి" ఏమంటావ్ అన్నట్టు చూశాడు అబ్బిగాడు.

"ఋజువు చెయ్యలేకపోతే..." బెదిరిం చాడు చినబాబు.

"నేనూ... ఫ్యూచర్‌లో నీలా బ్రహ్మచా రిగా మిగిలిపోతానని ప్రమాణం చేస్తున్నా"

చినబాబు చేతిని లాక్కుని ఆ చేతిలో తన చెయ్యేశాడు అబ్బిగాడు.

చినబాబు పెదవి విరిచి చెప్పాడు "నీ ఫ్యూచర్ ఎవరు చూడొచ్చారు? హేండి చ్చినా ఇవ్వగలవ్. ప్రస్తుతం ఏం చేస్తావో చెప్పు"

"ఈ మేడ మీంచి దూకేస్తాను"

"అదేం కుదర్దు. నువ్వు తెలుగు సిని మాలు చూడ్డం మానెయ్యాలి"

"అదేం కోరిక

"అదంతే... సినిమాల్లో బాలనటుల ముదురు డైలాగులు వినే నువ్విలాగ చెడి పోతున్నావ్ కాబట్టి... తక్షణం నువ్వు అవి చూడ్డం మానెయ్యాలి"

"అలాగే బాబాయ్. మరి నువ్వొకటి చెయ్యాలి. ఈ విషయం తేలాలంటే... కనీసం పిన్నిని మరో నలభై ఎనిమిది గంటలు అంటే రెండురోజులు ఆపగలగాలి"

విరాజిత వెళ్లిపోవటం అనేది ఎక్కడో అంతరాంతరాల్లో ముల్లుగా గుచ్చుకుంటున్న చినబాబుకు ఈ ప్రపోజల్ నచ్చింది.

"ఆమె ఒప్పుకోదేమో!" చినబాబు ఎలా అన్నట్టు అబ్బిగాడికేసి చూశాడు.

"ఆ విషయం నాకొదిలెయ్ బాబాయ్... నేను చూసుకుంటా" అని... చినబాబు చెవిలో ఏదో చెప్పాడు.

"నమ్ముతుందా?" అనుమానంగా చూశాడు.

"నమ్మించాలి. దేర్‌లైస్ అవర్ గ్రేట్‌నెస్"



చెప్పాడు అబ్బిగాడు.



ఆ రాత్రి భోజనాలు వడ్డిస్తూ చెప్పింది విరాజిత శేషాద్రితో "ఉదయాన్నే వెళుతున్నానండీ"

అన్నంలో నెయ్యి వంపుకుంటున్న శోభ వులిక్కిపడింది "నువ్వెళితే అమ్మకెవరు చేస్తారు? "

"మీరున్నారు కదండీ. పైగా... రేపు మీ వదినెలంతా వస్తారుగా. ఇక నా అవసరం ఏముంటుందీ"

"వదినెలొస్తే మాత్రం! ఎవరి సంసారం వాళ్లదీ ఈ యింట్లో. పలకరిస్తారుగాని, ఇక్కడే పడిచెయ్యరు. పైగా నేనుండగా చస్తే అమ్మను పట్టించుకోరు. అంతా ఇక నానెత్తిన పడుతుంది. మెట్టినింట్లో బాధలు పడలేక... ఏదో పుట్టింట్లో సరదాగా గడుపుదామని వస్తే... ఇదెక్కడి పీడ! నావల్ల కాదు బాబూ"

అటు జన్మ యిచ్చిన తండ్రి... ఇటు తోడ బుట్టిన తమ్ముడు... అయినా తెగేసి చెప్పింది శోభ.

ఆమె మాటలు గదిలోవున్న చంద్రకాంతమ్మ ఎక్కడ విని బాధపడుతుందోనని కంగారుగా అటు చూస్తున్న విరాజితతో మళ్లీ అంది శోభ. "అమ్మ కాస్త లేచి తిరిగిందాకా వుండు నువ్వు. వూరికే వద్దులే. జీతం తీసుకుందువ్‌గాని"

చినబాబుకు చప్పున పొలమారింది. అబ్బిగాడు తలమీద తట్టి నీళ్ళందించాడు.

అతను తేరుకుని చూసేలోగా విరాజిత అక్కడినుండి వెళ్ళిపోయింది.

"శోభా... వయసొచ్చిందిగాని కాస్తేనా ఇంగిత జ్ఞానం లేదు నీకు. జీతం ఇవ్వడా నికి ఆ అమ్మాయేమన్నా నీ పనిమనిషనుకు న్నావా? " శేషాద్రి కేకలేశాడు.

"పనిమనిషా అనడుగుతున్నారు. పనిమ నిషి కాకుంటే మనమనిషా? " నిర్లక్ష్యంగా అంది శోభ.

శోభవంక అసహ్యంగా చూసి... చినబా బులేచి చెయ్యికడుక్కుని కిచెన్‌లోకెళ్ళాడు.

విరాజిత అటుతిరిగి నిలబడి కొంగుతో కళ్ళు అద్దుకుంది.

"విరాజితగారూ! బాధపడకండి. ఆమె తరఫున నేను సారీ చెబుతున్నా"

గిరుక్కున ఇటు తిరిగిందామె. చెక్కిళ్ళమీ దకు జారుతున్న కన్నీటిని తుడుచుకుని పేలవంగా నవ్వింది. "ఆమె అన్నదాన్లో తప్పేముంది? ఈ యింట్లో నా స్థానమదే. దయచేసి... ఈ పదిరోజులూ నేను చేసిన చాకిరీకి గాను ఓ రెండొందలు యిప్పిం చండి. ఒంటరిదాన్ని కదా! ఖర్చులకు పనికొ స్తాయ్. ఇక మాత్రం వుండలేను. రేప ట్నుంచి వేరే మనిషిని పెట్టుకోండి"

ఆమె గబగబా... హాల్లోకి వెళ్ళి తను అంతకుముందు ఓ పాలథీన్ కవర్‌లో సర్దిపెట్టుకున్న చీరెల్ని విసురుగా బయ టకు తీసి టీపాయ్ మీద పడేసి చిన బాబు వెనకే వచ్చి చోద్యం చూస్తూ నిల బడ్డ శోభతో చెప్పింది. "ఇవి.. మీ తమ్ముడుగారు కొన్నారండీ. పనిలో వున్న న్నాళ్ళూ కట్టుకున్నా యూనిఫామ్‌లాగా. రేపట్నుంచీ వచ్చే పనిమనిషికి ఇవ్వండి ఇవి"

విషయం అర్థంచేసుకున్న చంద్రకాంతమ్మ తన గదిలోంచే అంది "దాని మాటలు పట్టించుకోకు తల్లీ. ఇలారా... నా ముఖం చూడు... తల్లిలాంటిదాన్ని... ఇంతకాలం నీచేత కూర్చుని చేయించుకుని... ఈరోజు నీ మనసు కష్టపెట్టి పంపే కసాయివాళ్లను చెయ్యకమ్మా మమ్మల్ని"

విరాజిత మెల్లగా ఆమె గదిలోకెళ్ళింది. మోకాళ్లమీద ఆమె మంచంపక్కనే కూర్చుని ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని చప్పున కళ్లకానించుకుని భోరుమంది. "మిమ్మల్ని కసాయివాళ్లంటే నా కళ్లుపోతా యమ్మా. కసాయి కత్తినుంచి నన్ను తప్పించి కన్నతల్లిలా కడుపులో దాచుకు న్నారు ఇన్నాళ్ళూ. అర్థరాత్రి ఇదెక్కడి పీడరా మనకు ఈ పిల్లెవరో... ఏమిటో... మనకేం చుట్టుకుంటుందో అని ఆనాడు మీరు అనుకుని నా ముఖాన తలుపేసి వుంటే ఈనాడు నేనేమైపోయి వుండే దాన్నో... నాకు బాగా తెలుసు. మీరుచేసిన మేలు... జన్మజన్మలకు మరిచిపోయేది కాదు. ఆమేదో అన్నారని నేను వెళ్లిపోవటం లేదు. ఇక్కడ నా అవసరం లేదు కాబట్టి వెళుతున్నా అంతే"

విరాజిత లేచింది. చినబాబుకేసి క్షణంలో సగంసేపు చూసింది.

అక్కడే నిలబడి సీరియస్‌గా తనకేసి చూస్తోన్న అబ్బిగాడి తల నిమిరింది.

"ఇవేం సీన్లురా బాబూ. వుండమన్నాను గాని వెళ్లమన్లేదుగా. డబ్బంటే ఇంత చేదని నాకేం తెలుసు? నేనేదో పుణ్యానికి పోయి జీతం తీసుకోమంటే.. ఇంతపాపం ఎదురైం దేమిట్రా దేవుడా"

శోభ... విసురుగా అంటూ లోపలికెళ్ళిపో యింది.

"వస్తానండీ" అందరివైపూ చూసి చెప్పింది.

ఆమె టీపాయ్ మీద పడేసిన చీరల్నే చూస్తున్నాడు చినబాబు.

"ఇప్పుడెక్కడకమ్మా వేళకాని వేళ! ఉద యాన్నే వెళతానన్నావ్‌గా" శేషాద్రి అన్నాడు.





"ముందలాగే అనుకున్నానండీ. ఇప్పుడు నా నిర్ణయం మార్చుకున్నా"

"ఎక్కడికి వెళతారు?" చినబాబు అడిగాడు.

"బస్టాండ్‌కో... రైల్వేస్టేషన్‌కో వెళ్లి అక్కడ ఆలోచించుకుంటాను" చెప్పిందామె.

చినబాబు అబ్బిగాడికేసి చూశాడు.

అబ్బిగాడు ఏదో అనబోతున్న వాడల్లా దబ్బున నేలమీద పడ్డాడు. కాళ్ళూ చేతులు టపటప కొట్టుకున్నాడు. నోటివెంట నురగ... కళ్ళు తేలేశాడు.

"అబ్బీ" చినబాబు, శేషాద్రి వెర్రికేక వేశారు.

శోభ పరిగెత్తుకొచ్చింది.

"ఏమైందర్రా నా మనవడికీ" గదిలోంచి నిస్సహాయంగా అరుస్తోంది చంద్రకాంతమ్మ.

గడప అవతల పడబోతున్న విరాజిత అడుగు అలాగే ఆగిపోయింది.

★ ★ ★

"పిన్నీ... నువ్వెళ్లొద్దు... పిన్నీ...ప్లీజ్..."

కళ్ళు మూసుకునే పలవరిస్తున్నాడు అబ్బిగాడు.

"వెళ్లను... నావైపిలా చూడు. ఇదో ఇక్కడే వున్నా" అనునయంగా చెబుతోంది విరాజిత.

రాత్రంతా హాస్పిటల్‌లోవుంచి ఉదయం పదిగంటలకల్లా డిశ్చార్జ్ చేశారు అబ్బిగాడ్ని.

ఫిట్స్ కావచ్చన్న అనుమానం వ్యక్తం చేశాడు డాక్టర్. ఏదేమైనా అబ్బిగాడికి ఇష్టం లేని పనిచేసి... వాడి మెదడుకు ఎలాంటి శ్రమ కొన్నాళ్లవరకు ఇవ్వకూడదన్నారు. అలా చేస్తే మళ్లీ ఫిట్స్ వచ్చే ప్రమాదం ఉందన్నారు.

అందుకే విరాజిత ప్రయాణం ఆమె ప్రమేయం లేకుండానే వాయిదా పడింది.

'వెళ్లొద్దు పిన్నీ నన్ను విడిచి' అని పదేపదే పలవరిస్తున్న అబ్బిగాడ్ని వదిలి వెళ్లడానికి ఆమెకు మనస్కరించడంలేదు.

అబ్బిగాడు తన్నలా పిలవటం విరాజితకు ఇబ్బందిగా అన్పించింది ముందు. చినబాబుతో మాట్లాడేటప్పుడు ఎగతాళిగా విరాజితను "పిన్నీ" అని సంబోధించాడే గాని డైరెక్టుగా అంతకు ముందు ఆమెనలా పిలవలేదు అబ్బిగాడు. ప్రస్తుతం మాత్రం... కళ్లు తెరచినా మూసినా పిన్నీ... పిన్నీ అంటూ ఒకటే కలవరింత. ఆ పసిమనసులో జస్ట్... మూడురోజుల పరిచయంలో... అంతటి ముద్ర వెయ్యగలిగింది తను!

ఓ రకంగా గర్వంగా అన్పించింది విరాజితకు. అబ్బిగాడి మీద ఏదో అవ్యాజమైన అనురాగం పొంగి పొర్లింది. తన్ని అవమానించిన శోభను జయించినంత ఫీలింగ్ కలిగింది. అందుకేనేమో "పిన్నేమిటీ పిన్నీ! ఇదెక్కడి వరస" అంటూ అంత టెన్షన్‌లోనూ కొక్కిరాయిలా అంటున్న శోభను తేలిగ్గా చూస్తూ చెప్పింది విరాజిత "వరసలో ఏముందండీ! మనసులో వుండాలిగాని, మేనత్త మరి మీరు... మిమ్మల్నో, కన్నతల్లినో... తండ్రినో మరొకర్నో కలవరించలేదు అబ్బిగాడు. అంటే నేను మీకన్నా ఎక్కువనేగా. అందుకేనండి గడప దాటబోయినదాన్ని మళ్ళీ లోపల అడుగుపెట్టాను. కేవలం అబ్బిగాడి అభిమానానికి కరిగిపోయే నా నిర్ణయాన్ని మార్చుకున్నాను"

విరాజిత అంత సూటిగా వున్నమాట అనేసరికి మరేం మాట్లాడలేక మిన్నకుండిపోయింది శోభ. ఉక్రోషంతో ఆమె పెదవులు వణకడం... కళ్లలో నీళ్లు తిరగడం విరాజిత చూపుదాటిపోలేదు.

ఆరోజు వంటకూడా చెయ్యడం మానేసి, అబ్బిగాడి మంచం పక్కనే కూర్చుండిపోయింది విరాజిత. విధిలేక కిచెన్‌లో చొరబడింది శోభ.

సాయంత్రానికొచ్చేశారు... ప్రశాంతి... శ్రీకాంత్‌లు. విషయం విని ఘొల్లుమంది

ప్రశాంతి. "నా బిడ్డకు ఫిట్సేమిటి? నేన్న మ్మను. మీరే ఏదో చేశారు వాడ్ని. కట్నం తేలేదని... నేనన్నా... నా బిడ్డన్నా చిన్న చూపు మీకు. బాబాయ్ బాబాయ్ అని నాబిడ్డ పరిగెత్తుకొచ్చినందుకు మంచిపని చేశారు మీరు" ఎగ్జయిట్ అయిపోతూ ఏమేమో మాట్లాడేస్తోంది ప్రశాంతి.

"విన్నావుటమ్మా... ఇదీ... మా యింటి భాగోతం. ఈవిడగారికి కొడుకేనా వాడు! నాకు మనవడని మర్చిపోయి అదెలా మాట్లాడుతోందో చూడు. కాలు విరిగి నేనే డుస్తుంటే... వాడ్ని నేనేదో చేశానం టుందే... కాస్తేనా... బుద్ధీజ్ఞానం వున్నా యంటావా దానికి? "

చంద్రకాంతమ్మ స్వరం పెంచి అరిచే స్తోంది.

"అసలేం జరిగింది నాన్నా? " అడుగుతు న్నాడు శ్రీకాంత్.

"ఉన్నట్టుండీ పడిపోయాడ్రా..." చెబుతు న్నాడు శేషాద్రి.

"దానికి ముందెవరైనా వాడ్ని తిట్టడం లాంటివి చేశారా? "

"అయ్యో... వాడేం చేశాడని తిడతాం. పల్లెత్తు మాటన్లేదు మేం"

బెడ్మీద పడుకుని వింటున్న అబ్బిగాడికి పిచ్చెక్కిపోయింది. తనబెడ్ చుట్టూ నిలబడ్డ అందర్నీ ఒక్కసారి చిరాగ్గా చూసి చెప్పాడు "నన్ను కాసేపు పడుకోనివ్వండి. నాకిప్పుడు బాగానే వుంది... ప్లీజ్"

దాంతో అందరినోళ్లకూ తాళాలు పడ్డాయ్. అప్పటిగ్గాని ప్రశాంతికి అత్తగారు ఎలా పడ్డారో అడిగి తెలుసుకోవాలనిపించ లేదు. ఆమెను పలకరించి కాస్త సానుభూతి గిలకరించి శోభ చెవులు కొరికి విరాజిత గురించి ఆరా తీసింది.

"ఎక్కడి పిల్లో... ఏమిటో... ఎందుకు అలా ఇంట్లో పెట్టుకోవడం? రేపు ఆవిడ తాలూకు వాళ్లు మనమీదకొస్తే" అంటూ





దీర్ఘం తీసింది.

కాస్త తేడాతో మిగతా రెండు జంటలు కూడ దిగాయి. అబ్బిగాడ్నీ... చంద్రకాంత మ్మను పరామర్శించారు. ఇంటికోడళ్లంతా ఓచోట చేరి విరాజిత కథా కమామీషు ఒక రితో ఒకరు చెప్పుకుని మొత్తంమీద అత్తగా రికి సేవలు చేసే బాధ అనుకోకుండా తప్పి నందుకు మనసులోనే సంతోషించారు.

ఆరాత్రి... తల్లిదండ్రులు ఎంత బతిమిలా డినా మొరాయించి తన పక్కనే పడుకున్న అబ్బిగాడ్ని అబ్బురంగా చూస్తూ అడిగాడు చినబాబు "అంత బాగా... అచ్చం మూర్ఛ రోగిలా ఎలా యాక్ట్ చెయ్యగలిగావ్ రా అబ్బీ? "

"లాస్టియర్ స్కూలు యానివర్సిరీకి... మనం వేసిన ఫ్యాన్సీ డ్రెస్ ఇదేగా. నీకు జ్వరమని నువ్వెగ్గొట్టావ్ ఫంక్షన్కి. ఎంత బాగా యాక్ట్ చేశాననీ... ఫస్ట్ ప్రైజ్ ఇచ్చా రుగా" గుర్తు చేశాడు అబ్బిగాడు.

అప్పుడు గుర్తుకొచ్చింది చినబాబుకు... అబ్బిగాడు వేసిన విచిత్ర వేషధారణ ఐటమ్ 'మూర్ఛరోగి'ని ఇంట్లో అందరూ తెగ పొగి డిన వైనం.

"అదేం వేషంరా అబ్బీ... దరిద్రపుగొట్టు వేషం ఇంకోసారి వేశావో మక్కెలిరుగు తాయ్" మనవడు మూర్ఛరోగిలా కొట్టుకో వడం చూసి భరించలేని చంద్రకాంతమ్మ ఆరోజు వాడ్ని తిట్టటం కూడ చప్పున జ్ఞాపకం వచ్చేసింది.

"కంగ్రాచ్యులేషన్స్రా. నేను ఏదైనా బహు మతి కొనిపెడతాలే" చెప్పాడు చినబాబు సంతృప్తిగా.

"అద్సరే... పిన్ని వుంటున్నట్టేనా? " అడి గాడు అబ్బిగాడు అనుమానంగా.

"నో డౌట్... నా డాక్టర్ ఫ్రెండ్చేత చెప్పించా. మీరు కనబడకపోతే అబ్బిగాడికి మళ్ళీ ఫిట్ రావటం ఖాయమని. పూర్తిగా నమ్మేసింది. కనీసం ఓ రెండు మూడు రోజులైనా ప్రయాణం మాట తలపెట్టదు"

"ఇక కాస్కో బాబాయ్ నా తడాకా

చూపిస్తా పందెం గుర్తుందిగా" అడిగాడు అబ్బిగాడు.

"వుందిలేవోయ్. ఇక పడుకో" చెప్పాడు చినబాబు.

మొదటి ప్రయత్నంలోనే అబ్బిగాడు అనుకున్నది సాధించడంతో కాస్త కంగు తిన్నాడు చినబాబు. "కొంపదీసి తను ఓడిపోడుకదా!" భయంగా అనుకున్నాడు.

అనుకున్న వెంటనే అతనికి స్థిమితమయింది.

'తనెందుకు ఓడిపోతాడు? తనామెను ప్రేమిస్తుంటేకదా? అసలామెనే ఏంటి... ఎవర్నీ ప్రేమించడుగాక ప్రేమించడు. ప్రేమా, పెళ్లీ అనే పదాలు తన జీవిత నిఘంటువులోనే లేవు. ఇంకేమిటి అబ్బిగాడు చేసేది వాడి ముఖం'

తృప్తిగా నిట్టూర్చాడు.

★ ★ ★

ఉదయాన్నే నిద్ర లేవగానే ప్రభావతి గదిలోకొచ్చాడు అబ్బిగాడు. ఆవిడ అప్పుడు లేచి బెడ్ కాఫీ తాగుతోంది. శ్రీనివాస్ అప్పటికే తాగేసి ముసుగు తన్నేసి వున్నాడు.

"ఏరా అబ్బీ... ఒంట్లో ఎలా వుంది? "

"ఏంలేదులే పెద్దమ్మా. మీరంతా ఇంట్లో లేక దిగులు పడుంటా. అందుకే అలా పడిపోయుంటా రాత్రి. ఇప్పుడు బ్రహ్మాండంగా వుంది"

"సర్లే... ఈ రోజూ రేపూ స్కూలుకి మాత్రం వెళ్లకు"

"అలాగే పెద్దమ్మా" చెప్పాడు.

ప్రభావతి కప్పులోకి పాలు వంపుతుంటే బ్రతిమిలాడి కాఫీ పొయ్యించుకుని సిప్ చేస్తూ చెప్పాడు. కాస్త ఎగ్జయిటింగ్‌గా వుంది అబ్బిగాడి స్వరం "పెద్దమ్మా రాత్రి నువ్వు కల్లోకొచ్చావ్. వచ్చి నన్ను నీ ఒళ్లో పడుకో బెట్టుకుని నాకు బిడ్డల్లేక పోతే ఏం... అబ్బిగాడే నా బిడ్డ అని నన్ను ముద్దు పెట్టుకున్నావ్. వెంటనే మెలుకువొచ్చేసింది. ఎంత సంతోషంగా వుందో నాకు! వెంటనే నిన్ను చూడాలన్పించి లేవగానే అమ్మ దగ్గర క్కూడా వెళ్లకుండా నీ దగ్గర కొచ్చేశా"

"మా నాయనే" ప్రభావతి అబ్బిగాడి తల ఆప్యాయంగా నిమిరింది.

"నిజం పెద్దమ్మా" నాకు అమ్మకంటే కూడా నువ్వంటేనే ఇష్టం" కళ్లు విప్పారుస్తూ చెప్పాడు.

"నీకు కజ్జికాయలంటే ఇష్టం కదరా నాన్నా. ఇవాళ చేసి పెడతాలే" చెప్పిందామె.

"వద్దులే పెద్దమ్మా. రాత్రేకదా వూర్నుండొచ్చారు. అవునూ ఇన్నాళ్లూ మీ పోర్షన్‌కి తాళం వేసుకెళ్లారు కదూ! బాగా బూజు పట్టేసినట్టుంది" గదంతా పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"అవున్రా దులపాలి. గచ్చు కూడా కడగాలి"

"బాప్రే కిచెన్‌లో సామాన్లన్నీ దుమ్ము పట్టిపోయినయ్"

"ఇన్నాళ్లు వాడలేదుగా చేసినంతపని ఇక నాకు. నడుం విరిగిపోతుందివాళ. ఓ వేగన్ బట్టలు కూడా వున్నాయి"

"ఇవన్నీ చేశావంటే అయిపోతావ్. విరాజి తుందిగా. శుభ్రంగా పిలిచి పనంతా చెయ్యమను. ఏం పరవాలేదు" చెప్పాడు అబ్బిగాడు.

"అవున్రోయ్. బాగా చెప్పావ్. అక్కడపని కాగానే ఇక్కడి కొచ్చెయ్‌మని చెప్పు"

"ఓర... చెప్పేస్తా. అయితే నేనీ ఐడియా ఇచ్చినట్టు బాబాయ్‌తో అనకు"

"అవునుగానీ చినబాబేం అనుకోడుగా? " అనుమానంగా అడిగింది.

"ఎందుకనుకుంటాడు. పని చేయించుకునేగా తిండిపెడుతున్నారు బాబాయ్ వాళ్లు ఆమెకు. ఓ రకంగా పనమ్మాయే"

ప్రభావతి అబ్బిగాడి సలహాకు మురిసిపోయింది.



గబగబా బయటకి వచ్చి చినబాబు వాటాలో కిచెన్‌లో పనిచేసుకుంటున్న విరాజితకు చెప్పింది "నిన్న పదిగంటలు ప్రయాణం చేశాం విరాజితా. నడుం విరిగిపోతోంది. జ్వరమొచ్చినట్టుగా వుంది. ఏమనుకోకపోతే కాస్త మా వాటా శుభ్రం చేసి పెడతావూ? ఏంలేదు. నాలుగ్గిన్నెలు, కాసిన్ని బట్టలు అంతే. ఓపికుంటే... బూజు దులిపి ఓ బక్కెట్ నీళ్లుపెట్టి గచ్చు కడిగెయ్ ఏమనుకోకూ"

"అలాగేనండీ" చెప్పింది విరాజిత.

హడావుడిగా టిఫిన్ రెడీచేసి... చంద్రకాంతమ్మను లేపింది. ఆమెకు బ్రష్షింగూ అదీ చేయించి టిఫిన్ పెట్టే లోపల చినబాబూ... శోభా... శేషాద్రీ స్నానాలు అవీ ముగించి డైనింగ్ హాల్లో కొచ్చారు.

"శోభగారూ... కాస్త అందరికీ టిఫిన్ వడ్డించెయ్యండి. ప్రభావతిగారు కాస్త హెల్ప్ కావాలని పిలిచారు. ప్లీజ్" చెప్పింది.

శోభ మాట్లాడకుండా చినబాబుకూ శేషాద్రికీ టిఫిన్ పెట్టి తనూ తినడం మొదలెట్టింది.

విరాజిత టిఫిన్ చెయ్యకుండానే ప్రభావతి వాటాలోకి వెళ్లడం గమనించి అన్నాడు చినబాబు "మీరూ టిఫిన్ చేసి వెళ్లకూడదూ"

"వచ్చాక చేస్తాలెండి" అనేసి వెళ్ళిపోయింది. ఆమె వెళ్లిన ఐదు నిముషాలకొచ్చాడు అబ్బిగాడు చినబాబు దగ్గరకు.

"బాబాయ్... ఈరోజు నువ్ సెలవు పెట్టేసెయ్. ఎందుకో నీ దగ్గరే వుండాలనుంది నాకు" చెప్పాడు.

శేషాద్రి వెంటనే అన్నాడు చినబాబుతో "రేయ్ చిన్నా! అబ్బిగాడి మాట కాదనకు. వాడి మనసుకు నచ్చినట్టు చెయ్"

చినబాబు మనసులోనే నవ్వుకుని పైకి మాత్రం అలాగే నాన్నా అన్నాడు.

ఓ అరగంట గడిచాక పక్కనే వున్న అబ్బిగాడితో అన్నాడు చినబాబు "రేయ్ అబ్బీ... విరాజిత టిఫిన్ చెయ్యకుండా పదిన పిలిచిందంటూ వెళ్ళింది. టిఫిన్ తినమను వచ్చి"

"పిన్నికి టిఫిన్ చేసే తీరిక్కూడానా! పెద్దమ్మకు సహాయం చేశాక...మళ్ళీ అమ్మ వచ్చి సహాయం చెయ్యమంది" చెప్పాడు అబ్బిగాడు. అమ్మ అంటే సౌభాగ్య. ఆమెనలా పిలుస్తాడు వాడు.

సౌభాగ్యకు కూడా విరాజిత హెల్ప్ తీసుకోమని సలహా ఇచ్చింది అబ్బిగాడే.

"ఏమిట్రా ఆ సహాయం" అడిగాడు చినబాబు అర్థంకాక.

"ఏముంటుంది! అంట్లు తోమడం, బట్టలుతకడం, ఇల్లంతా బూజు దులిపి కడగటం... ఇలాంటివి పాపం ఇక్కడంతా చేసిందా మళ్లీ అక్కడ అదయ్యాక మళ్లీ..."

చినబాబుకు మనసు చివుక్కుమంది. లేచి ప్రభావతి వాటాలోకి తన అన్నయ్యతో పనున్నట్టు వెళ్లాడు. శ్రీనివాస్‌తో మాట్లాడుతూ అక్కడున్న విరాజితకేసి చూశాడు.

కొంగు నడుం చుట్టూ దోపుకుని చీరకుచ్చిళ్లు ఎత్తి పట్టుకుని ప్లాస్టిక్ బకెట్‌లోని నీళ్లు ముంచుతూ చేతిలో చీపురుకట్టతో గచ్చు కడుగుతోంది.

వదిన ఓ చెయిర్లో కూర్చుని ఆమెకు "అక్కడ కడుగు ఇక్కడ కడుగు" అంటూ డైరెక్షన్ ఇస్తోంది.

విరాజిత వంచిన నడుం ఎత్తకుండా పని చేస్తోంది.

రక్తం సలసలమంది చినబాబుకు. అక్కడ వుండలేక బయటకొచ్చేశాడు.

"మరీ ఘోరం బాబాయ్. ఇక్కడ **ఇంటెడు** చాకిరీ చేసిందా! అక్కడంత పని ఇంకొంచెం ఆగు... నువ్వే చూద్దువ్‌గాని"

అబ్బిగాడన్నట్టే విరాజిత ఓ రెండు గంటలపాటు అక్కడ కష్టపడి పనిచేసి మళ్ళీ సౌభాగ్య వాటాలో మొదలెట్టింది పని.

"అమ్మాయ్ సామానంతా ఈ పదిరోజులూ వాడక దుమ్ము పట్టిపోయింది





మొత్తం శుభ్రం చెయ్..." అంటూ కిచెన్ లోని వస్తువులన్నీ పెరట్లో పడేసింది సౌభాగ్య.

బండెడు అంట్లు తోమేసి మళ్లీ బట్టలు వుతుకుతున్న విరాజితను చూస్తుంటే చిన బాబుకు కడుపులో దేవినట్టయింది.

"రేయ్... అబ్బిగా వెళ్లి తనని పిల్చు కురా? "

అబ్బిగాడు వెళ్లి రివర్స్ గేర్‌లో వచ్చాడు.

"ఇంకా ఇల్లు కడిగే పనుందట"

చినబాబు అసంకల్పితంగా పళ్లు కొరుక్కున్నాడు. విరాజిత, సౌభాగ్య ఇంట్లో పనిముగించి వస్తుంటే ప్రశాంతి పిల్చింది.

అప్పటికి ఒంటిగంట కావస్తోంది. "పనేం లేదులే జస్ట్ బట్టలు మాత్రం పిండివ్వు"

విరాజిత ప్రశాంతి బట్టలు పిండి ఆరేస్తుంటే అబ్బిగాడు సోఫాలో కాళ్లు బారజాపుకుని కూర్చుని వీక్లీ చదువుతున్న శోభ దగ్గరికి చేరి అన్నాడు.

"అత్తయ్యా... నువ్వంటే విరాజితకు గిట్టదులా వుంది. చూడు మీ వాటాలో పనిచెయ్యకుండా వాళ్లకు చేసిపెడుతోంది. ఎలాగైనా నీచేత వంట చెయ్యించాలని ప్లాను"

అబ్బిగాడి మాటలు శోభమీద వెంటనే ప్రభావం చూపాయి. వాడు రాత్రంతా... విరాజితనే కలవరించటం. తన వూసైనా ఎత్తకపోవటం... మొదలైన విషయాలన్నీ తాత్కాలికంగా మర్చిపోయింది.

"నేనెందుకు చేస్తాన్రా. వచ్చి కుక్కలా తనే చేసుకుంటుంది. ఎవడి కోసం!" నిర్లక్ష్యంగా అంది.

ఒకటీ ఇరవైనిముషాలకు మూడిళ్లలో పనిముగించుకుని హూనమైన ఒళ్లుతో వచ్చిన విరాజిత శోభ కనీసం అన్నం కూడా వండని విషయం గమనించి నిట్టూర్చింది.

"అన్నం వండకూడదా శోభ గారూ! పాపం పెద్దావిడ ఆకలికి వుండలేదేమో"

విరాజిత అలా అనగానే ఆమెమీద ద్వేషం ఎలా కక్కాలో తెలీక అవస్థ పడుతున్న శోభ అంతెత్తున తారాజువ్వలా లేచింది. "పెద్దావిడకు ఆకలవుతుందన్న జ్ఞానం నీకుంటే వాళ్లపని చేస్తావా? ఇదంతా అందరి మెప్పు సంపాదించి ఈ కొంపలో పాతుకుపోవాలనేగా ఎవరికి తెలీదు నీ జాణతనం"

ముందే విరాజిత కష్టాన్ని గమనించి గుండె మండిపోతున్న చినబాబుకు శోభ కంఠస్వరం అగ్నికి ఆజ్యం పోసినట్టయింది. పైగా అంతపని చేసుకుని వచ్చిన విరాజిత చేత మళ్లీ వంట చెయ్యించబోతున్న శోభని గొంతు పిసకాలనిపించింది. గుడ్లనీరు కుక్కుకుంటూ నిలబడ్డ విరాజితను చూసి అతని హృదయం ద్రవించిపోయింది.

"అక్కయ్యా... నీకసలు బుద్ధుందా! ఆమె మనిషనుకుంటున్నారా... లేక మిషననుకుంటున్నారా మీరంతా" ఒళ్లు మరచిపోయి అరిచేశాడు.

అబ్బిగాడు తూరీగలా దూరాడు ప్రభావతి పోర్షన్‌లోకి.

"విరాజిత చేత మీరంతా పనిచెయ్యించుకున్నారని తిట్టిపోస్తున్నాడు మీ అందర్నీ బాబాయ్"

ప్రభావతి అహం దెబ్బతిని ఒక్క ఉదుటున వచ్చింది.

అప్పటికి శోభ ఏమందోమరి చినబాబు "మరీ హృదయం లేని మనుషులు" అంటున్నాడు.

వెంటనే అందుకుంది ప్రభావతి "ఎవరికయ్యా హృదయం లేంది. నిన్నంతా చచ్చీ చెడీ ప్రయాణం చేసొచ్చాగదాని కాస్త సహాయం చెయ్యించుకుంటే ఇంతలేసి మాటలంటావా? "

ఈలోగా సౌభాగ్య ప్రవేశం జరిగిపోయింది.

"ఏంటి ప్రభా? " అంది అయోమయంగా

"ఈవిడగారిచేత పనిచెయ్యించుకున్నామని మరిదిగారు తెగబాధపడిపోతున్నారు"



"పనిపిల్లచేత పనిచెయ్యించుకోక... పట్టం కట్టి కూర్చోబెడతామా!" అంటూ ప్రశాంతీ ఎంటరైంది.

'పనిపిల్ల' అన్న పదం వాళ్ల నోటి వెంట రావడంతోనే ఉలిక్కిపడి విరాజితకేసి చూశాడు.

"ఎవరాదినా, ఎవరిక్కడ పనిపిల్ల?" దూకుడుగా అన్నాడు చినబాబు.

విరాజిత కళ్లలోంచి కారుతున్న నీళ్లు... అతని నరనరాల్నీ మెలిపెడుతున్నాయి.

"పనిపిల్లకాక ఇంకెవరో?" శోభ దీర్ఘం తీసింది.

"ఎవరంటే... ఎవరంటే" చినబాబు మాట తడుముకున్నాడు. "ఆమె... ఆమె... నాక్కావాల్సిన మనిషి"

చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్దం ఏర్పడిందక్కడ. ఒకరి ముఖాలొకరు చూసుకుని ఒకరి తరువాత ఒకరుగా ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు.

చినబాబూ... చినబాబు ఎదురుగా విరాజిత మాత్రమే మిగిలారక్కడ.



ఎవరి గదుల్లో వాళ్లు తలుపులు బిగించుకుని వున్నారు. విరాజిత ఎప్పట్లా హాల్లో... సోఫాకమ్ బెడ్‌మీద పడుకుని వుంది.

పని చేసీచేసీ ఒళ్లంతా పులిసిపోయిందేమో. ఒళ్లెరక్కుండా నిద్రపోతోంది.

చినబాబుకు మాత్రం నిద్రపట్టటంలేదు ఎంత ప్రయత్నించినా.

తను తనేమన్నాడు? విరాజిత తనక్కావలసిన మనిషా? ఏవిధంగా కావలసిన మనిషి?

తన మాటకు వాళ్లంతా ఏమనుకున్నారో అసలు విరాజితేమనుకుందో?

విరాజితను నిన్న రాత్రి వెళ్లనిచ్చినా బాగుండేది. ఈ అబ్బిగాడే పందెం గిందెం అంటూ వెధవ యాక్షన్ చేసి ఆమెనాపేశాడు. తనాపందెం కాయకుండా వుండాల్సింది. ఇదంతా అబ్బిగాడివల్లే.

పక్కనే పడుకుని వున్న అబ్బిగాడికేసి కోపంగా చూశాడు.

అబ్బిగాడు అమాయకంగా నిద్రపోతున్నాడు.

అయినా వాడి తప్పేముందిలే. వాడేమైనా తననలా అనమని చెప్పాడా.

తనే తనకు తెలీకుండా అనేశాడలా.

ఎందుకలా అన్నాడు? ఏమైందప్పుడు తనకు? తన ప్రమేయం లేకుండా తన నోటినుండి జారిపోయిన ఆ మాట... పెదవులమీంచి వచ్చిందా. లేక తన హృదయంలోంచి వచ్చిందా?

ఆలోచిస్తూ అలాగే నిద్రలోకి జారిపోయాడు.

దాదాపు రెండు గంటల ప్రాంతంలో.

నిశ్శబ్ద నిశీధిని చీలుస్తూ కెవ్వుమంటూ విన్పించిందో కేక... చినబాబు నిద్రను చెదరగొట్టేస్తూ.

ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాడు.

ఎవరు అరిచిందలా? హాల్లో లైట్ వెలగటం కిటికీలోంచి కనబడుతోంది. లేచి చూశాడు.

విరాజిత సోఫామీద పడుకునిలేదు. నేలమీద కూలబడి కుడిచేతి చూపుడువేలును ఎడంచేత్తో నొక్కి పట్టి బాధతో విలవిలలాడుతోంది.

చినబాబు భృకుటి ముడివడింది. చప్పున తలుపు తీసుకుని విరాజిత దగ్గరకొచ్చాడు.

"ఏమైందండీ? " ఆదుర్దాగా అడిగాడు.

ఆమె చెప్పాలని ప్రయత్నించింది కాని చెప్పలేకపోయింది. కళ్లలోంచి జలజల రాలుతున్నాయ్ కన్నీళ్లు. నుదుటిమీద గుబ గుబ చెమటలు పోస్తున్నాయ్. కుడిచేతిని ఒక్కోసారి విదిలిస్తూ ఒక్కోసారి రెండోచేత్తో అదుముకుంటూ మెలికలు తిరిగిపోతోంది. వుండుండీ కళ్లు తేలేస్తోంది. పెదవులు సన్నగా ప్రకంపిస్తున్నాయ్.

చినబాబుకేం చెయ్యాలో తోచడంలేదు. ఆమెకు కాస్త దగ్గరగా జరిగి తలమీద మార్ద వంగా చెయ్యివేశాడు.

"ప్లీజ్... ఏం జరిగిందో చెప్పండి" ఆందో ళనతో తడిసిపోయిందతని స్వరం.

"నాకు నాకు నన్ను" ఆమె ఆయాసప డుతూ అసంకల్పితంగా అతని గుండెలమీద వాలిపోయింది తట్టుకోలేక బాధతో.

చినబాబు కాస్త ఇరిటేటింగా ఫీలయ్యాడు ఆమె స్పర్శను. అంతలోనే అతనిలోని మానవత్వం చెంపమీద ఛెళ్లున చరిచింది. వెంటనే రెండు చేతులూ చాపి పక్కకు ఒరి గిపోతున్న ఆమె తలను సరిగా పట్టుకు న్నాడు.

"తేలు కుట్టిందండీ" పళ్లబిగువున చెప్పే సింది.

గుండె జల్లుమంది చినబాబుకు. కొన్ని రకాల తేళ్లు కుడితే ప్రాణాలు పోతాయని తెలుసతనికి.

ఆమె లుంగలు చుట్టుకుపోతున్న తీరు చూస్తే... కుట్టింది చాలా ప్రమాదకరమైన తేలేనన్పించింది.

వాలిపోతున్న ఆమెను ఎత్తి సోఫామీద పడుకోబెట్టి గబగబా వెళ్లి అబ్బిగాణ్ణి తట్టిలే పాడు. కళ్లు నులుముకుంటూ లేచిన అబ్బి గాడు విషయం విని నిటారుగా అయ్యాడు.

బెడ్‌మీంచి ఒక్కటే దూకు దూకి విరాజి తను పడుకోబెట్టిన సోఫా దగ్గరకు వచ్చాడు.

"బాబాయ్... నుదుటిమీద చెమటలు చూడు! కళ్లు తేలేస్తోంది పిన్ని" ఏడుపు గొంతుతో అన్నాడు.

"వెళ్లి తాతయ్యను లేపు" చెప్పాడు చిన బాబు.

అబ్బిగాడి హడావుడికి తాతయ్యే కాదు. చంద్రకాంతమ్మ, శోభా కూడా లేచేశారు. ఒకరొకరుగా తలుపులు తీసుకుని మిగతా వాళ్లు కూడా హాల్లోకొచ్చారు.

"ఇదేం ఖర్మరా బాబు... పరాయింటి పిల్ల... ఈనాడిలా మనింట్లో. చిన్నా ఎందు కైనా మంచిది. తొందరగా హాస్పిటల్‌కి తీసుకెళ్లు. భగవంతుడా... ఆ పిల్లను కాపాడు తండ్రీ. మా మీదకు ఏ నిందా రానీకయ్యా" చంద్రకాంతమ్మ స్వరంలో భయం, దుఃఖం ముప్పిరిగొన్నాయి.

"ఈ అర్ధరాత్రి ఏ హాస్పిటల్‌కని వెళ్లాలి? " ప్రభావతి అంది వంగి విరాజిత ముఖం లోకి ఓసారి చూసి.

"మన ఫ్యామిలీ డాక్టర్‌కి ఫోన్ చేస్తా" శ్రీధర్ అన్నాడు.

"ఆయన ఫోన్ చేసి దాన్ని ఆయన రిసీవ్ చేసుకుని బయలుదేరి వచ్చేదాకా ఎలా వుంటుందో ఏమిటో" ప్రశాంతి అంది.

"ఓపని చేద్దాం" చినబాబన్నాడు.

"మనమే డాక్టర్ దగ్గరికి తీసికెళ్దాం. అబ్బి గాడికి ఫిట్ వచ్చినప్పుడు కూడా దాదాపు పది దాటింది"

"పాపం పోగానే వీణ్ణి అటెండయ్యాడు"

"సరే... ఏదో ఒకటి చెయ్యండి తొంద రగా" శేషాద్రి తొందర పెట్టాడు.

"స్కూటర్‌మీద కుదరదు. మనిషి వేలబ డిపోతోంది ఆటో కావాలి"

"ఆటోస్టాండ్ ఇక్కడెక్కడుంది? అయినా చూసొస్తా వుండు" శ్రీకాంత్ చెప్పులేసుకోబో తుంటే

"రిక్షా అయినా పర్లేదు" చెప్పాడు చిన బాబు.





శ్రీకాంత్ వెళ్లి అయిదు నిముషాల తర్వాత... ఓ ఆటో తీసుకుని వచ్చాడు.

అప్పటికే విరాజిత దాదాపు స్పృహ కోల్పోయిన స్థితిలో వుంది. ఇక చినబాబు ఏం ఆలోచించలేదు. రెండు చేతుల్లో ఆమె నెత్తుకుని ఆటో సీట్లో పడుకోబెట్టాడు. అందరూ గుమ్మంలో కొచ్చారు.

"అక్కయ్యా వస్తావా? " శోభ నడిగాడు.

"నేనా..." శోభ ప్రభావతివైపు చూసింది 'నువ్వెళ్లకూడదా' అన్నట్టు.

వెంటనే ఆవులించేసింది ప్రభావతి.

సౌభాగ్య అప్పటికే లోపలికి వెళ్లిపోయింది. చినబాబు ఒక్కసారి చురుగ్గా వాళ్ల కేసి చూసి తనే ఎక్కి విరాజిత తలవున్న వైపు కూర్చుని ఆమె తలను ఒళ్లో పెట్టుకున్నాడు. అతని వెనకాలే అబ్బిగాడు ఎక్కేశాడు.

ఆటో కదలబోతుండగా బాగుండదేమోనని శ్రీకాంత్ ముందు సీట్లో ఎక్కి కూర్చున్నాడు.

ఓ పదిహేన్నిముషాల్లో క్లినిక్ ముందాగింది ఆటో.

చినబాబు ఒళ్లో వున్న విరాజిత తలను సున్నితంగా సీటుమీద పెట్టి కిందకు దిగాడు.

క్లినిక్‌ను ఆనుకునే వున్న డాక్టర్ ఇంటికెళ్లి కాలింగ్‌బెల్ నొక్కాడు. రెండు నిముషాలు వెయిట్ చేసినా తలుపు తెరుచుకోలేదు. మళ్లీ నొక్కాడు. మరోసారి ట్రై చెయ్యబోతుండగా డాక్టర్ స్వయంగా తలుపు తీశాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ సర్. పేషెంట్ కండిషన్ చాలా డెలికేట్‌గా వుంది. సో... మిమ్మల్నింత రాత్రివేళ"

"ఇట్సాల్ రైట్ కంప్లెయింటేమిటి? "

"తేలు కుట్టింది సర్. మనిషి స్పృహలో లేదు".

డాక్టర్ ఆటో దగ్గరికి వచ్చి లోపలికి వంగి పేషెంట్ పల్స్ పట్టుకు చూసి తేలిగ్గా నిట్టూర్చాడు.

"లోపలికి తీసుకురండి" చెప్పి లోపలికెళ్లి లోపలున్న క్లినిక్‌లోకి వున్న తలుపు తీశాడు.

ఆటోడ్రైవర్, అబ్బిగాడు సహాయపడుతుండగా చినబాబు విరాజితను ఆటోలోంచి దింపాడు. దింపాక రెండుచేతులమీద కెత్తుకుని క్లినిక్‌లోకి తీసికెళ్లాడు.

చినబాబు ఆమెను బెడ్‌మీద పడుకోబెడుతుండగా డాక్టర్ ప్రిస్క్రిప్షన్ రాసి శ్రీకాంత్‌కి అందిస్తూ చెప్పాడు. "అర్జంట్‌గా ఈ ఇంజక్షన్ కావాలి"

"నేవెళ్లేదా అన్నయ్యా" అడిగాడు చినబాబు.

"వద్దులే నువ్వామె దగ్గరే వుండు" శ్రీకాంత్ వెళ్లిపోయాడు.

అతను వెళ్లిపోయాక చినబాబు డాక్టర్ని అడిగాడు "ప్రమాదం ఏమీలేదుకదాడాక్టర్"

"వెంటనే ఇంజెక్షన్ పడాలి" చెప్పాడు డాక్టర్ దేనికోసమో లోపలికెళుతూ.

"అంటే పరిస్థితి ప్రమాదకరంగా వున్నట్టేగా! ఎలా బాబాయ్" దిగులుగా అన్నాడు అబ్బిగాడు.

చినబాబు విరాజితకేసి జాలిగా చూశాడు.

కళ్లుమూసుకుని అచేతనంగా పడుకుని వుందామె. ఎక్కడ పుట్టిందో... ఎక్కడ పెరిగిందో... తన ఇంటికొచ్చి తన తల్లికి సేవలు చేసి ఇలా ప్రమాదంలో చిక్కి ఏం కాదుకదా?

"కాదు ఏమీకాకూడదు"మనస్ఫూర్తిగా కోరుకున్నాడు. ఎందుకో ఆమె మీద ఎక్కడలేని అభిమానం కలిగింది.

అప్పుడప్పుడూ అలవాటుగా స్పందించే హృదయపు అట్టడుగు పొర ఒక్కసారిగా కదిలింది. ఆ కదలిక క్రమంగా అతని చేతిలోకి పాకింది. మెల్లగా చెయ్యెత్తి ఆమె నుదుటిమీద పడుతున్న ముంగురుల్ని వెనక్కు తోసి తలను అతి మార్దవంగా

నిమిరాడు.

అతని కనుకొలకులోంచి చప్పున రాలిప డిందో కన్నీటి బొట్టు.

చిత్రంగా అంతవరకూ నిశ్చలనంగా వున్న ఆమె కనుదోయి ఒక్క జెర్క్‌తో కదిలింది.

నిశ్శబ్దంగా ముడుచుకుని వున్న ఆమె పెదవులు సనసన్నగా విచ్చుకున్నాయి.

చినబాబు భృకుటి ముడిపడింది. ఆశ్చ ర్యంగా అబ్బిగాడి కేసి చూశాడు. అబ్బిగాడు అక్కడలేడు. తిరిగి అతని చూపులు విరా జిత మీద పడ్డాయి.

అప్పటికి పూర్తిగా కళ్ళు తెరిచేసి అతన్ని చూసి విరాజిత నవ్వుతోంది.

"మీకు... మీకేం కాలేదా!"

"ఎందుక్కాలేదు? అయింది కాబట్టే... ఇక్కడ ఈ బెడ్‌మీద యిలా పడుకుని వున్నాను" కింది పెదవిని మునిపంటితో నొక్కిపట్టి చిలిపిగా చూసింది.

"సరిగ్గా చెప్పండి"

"ఇలాంటివి చెప్పకూడదు. మీరే అర్థం చేసుకోవాలి"

"నాకేం అర్థంకావటంలేదు"

"కాకపోయినా పర్లేదు. కానీ ఒక్కటి మాత్రం నాకర్థమైపోయింది. నన్ను మీరు ప్రేమిస్తున్నారు. కాబట్టే మీకంట నాకోసం ఆ కన్నీటిబొట్టు మెరిసింది"

"విరాజితా!" పళ్ళబిగువున అరిచేశాడు. అప్పటికే అబ్బిగాడితో పాటు ఇవతలకి వస్తున్న డాక్టర్ని చూసి... విరాజిత చివు క్కున లేచి కూర్చుంది.

"కూల్ డౌన్ మై బాయ్... కూల్ డౌన్. ఓ ఆడపిల్ల నీకోసం ఇంత రిస్కుతీసుకుని నాటకం ఆడిందంటే... రియల్లీ యు ఆర్ లక్కీ" డాక్టర్ నిట్టూర్చాడు.

"ఏమిటి డాక్టర్ ఇదంతా? కనీసం మీరైనా చెప్పండి"

"నే చెబుతా విను బాబాయ్. పిన్నిని తేలు కుట్టినట్లు నేనే నాటకం ఆడమన్నాను. ఆమె ప్రమాదంలో వుందంటే... నువ్వెలా రియాక్ట్ అవుతావో చూడాలనుకున్నాను. దాన్నిబట్టి నువ్వామెను ప్రేమిస్తున్నావా లేదా తెల్సుకోవాలనుకున్నాను.

ఆహాహాఁ... అచ్చు సినిమా హీరోలా ఆ చేతుల్లో పిన్నిని ఎత్తుకోవటం.. కంగారు పడిపోతూ హాస్పిటల్‌కి పరిగెత్తటం... ఆ కళ్ళలో కన్నీటి చుక్క మెరవడం... నువ్వు పిన్ని తలను అలా నిమరడం... బాబాయ్ నీ గుండెలమీద చెయ్యేసుకుని నిజం చెప్పు! నువ్వు పిన్నిని ప్రేమించడంలా? "

చినబాబు సమాధానం ఇవ్వకుండా అబ్బి గాడికేసి బ్లాంక్‌గా చూశాడు.

అతని భుజం తట్టి చెప్పాడు డాక్టర్ "ఒప్పేసుకోవయ్యా అబ్బిగాడు పడిన కష్టా నికి ఫలితం దక్కనీ. నిన్న సాయంత్రం నా దగ్గరకు తీసుకొచ్చింది గదా వీళ్ళమ్మ చెకప్ కోసం పాపం అబ్బిగాడి ఫిట్స్ నిజమని నమ్మి! ఆమె గమనించకుండా చెప్పాడు తనాడబోయే రెండో నాటకాన్ని. బాబాయ్ ప్రేమ బయటపెట్టడానికి వాడు తీసుకునే రిస్కుచూస్తూ... జస్ట్ ముచ్చటేసి... నా సహ కారం ఇవ్వడానికి ఒప్పేసుకున్నాననుకో"

చినబాబు అప్పటికీ మాట్లాడలేదు.

"డాక్టరంకుల్ చాలామంచివారు బాబాయ్" చెప్పాడు అబ్బిగాడు

డాక్టర్ ఒక్కక్షణం పొంగిపోయాడు.

చినబాబు ఏదో అనబోయాడు గాని ఇంతలో శ్రీకాంత్ రావడంతో ఆ ప్రయత్నం విరమించాడు.

"ఇంజెక్షన్ దొరకలేదండీ" ఇప్పుడెలా అన్నట్టు చూశాడు శ్రీకాంత్ డాక్టర్‌కేసి.

"ఇక దాంతో పన్లేదు లేవయ్యా. ఓసారి అటుచూడు" డాక్టర్ నవ్వుతూ విరాజితకేసి చూశాడు.

ఇంజెక్షన్ దొరకలేదన్న టెన్షన్‌లో వున్న శ్రీకాంత్ అప్పుడుగాని బెడ్‌మీద కూర్చుని వున్న విరాజితను గమనించలేదు.

"అలా ఫస్ట్ ఎయిడ్ చెయ్యగానే ఇలా లేచి కూర్చుందయ్యా పాపం... అపరాత్రి





వేళ... నిన్ను అనవసరంగా తిప్పాను" డాక్టర్ అన్నాడు.

"ఇక వెళ్దామన్నయ్యా" చినబాబు లేచాడు.

విరాజిత చినబాబుకేసి చూసింది. ఎందుకో అతని ముఖంలోని గంభీరత ఆమెను కలవరబెట్టింది.



విరాజిత ఉదయం లేచిన దగ్గర్నుంచీ చూస్తోంది ఒక్క మాటా మాట్లాడలేదు చిన బాబు. కనీసం కన్నెత్తయినా చూడలేదు.

అతడి సీరియస్‌నెస్‌కి అబ్బిగాడు కూడా కాస్త బెదిరినట్లు కనబడ్డాడు. బుద్ధిగా లేచి... స్కూల్ కి తయారవుతుంటే ప్రశాంతి 'ఇంకో రెండ్రోజులు విశ్రాంతి తీసు కోరా' అని అరుస్తోంది.

విరాజిత కెందుకో దిగులుగా అన్పిం చింది. నిస్సత్తువుగా కూర్చున్న చోటనే వుండిపోయింది: ఆమె, అబ్బిగాడూ కలసి ఆడిన నాటకం చినబాబుకు తప్ప ఇంకెవ రికీ తెలిదా ఇంట్లో. అందుకే చకచక మర బొమ్మలా పనిచేసుకుపోయే విరాజిత అలా కూర్చుని వుంటే అది తేలు కుట్టినందువల్ల కలిగిన నీరసం అనుకున్నారేగాని మరోటను కోలేదు. శోభ గిన్నెలు ఎత్తెత్తివేస్తూ వంట చేస్తోంది.

చంద్రకాంతమ్మ పిలిచి బతిమిలాడినా విరాజిత టిఫిన్ చెయ్యలేదు. చినబాబు ఒంటరిగా దొరికితే 'సారీ' చెప్పేసి యింట్లోంచి వెళ్లిపోవాలన్న నిర్ణయానికి ఎప్పుడో వచ్చేసింది ఆమె. కాని అతను కావాలనే ఆమెకు చిక్కటంలేదు.

తొమ్మిదికల్లా అబ్బిగాడు స్కూలుకీ... చినబాబు బేంక్‌కీ వెళ్లిపోయారు.

మరీ ఒంటరితనం ఫీలయింది విరాజిత కనీసం అబ్బిగాడుకూడా లేకపోయేసరికి.

"చెబితే వినడుకదా! మళ్ళీ ఫిట్ వచ్చి పడి పోతే దిక్కెవరు వాడికి" ప్రశాంతి సణు క్కుంటోంది.

"విరాజితా! కనీసం భోజనమన్నా చెయ్యమ్మా" శేషాద్రి చెప్పాడు.

"వద్దండీ... ఆకల్లేదు" తల దించుకుని చెప్పింది.

"అయితే నాకూ వద్దండీ. ఆ పిల్లేదో మన సులో పెట్టుకుని సాధిస్తున్నట్టుంది చూడ బోతే. లేకుంటే ఇదేం చోద్యం? తేలుకుడితే మాత్రం ఆకలికి ఏమైందట? " చంద్రకాం తమ్మ కేకలేసింది.

"బాగుంది వరస. ఆవిడ తినకపోతే నువ్వూ మానటమేమిటి? ఏదో... వండ మంటే వండానుగాని... ఇలా మనిషి మని షిని బతిమిలాడి తినిపించే ఓపిక మాత్రం నాకు లేదు" శోభ ఖచ్చితంగా చెప్పేసింది.

విరాజిత ఇక సాగదియ్యకుండా లేచివెళ్లి తిన్నానన్పించింది. విశ్రాంతిగా పడుకుని వున్న చంద్రకాంతమ్మ దగ్గరకెళ్ళి చెప్పింది "అమ్మా, సాయంత్రం ట్రైన్‌కి వెళ్లిపోతాను'

"ఎక్కడికి వెళతావమ్మా? నీకిక్కడ బాగా లేదా తల్లీ? "

"లేదమ్మా... వెళ్లాలి" ఇక తన నిర్ణయం మారదన్నంత దృఢంగా చెప్పింది.

చంద్రకాంతమ్మ ఒక్కక్షణం తదేకంగా విరాజిత ముఖంలోకి చూసింది. "నువ్వెం దుకో బాధపడుతున్నావమ్మాయ్"

"అబ్బే... అదేంలేదండీ" కంగారుగా చెప్పింది గాని ఆమె గొంతులో దుఃఖపు జీర కదలాడ్డం చంద్రకాంతమ్మ ఇట్టే గమ నించింది.

అయినా గమనించనట్టే అన్నది "సరే తల్లీ... నీ యిష్టం. ఈరోజు శుక్రవారం. ఆడపిల్లను ఇంటినుంచి పంపించలేం. రేపు వెళుదువ్‌గానీలే"

విరాజిత తలూపి మెల్లగా లేచి అక్కడి నుంచి వచ్చేసింది.

వెళుతున్న విరాజితను అలాగే చూస్తూ రుణానుబంధం... నేటితో తీరిందికాబోలు' అనుకుని గాఢంగా నిట్టూర్చింది చంద్రకాం

తమ్మ.

సాయంత్రం చినబాబు బేంక్ నుండి రాగానే శోభ యిచ్చిన కాఫీ తాగి టెర్రస్‌మీదకు వెళ్ళిపోయాడు. అతని వెనకాలే బయలుదేరాడు అబ్బిగాడు.

అబ్బిగాడు వెళ్ళిన ఐదునిముషాల తర్వాత విరాజిత మెల్లగా మేడ మెట్లెక్కసాగింది. ఇక చినబాబు ఒంటరిగా తనకు దొరకడు గాక దొరకడు. అతనికి క్షమాపణ చెప్పేసి తనదారి తను చూసుకోవడానికి ఇంతకంటే అనువైన సమయం లేదు.

ఆమె మెట్లు పూర్తిగా ఎక్కేసి ఆఖరి మెట్టు మీంచి కాలు టెర్రస్ మీద పెడుతుండగా వినబడిందా మాట.

"అయితే బాబాయ్! నేను పందెంలో గెలిచానంటావా? ఓడానంటావా? "

అడుగు వెనక్కు తీసుకుని... తను కనబడకుండా మరోమెట్టు కిందికి దిగి చెవులు రిక్కించింది విరాజిత.

"పూర్తిగా ఓడిపోయావ్"

"అదెలా బాబాయ్? " ఆశ్చర్యపోయాడు అబ్బిగాడు.

"అదంతే" స్థిరంగా వుంది చినబాబు స్వరం.

"నేనొప్పుకోను. పిన్నిచేత అందరూ వూపిరి సలపని పనిచెయ్యించినపుడు... మండిపడి నువ్వో మాటన్నావ్ గుర్తుందా? "

"ఏమిటి? "

"ఆమె నాక్కావలసిన మనిషి అని అన్లేదూ నువ్వు. పిన్నిమీద ప్రేమ లేకపోతే నీకంత కోపం ఎందుకొస్తుంది? ఆమాట నువ్వెందుకంటావ్? "

"అబ్బీ! సాటిమనిషి కళ్లముందే అన్యాయానికి బలైపోతుంటే... మనిషన్న వాడెవడూ నోర్మూసుకుని వూరుకోడు. ఓ మనిషికి మనిషి ఏమవుతారో... ఆమె నాకదే అవుతుంది. ఆమె స్థానంలో ఇంకెవరున్నా నేనా సమయంలో అలాగే అని వుండేవాడ్ని"

"పోనీ ఇది చెప్పు బాబాయ్... నువ్వు పిన్నిని చేతుల్లో ఎత్తుకుని మొయ్యలేదూ? ప్రేముంటేనే కదా అలా చేస్తారు? "

"నువ్వు ఫిట్ వచ్చినట్టు పడిపోయిన రోజుకూడా నేనలాగే నిన్ను చేతుల్లో ఎత్తుకున్నాగా! అలాంటి సంఘటనే ఇదికూడా! మనిషి చావుబ్రతుకుల్లో, వుందని మానవత్వంతో ఎత్తుకున్నా... అంతే"

"మరి పిన్ని బెడ్‌మీద హాస్పటల్‌లో పడుకుని వున్నప్పుడు నీ కళ్ళలోంచి నీళ్లెందుకొచ్చాయ్? "

చినబాబు ఫక్కుమని నవ్వాడు. పడీపడీ నవ్వాడు. కళ్లలో నీళ్లు తిరిగేదాకా నవ్వాడు. నవ్వి అన్నాడు. "అబ్బీ నాకళ్లలోకి చూడు... కన్నీళ్ళు కనిపిస్తున్నాయ్ కదూ? "

"బాబాయ్!"

"కన్నీళ్ళు చాలా సందర్భాల్లో వస్తాయ్‌రా అబ్బీ. ఇప్పుడు నవ్వితే వచ్చాయా... అలాగే ఏడిస్తే కూడా వస్తాయ్‌రా అబ్బీ... ఇంకా మనకు ఉక్రోషం కలిగినపుడూ... ఎవరిమీదైనా జాలి పడ్డపుడూ కూడా వచ్చేస్తాయ్. నిన్న నాకళ్లలో నీళ్లు... కేవలం జాలితో వచ్చినవి. పాపం... ఇన్నాళ్ళూ... ఇంటెడి చాకిరీ చేసి మనకు సాయపడిందే... ఇప్పుడిలా అయ్యిందే... ఈమె రుణమెలా తీర్చుకోవాలి అన్న కృతజ్ఞతతో వచ్చినవి అంతే గాని..."

చినబాబు మాటల్ని మధ్యలోనే తుంచుతూ అన్నాడు అబ్బిగాడు "ఏమిటో బాబాయ్... నువ్వు చెప్పేది నాకు ఒక్క ముక్కా బుర్రకెక్కడంలేదు"

"ఫర్లేదు గానీ ఒక్కటిమాత్రం ఎక్కిందనుకుంటా... నువ్వు గెలవలేదు ఓడిపోయావ్ చాలా"

ఓ రెండు క్షణాలు అబ్బిగాడు నిశ్శబ్దంగా వుండిపోయాడు.





ఆ నిశ్శబ్దం విరాజిత గుండెల్లో ఓ బ్రహ్మాండమైన విస్ఫోటనాన్ని సృష్టిస్తుంటే... తను 'సారీ' చెప్పాలని వచ్చిన విషయంకూడా మరిచిపోయి వెనుదిరిగిందామె.

ఓ రెండు మెట్లు దిగేశాక వినబడింది అబ్బిగాడి స్వరం "బాబాయ్... నిన్ను చూస్తుంటే... నేను నాలుగోక్లాసులోనో, మూడోక్లాసులోనో చదివిన ఓ పద్యం గుర్తుకొస్తోంది"

ఏమిటది అని అడిగేడేమో విరాజితకు వినబడలేదు గాని అబ్బిగాడు చెబుతున్న పద్యం మాత్రం స్పష్టంగా వినబడుతోంది.

తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరు త్రాగవచ్చు..
తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు..
చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు...

★ ★ ★

ఆ రాత్రి... చంద్రకాంతమ్మేకాదు... శేషాద్రితో సహా బతిమిలాడినా అన్నం ముట్టలేదు విరాజిత. కడుపునొప్పిగా వుంది వద్దంటే వద్దంది. చెప్పిచెప్పి విసిగిపోయి వదిలేశారు.

విరాజితకు నిజంగానే ఆకలనిపించలేదు. మనసు సహకరిస్తే గదా... ఆకలి దప్పుల్లాంటి శారీరక బాధలు తెలిసేవి.

ఎప్పుడూ పడుకునే సోఫా కమ్ బెడ్‌మీద వెల్లకిలా పడుకుని... సీలింగ్‌కేసి చూస్తోంది. పదకొండు దాటుతున్నా నిద్రపట్టడంలేదు. జరిగిన విషయాన్ని తలచుకుంటుంటే ఆమెకు అవమానంగా... తనమీద తనకే అసహ్యంగా వుంది.

తను ఆడిన నాటకం తనకే హాస్యాస్పదంగా... ఎబ్బెట్టుగా చిన్నతనంగా అన్పిస్తోంది.

సహజంగా అతనిలో వుండే మంచితనాన్ని.. తన మీద గల ప్రత్యేక శ్రద్ధని నమ్మింది. స్వతసిద్ధమైన అతనిలోని జాలి గుణాన్ని... తనమీద ప్రేమ అని పొరపాటు పడింది.

తను... తను చాలా చీప్ ట్రిక్ ప్లే చేసింది.

విరాజిత పక్కకు తిరిగి పడుకుంది. జరిగిన విషయాన్ని మనసులోంచి తుడిచివేయాలన్న ప్రయత్నంలో... కందిరీగల్లా లేచే ఆలోచనల్ని తరిమికొడుతూ అంకెలు లెక్కబెట్టసాగింది.

ఒకటి... రెండు... మూడు... పది... ఇరవై... వంద వెళ్ళిపోవాలి... ఉదయాన్నే ఎవరూ నిద్రలేవకముందే వెళ్ళిపోవాలి. నూటపది... నూటనలభై... నూటా నలభై ఒకటి... ముఖ్యంగా చినబాబు కళ్ళబడకుండా అతనులేచేలోపే వెళ్ళిపోవాలి... నూట అరవై... రెండొందలు...

క్రమంగా ఆమె నిద్రాదేవి వశమైంది.

అర్ధరాత్రి దాటి ఒంటిగంట అవుతున్న సమయంలో ఏదో పడినట్టుగా శబ్దమైతే చప్పున కళ్ళు విప్పాడు చినబాబు.

డైరీలో ఏదో రాసేసిందేమో మరి... దాన్ని మూసి లేస్తున్న విరాజిత కనబడింది. ఆమె మెల్లగా కదిలి తన బెడ్‌వైపే రావడం గమనించి... ఏం చేస్తుందో చూద్దామన్న ఉద్దేశ్యంతో...గప్‌చుప్‌గా కళ్ళు మూసుకుని... ఓ కన్నుమాత్రం కొద్దిగా తెరచి చూడసాగాడు.

విరాజిత అతని బెడ్‌కి బాగా దగ్గరగా వచ్చేసి అలాగే నిలబడి నిర్నిమేషంగా అతని ముఖంలోకే చూసింది కాసేపు.

ఆమె కళ్ళలోంచి ఓ కన్నీటిచుక్క జారి... సరిగ్గా చినబాబు నుదుటిమీద వెచ్చగా రాలి పడింది.

కాస్త అనీజీగా కదిలాడుగాని కళ్ళు తెరవలేదు చినబాబు. ఆమె గిరుక్కున వెనుదిరిగి ఓ అడుగువేసి మళ్ళీ ఆగిపోయి అతనివైపు తిరిగింది. అనూహ్యంగా వంగి అతని నుదుటిమీద చటుక్కున ముద్దుపెట్టుకుంది.

ఆమె చెంప ఛెళ్ళుమనిపించాడు చినబాబు.



"సిగ్గులేదూ? అర్ధరాత్రివేళ లేచొచ్చి పరాయి మగాడ్ని ముద్దు పెట్టుకోవడానికి? "

స్వరం తగ్గించినా చాలా తీవ్రంగా అన్నాడు.

చెంపకు చెయ్యి ఆనించుకుని అలాగే చిత్త రువులా నిలబడిపోయింది విరాజిత.

చిత్రంగా ఆమె కళ్లనుంచి ఒక్కనీటి బొట్టుకూడా రాలలేదు. కళ్లు వెడల్పుచేసి అతన్నే చూస్తుండిపోయింది.

"ఏమిటలా చూస్తున్నావ్? ఇంకా నీకు నిద్రలో నడిచే అలవాటుందని నన్ను నమ్మించాలనా? "

ఆమె అప్పటికీ పెదవి విప్పలేదు. ట్రాన్స్‌లో వున్నట్టు ఇంకా అతన్నే చూస్తోంది.

"నువ్వసలు పెళ్లిపీటలమీంచి పారిపోయి వచ్చుండవ్. నాటకాల కంపెనీ మనిషివ య్యుంటావ్"

"బాగా చెప్పావ్. ఇప్పుడే... ఐదునిము షాల క్రితం అమ్మలొచ్చి ఆ పనిపిల్ల బాబాయ్ గదిలోవుందమ్మా. బాబాయ్‌ని ముద్దు పెట్టుకోవడం బాత్‌రూమ్‌కెళుతూ

నా కళ్లారా చూశానూ అంటే నిద్రమత్తుతో వుండి పెద్దగా పట్టించుకోలేదు. అది మళ్ళీ మళ్ళీ చెబుతుంటే లేచొచ్చా అమ్ములు చెప్పింది నిజమేనన్నమాట"

సౌభాగ్య స్వరం విని ఉలిక్కిపడి అటు చూశాడు చినబాబు.

విరాజిత మీద అతనికి చాలాకోపం వచ్చింది కాని దాన్ని అందరి ముందూ ప్రదర్శించాలని మాత్రం అతననుకోలేదు. అందుకే తడబడిపోతూ అన్నాడు సౌభాగ్యతో "ఎబ్బే... ఏం లేదొదినా రేపెళ్లిపోతుందిగా ఈ అమ్మాయ్ చెప్పడానికొస్తేనూ.. ఈ వేళప్పుడేమిటి... పొద్దున్నే చెప్పొచ్చుగా అంటున్నా"

"ఆహా... అలాగా అయితే ఇది ఇద్దరూ కలిసి ఆడే నాటకమన్నమాట. మీ ముద్దులూ ముచ్చట్లూ అమ్ములు చూడ్డం, గమనించేసి... ఇలా సీన్లు సృష్టించి... ఆవిడ్ని తిడుతున్నట్టు ఫోజులు కొడుతున్నావన్నమాట. మరిదిగారూ! ఏం తెలివి తేటలయ్యా... అమోఘం. అయినా మనలో మాట.. ఇలా పనివాళ్లతో... పనికిమాలిన వాళ్లతో గ్రంధం సాగించే బదులు శుభ్రంగా పెళ్లిచేసుకోరాదూ!"

సౌభాగ్య స్వరం సహజంగానే కాస్త పెద్దది. చిన్నగా చెప్పాల్సిన విషయాల్నే పెద్దగా చెప్పే ఆమె... ఈ పెద్ద విషయాన్ని ఇంకాస్త పెద్దగా అనేసింది.

అనేసింది అనేదానికన్నా అరిచేసింది అంటే బాగుంటుంది. ఇంకా ఎఫెక్టివ్‌గా చెప్పాలంటే... ఇంటిల్లిపాదీ నిద్రలు లేచి అక్కడ సమావేశమయ్యేలా చేసింది.

అందరి మధ్యా బిక్కచచ్చిపోయి నిలబడి వున్నాడు చినబాబు. విరాజిత మీద కలిగిన సాధారణమైన కోపం... ఈసంఘటనతో తారాస్థాయికి చేరిందతనిలో.

"ఆ మనిషిని మొదటిసారి చూసినపుడే చెప్పా వదినా... మా అమ్మకు నేను.. ఇలాంటి వాళ్ళను నమ్మకూడదూ అని. కాకపోతే, ఏ దొంగతనానికో వచ్చిందనుకున్నా గాని... ఇలా చిన్నాకే వల వెయ్యడానికొచ్చిందని వూహించలేదు"

విరాజిత పూర్తిగా తల వంచుకుని వుండటంవల్ల ఆమె కళ్లలోంచి అవిరామంగా కురుస్తున్న కన్నీరు... ఎవరికీ కనబడ్డం లేదు...

ఎక్కడ్నించి ఉద్భవించాయో... అక్కడికే ఆ గుండెల్లోకే ఇంకిపోతున్నాయవి.

"నిన్న అందరి గదుల్లో దూరి పనులు చేసిందిగా.. నగానట్రా భద్రంగా వున్నాయో లేదో చూసుకోండి" ప్రభావతి అందరికీ సలహా ఇచ్చినట్టుగా చెప్పింది.

శోభ హడావుడిగా లోపలికి వెళ్లి అంతే హడావుడిగా వచ్చింది.

"రాత్రి స్నానం చేస్తూ నా గాజులు తీసి అద్దం ముందు పెట్టా కనిపించడంలేదు"

"పోలీసుల్ని పిలుద్దామా? " శ్రీధర్ శ్రీనివాస్‌తో అన్నాడు.

"అదే బెస్ట్" శ్రీనివాస్ ఒప్పుకున్నాడు.

"శోభా! నీ గాజులెక్కడికీ పోలేదులే. నువ్ టేబుల్ మీద పడేసి నిద్రపోతుంటే నేనే తీసి భద్రంచేశా" ప్రశాంతి కల్పించుకుని చెప్పింది.

శేషాద్రి మాత్రం ఒక్కమాటా మాట్లాడలేదు. జరిగింది ఇదీ అంటే నమ్మబుద్ధికావటం లేదాయనకు.

"ఆవిడ బంగారం కోసం కాదులే వచ్చింది. బంగారంలాంటి చినబాబుని కొంగుకు ముడేసుకుందామని, ఓ గాజో, దండో పట్టుకుపోతే ఏమొస్తుందీ... ఇక్కడ తిష్టేస్తే కదా ఆస్తీ అంతస్తూ దక్కేది" గాజులు దొరికాయన్న అసంతృప్తితో కొత్త థియరీ చెప్పింది శోభ.

"ఒక వ్యక్తిని గురించి పూర్తిగా తెలియకుండా అలా మాట్లాడకు శోభా" ప్రశాంతి కోప్పడింది.

చినబాబుకి ఈ పరిస్థితి ఎందుకో ప్రాణసంకటంగా అన్పించింది. అతనేదో విరాజి





తను నాటకమాడిందన్న కోపంతో వ్యక్తిగ తంగా ద్వేషించాడుగాని... ఇదిలా పబ్లిక్ ఇష్యూ అవుతుందనుకోలేదు.

అందుకే అందర్నీ అర్థింపుగా చూస్తూ అన్నాడు. "ప్లీజ్ ఆమె ఎలా వచ్చిందో అలా వెళ్లనివ్వండి. తనవల్ల మనకేం నష్టం జరగ లేదు. అదిమాత్రం నిజం. ఇక ఈ గొడవ ఇంతటితో ఆపెయ్యండి"

చినబాబు నోటివెంట ఆ మాటలు రాగానే అంతవరకూ మౌనిలా తల వంచు కుని రాతిబొమ్మలా నిలబడిన విరాజిత మెల్లగా తలెత్తింది.

ఎవరి ఉనికినీ పట్టించుకోకుండా అతన్నే సూటిగా చూస్తూ చెప్పింది, "మీరు చాలా మంచి వారండీ. నాలాంటి మనిషిని ఇంత మానవత్వం ప్రదర్శించి మన్నించిన మిమ్మల్ని ఎప్పటికీ మరిచిపోను. కీపిటప్"

ఆమె గిరుక్కున వెనుదిరిగి... గదిలోంచి రాలేక మంచంమీదే కూర్చుని జరిగేదంతా చూస్తున్న చంద్రకాంతమ్మకు సమీపంగా వెళ్లింది.

"వెళ్లొస్తానమ్మా" వంగి ఆమె పాదాల్ని తాకింది.

అంతవరకు జరిగేదాన్ని చూస్తూ శేషాద్రి లాగే నోరు మెదపకుండా వున్న చంద్రకాం తమ్మ అప్పుడన్నది "బిడ్డలా చూసుకు న్నాను. తిన్నింటి వాసాలు లెక్కబెట్టాలను కున్నావా విరాజితా? "

అందరూ చుట్టూచేరి అన్నేసి మాటలం టున్నా చలించకుండా బండబారిన విరాజిత గుండె అప్పుడు కలుక్కుమంది.

చంద్రకాంతమ్మ పాదాలను స్పృశిస్తున్న తన తలనెత్తి ఒక్కసారి ఆమె కళ్లలోకి చూసి వెనుదిరిగింది.

★ ★ ★

ఎనిమిది దాటుతున్నా నిద్రలేవకుండా అలాగే బోర్లా పడుకుని వున్న చినబాబును తట్టిలేపాడు అబ్బిగాడు. "బాబాయ్... నీకోసం హరేరామ్ అంకుల్ వచ్చారు"

చినబాబు లేచి లుంగీ సరిగా కట్టుకుని వాష్‌బేసిన్ దగ్గరకెళ్లి ముఖం చల్లటి నీళ్లతో కడుక్కుని హాల్లోకొచ్చాడు.

హరేరామ్ ఒక్కడే కాదు... అతని మిసెస్ పారిజాతం కూడా వచ్చివుంది. ఇద్దరూ సోఫాలో కూర్చుని వున్నారు.

"రావోయ్... రా..: ఏమిటి ఎనిమిదైనా ఇంకా నిద్రే!" పలకరించాడు హరేరామ్.

"రాత్రి నిద్రలేదు లేరా. మెలుకువ రాలేదు" చెప్పాడు చినబాబు వాళ్లకెదురుగా కూర్చుంటూ.

గదిలోంచి శోభ తొంగి చూస్తుంటే చెప్పాడు చినబాబు.

"రా అక్కయ్యా! హరేరామ్ తెలుసుగా నా ఫ్రెండ్. ఈమె... వాడి మిసెస్ పారి జాతం"

శోభ నమస్తే అంటూ ఇవతలికొచ్చింది. పారిజాతం ప్రతి నమస్కారం చేసి లేచి నిలబడి వెండి కుంకుమభరిణె తెరిచి శోభ ముఖాన బొట్టుపెడుతూ చెప్పింది "రేపు మా మేరేజ్ యానివర్సరీ అండీ! చినబా బుతో కలిసి తప్పక రండి"

"ఎన్నోది? " శోభ నవ్వుతూ అడిగింది.

"ఎన్నో ఎక్కడమ్మా! మొదటిదే" చెప్పాడు హరేరామ్.

"అన్నయ్యా... మీ వదినెగార్లు" అర్థోక్తిలో ఆపింది పారిజాతం.

శోభ ముగ్గురు వదినెల్నీ పిల్చుకొచ్చింది. అందరికీ తనే పారిజాతాన్ని పరిచయం చేసింది. పారిజాతం అందరి నుదుటా కుంకుమ • పెట్టి తన వెడ్డింగ్‌డేకి ఆహ్వానిం చింది.

"అవునూ... ఆ అమ్మాయేదిరా? " అడి గాడు హరేరామ్... విరాజితను గుర్తు తెచ్చుకుంటూ.

"రాత్రే వూరెళ్లిపోయిందిరా" చెప్పాడు చినబాబు. అలా చెబుతున్నపుడు ఎందుకో

తన స్వరం తనకే ఎబ్బెట్టుగా వున్నట్టనిపించింది.

ఉన్నట్టుండి అంది పారిజాతం "ఏమండోయ్ చెప్పడం మరిచాను. ఉదయం మా అమ్మానాన్న వస్తున్నారని రిసీవ్ చేసుకోడానికి నేనూ, విజయభారతీ రైల్వేస్టేషన్ కెళ్లాంకదూ! అక్కడ చూశానండీ ఆ రాత్రి చినబాబుతోపాటు మనింటికొచ్చిన ఆ పిల్లను"

"ఏ ట్రైనెక్కిందో గమనించారా" అడగాలనుకున్నాడుగాని గొంతు సహకరించలేదు చినబాబుకు.

కానీ అతని సందేహాన్ని తీరుస్తున్నట్టుగా చెప్పింది పారిజాతం. "అన్నయ్యా! ఆ రోజు ఇద్దరెవరో వెంబడిస్తున్నారని కదూ ఆ అమ్మాయిని నువ్ మా ఇంటికి తీసుకొచ్చావ్. బహుశా ఆ యిద్దరే కాబోలు రైల్వే స్టేషన్‌లో నిలబడి వచ్చేపోయే వాళ్లకు ఓ ఫోటో చూపించి "ఈ ఫోటోలోని అమ్మాయిని ఎక్కడైనా చూశారా" అనడుగుతూ కనబడ్డారు. మమ్మల్ని కూడా వచ్చి అడిగారన్నయ్యా. నేను వారించేలోగానే విజయభారతి గబుక్కున అటువైపు తిరిగి కూర్చుని వున్న ఆ పిల్లను చూపించేసింది వాళ్లకు. తరువాత నేను చాలా బాధపడ్డాననుకో విజయభారతిని బాగా తిట్టేశాను కూడా"

చినబాబు మనసు చివుక్కుమంది.

"వాళ్లు... వాళ్లామెను తీసుకెళ్లిపోయారా? "

"ఆc... మేం చూస్తుండగానే ట్రైనెక్కేశారు వాళ్లు ఆమెతోపాటూ"

"వెళ్లొస్తాంరా. ఇంటిల్లిపాదీ రావాలి ఫంక్షన్‌కి" హరేరామ్ లేచాడు.

వెళ్లేముందు భార్యాభర్తలిద్దరూ చంద్రకాంతమ్మను పరామర్శించి అందరికీ పేరుపేరునా చెప్పి వెళ్లిపోయారు.

సోఫాలో అలాగే రాటలా కూర్చుండిపోయాడు చినబాబు.

తను తను తొందరపడ్డాడా? విరాజిత తనకేం ద్రోహం చేసింది?. ప్రేమించడానికి ప్రయత్నించింది. అంతేగా! దానికి బదులుగా తను ఆమె జీవితాన్ని బలి తీసుకున్నాడు?

చాలా సేపు అలాగే స్తబ్ధుగా వుండిపోయాక గుర్తుకొచ్చింది రాత్రి చివరిసారిగా విరాజిత తన డైరీలో రాసిన పేజీని తను చదవనే లేదన్న విషయం

వెళ్లి డైరీ తెరిచాడు.



"మీ గుండెల్లో చీకటి పడిందని ఎవరో చెబితే... దీపం వెలిగిద్దామని వచ్చాను. చీకటికదా! కళ్లకేం కనబడక దీపం వెలిగించలేకపోగా... నా చెయ్యి నేనే కాల్చుకున్నాను.

బాధ చాలా ఎక్కువగానే వుంది. భరించలేక వెళ్లిపోతున్నా.

కానీ ఒక్కమాట.. నేనుగా మీ ఇంటికి రాలేదు. మీ కుటుంబంలోని ఓ వ్యక్తిచేత తీసుకురాబడ్డాను. మీరు పెళ్లిపట్ల విముఖత చూపిస్తున్నారని, మీ మనసును మార్చమనీ నన్ను అభ్యర్థిస్తేనే ఈ ఇంటికి వచ్చాను.

బహుశా ఏ ఆడపిల్లా ఇలాంటి సాహసం చెయ్యదేమో! అయినా నేను చేశానంటే నాకు తగిన కారణాలు నాకున్నాయ్.

ఆరోజు అర్ధరాత్రి పీటలమీంచి పారిపోయి వచ్చిన పెళ్లికూతురిగా వచ్చి మీ





ఇంటి తలుపు తట్టడంలో నా వేషం మాత్రం అబద్ధం... పరిస్థితులు మాత్రం నూరుశాతం నిజం.

అర్థం కాలేదనుకుంటా. నాకు మారుతల్లి ఉండటం తండ్రి ఈమధ్యే పోవడం... నన్ను ఓ ముసలాడికిచ్చి కట్టబెట్టాలని మా పిన్ని ప్రయత్నించడం... ఇవన్నీ పచ్చిని జాలు.

ఆ వృద్ధుడి దగ్గర మా పిన్ని ఓ లక్ష రూపాయలు పుచ్చుకుంది. దానితో నా చెల్లెలు అంటే ఆమె సొంత కూతురి పెళ్లి ఘనంగా చేసేసింది. ఆ డబ్బును ఆమె కట్నంకింద అల్లుడికి ఇచ్చేసింది.

ఈ విషయాలన్నీ నా చెల్లెలు పెళ్లయిపోయాక గాని నాకు తెలీలేదు. కావాలనే నానుంచి దాన్ని రహస్యంగా దాచింది మా పిన్ని. పెళ్లయిన ఓ వారానికల్లా నన్ను ప్రేమగా దగ్గరకు పిలిచి అభిమానంగా పక్కన కూర్చోబెట్టుకుని అసలు విషయం చెప్పింది మా పిన్ని.

ఆ షావుకారు దగ్గర లక్షా పుచ్చుకుని చెల్లెలు పెళ్లి చేసింది గనుక ఇప్పుడు తనా వృద్ధుడితో పెళ్లికి ఒప్పుకోకపోతే నా చెల్లెల్ని ఆమె భర్త వదిలేస్తాడట.

నీటముంచినా పాలముంచినా నీదే భారం. నీది వెన్నలాంటి మనసు. చెల్లెలి బతుకు అన్యాయం చెయ్యకు... అంటూ నా చేతులు పట్టుకుని ఇవి చేతులు కావు కాళ్లంటూ భోరున ఏడ్చింది.

నేనుగాని ఆ ముసలాడితో పెళ్లికి ఒప్పుకుంటే లక్షల ఆస్తి నా సొంతమవుతుందట. ఆ ముసలాడు పక్షవాతంతో తీసుకుంటున్నాడు, ఓ సంవత్సరం తిరిగేసరికల్లా హరీ మంటాడు, ఆనక నువ్వు ఓ మంచి కుర్రాణ్ణి చూసి చేసుకుని ఆ ఆస్తిని దర్జాగా అనుభవించవచ్చు. మా పిన్ని తమ్ముడు నాగరాజు. నువ్వు విధవ్వనీ ఎవరూ చేసుకోరేమో అని దిగులు పడాల్సిన పనిలేదు. ముసలాడు చచ్చీ చావగానే చావకపోతే చంపయినా సరే నేన్నిన్ను పెళ్లి చేసుకుని సుఖపెడతాను, అని చేతిలో చెయ్యేసి మరీ మాట కూడా ఇచ్చేశాడు. అంటే నా పెళ్లి, వైధవ్యం... అన్నీ వాళ్లే నిర్ణయించేశారన్న మాట. పనిలో పనిగా మా చెల్లెల్ని అదే మా పిన్ని కూతుర్ని కూడా రప్పించి ఆమె చేత కూడా అక్కా చిన్నప్పటినుంచీ నన్నెంతో అభిమానంగా చూస్తున్నావ్. ఇప్పుడు నా భర్తకు నన్ను దూరం చెయ్యకు. నువ్వు త్యాగమూర్తివని తెలిసే అమ్మ ఏ దారీ లేక ఇలా చేసిందక్కా' అన్న బరువైన డైలాగులు చెప్పించారు.

మా చెల్లెలన్నట్లు నేను త్యాగశీలినో కాదో నాకు తెలీదు గాని... మరీ ఇంత త్యాగం చెయ్యలేనన్పించింది. మా పిన్ని వూహించినట్టు నేను చాలా మంచి దాన్నేమోగాని మరీ వృద్ధుడ్నీ... పక్షవాతరోగినీ కట్టుకునేంత మంచితనం నాలో లేకపోయినా పర్లేదన్పించింది. అందుకే నిశ్చయ తాంబూలాలదాకా వచ్చిన పెళ్లిని పీటలదాకా రానివ్వకూడదని నిర్ణయించుకున్నాను. ఒప్పుకున్నట్టే నటించి ఓ రోజు రాత్రి హైదరాబాద్ వెళ్లే ట్రైనెక్కేశాను. మా పిన్ని పెట్టే బాధలు చూడలేక మానాన్న అక్కడే హాస్టల్లో వుంచి డిగ్రీ చదివించారు. అప్పుడు పరిచయమైంది శ్రావ్య నాకు. మూడేళ్ల స్నేహం మాది. ఆమె డిగ్రీలో నా క్లాస్ మేటేకాదు త్వరలోనే నా హార్ట్‌మేట్ కూడా అయింది. నా కష్టాలన్నీ ఆమెకు చెప్పుకుని స్వాంతన పొందేదాన్ని. తను డే స్కాలర్ కావటంతో ప్రతి ఆదివారం హాస్టల్ నుండి వాళ్ల ఇంటికి వెళ్లి గడిపేదాన్ని. మూడు సంవత్సరాలూ మూడు క్షణాల్లో గడిచిపోయాయి. డిగ్రీ ఫైనలియర్ ఎగ్జామ్స్ రాసి ఇంటికెళ్లాను. ఆ హాలిడేస్‌లోనే మా నాన్న పోవటం జరిగింది. ఇక ఇల్లే బంధిఖానా అయింది నాకు. ఎలాగో బతుకు నెట్టేస్తుంటే... మరీ మా పిన్ని ఉరిశిక్షలా ఆ పెళ్లి శిక్ష విధించబోయేసరికి... దారీతెన్నూ తోచక శ్రావ్యను వెతుక్కుంటూ వెళ్లాను.

అంత పెద్ద నగరంలో వాళ్ల నాన్న రికమండేషన్‌తో తనేదైనా ఉద్యోగం ఇప్పించకపోదన్న నమ్మకంతో నా నమ్మకం వమ్ముకాలేదు. నన్ను సహృదయంతో ఆదరించారు వాళ్లు. నేనక్కడకు .వెళ్లిన రెండోరోజనుకుంటా... మీ చిన్న వదిన ప్రశాంతి మీ చిన్నన్నయ్యా వచ్చారక్కడికి. ఆమె శ్రావ్య పెద్దక్కయ్య. నాకంతకుముందే తెలుసామె. పలకరించింది. నాకథ విని కరిగిపోయింది.

బహుశా శ్రావ్యా, ఆమే కలసి నా గురించి తీవ్రంగా ఆలోచించారనుకుంటా. రెండు రోజుల తరువాత నన్ను పిలిచి చెప్పారు మీ వదినగారు. 'విరాజితా! చినబాబని నాకో మరిదున్నాడు. మనసు బంగారం. కానీ... పెళ్లి మాత్రం వద్దని మొండికేస్తూ బతుకు మోడు చేసుకుంటున్నాడు. దానికి కారణమేం లేదు. ఇంట్లో ఆడవాళ్ల ప్రవర్తనే. వదినెలు రాగానే తన అన్నలు మారిపోవడం, ఇంట్లోనే చీలిక లేర్పడడం, ఓ కప్పుకింద కలసి వుంటూనే విడిగా బ్రతకడం... ఇవన్నీ అతని మనసును బాగా బాధించాయనుకుంటా. నేను వాళ్లన్నయ్యను ప్రేమించి పెళ్లిచేసుకోవడం వల్ల ఇంట్లో కొన్నాళ్లు కలతలు రేగి... బయట కాపురంపెట్టి నానా గందరగోళం అయిందిలే. చివరికి మా అత్తా మామలు ఇంట్లోకి పిలిచారనుకో మమ్మల్ని. అయినా ఈ రిస్కులన్నీ చినబాబు మనసుమీద గాఢమైన ముద్రవేసి, తను పెళ్లిచేసుకుంటే అన్నయ్యలాగే తన భార్య తనను తల్లితండ్రుల నుంచి విడదీస్తుందేమో అన్న భయం ఏర్పడింది అతనిలో. 'పెళ్లి' అనేమాటే ఓ ఫియర్ కాంప్లెక్స్‌ని క్రియేట్ చేసిందతనిలో మా శ్రావ్య ఫ్రెండుగా నువ్వేమిటో నాకు బాగా తెలుసు. నువ్వు గనక ఆ ఇంట్లో ప్రవేశించి నీ చాకచక్యంతో ఆడవాళ్లంటే అతనికుండే దురభిప్రాయాన్ని పోగొట్టగలిగితే, అతన్ని నీకిచ్చి పెళ్లి చేసే పూచీ నాది. దీనివల్ల నీ జీవితం ఓ ఒడ్డున పడటంతోపాటు మరొకరి జీవితంలోకి వసంతాన్ని తెచ్చిన దానివవుతావ్. అసలు మా శ్రావ్యనే ప్రయోగించేదాన్ని. కాని నాది లౌ మేరేజ్ కాబట్టి మాకూ వాళ్లకూ సత్సంబంధాలు అంతగా లేవు.పైగా దీనికి చినబాబంటే ఇంట్రెస్ట్‌లేదు" అంది శ్రావ్య ఓ రెండు రోజులపాటు నా బ్రెయిన్ వాష్ చేసింది. ధైర్యాన్ని నూరిపోసింది. జస్ట్ వెళ్లి చూడు. నీకు నచ్చకపోతే వచ్చెయ్! అని ఛాయిస్ కూడా ప్రపోజ్ చేసింది.

ఇవేవీ నా నిర్ణయంలో మార్పును తీసుకురాలేకపోయాయి. గాని చివరికి మీ చిన్నన్నయ్యగారు కూడా 'నువ్ ప్రొసీడ్ అయిపోమ్మా! మిగతాది నేను చూసుకుంటా' అనేసరికి కాదనలేకపోయా. దేవుడు నా జీవితంతో ఆడే నాటకంలో ఇదో ఘట్టమేమో అని మనసును సరిపెట్టుకున్నా.

అందరూ ఆలోచించి నాకు పెళ్లికూతురి వేషం వేశారు. తరువాత మీ వదినె, అన్నయ్యా, శ్రావ్య స్వయంగా నన్ను మీ వూరు తీసుకొచ్చి మీ గుమ్మంలో వదిలేసి గప్‌చిప్‌గా వెళ్లిపోయారు. ఆ తరువాత కథ మీకు తెలిసిందే.

కానీ మీకుగానీ నన్నిక్కడ ప్రవేశపెట్టిన మీ వాళ్లకుగానీ తెలియని నాకు మాత్రమే తెలిసిన ఓ రహస్యాన్ని మీకు చెబుతున్నాను.

ఏ క్షణంలో మీ ఇంట్లో ప్రవేశించి మిమ్మల్ని, మీ అమ్మగార్నీ చూశానోగాని ఆ క్షణమే నాకు మీ మీద అనిర్వచనీయమైన గౌరవం కలిగింది.

మొదటిసారిగా మీరు నాతో మాట్లాడిన ఆ క్షణం ఏ ప్రకంపనాల్ని నా గుండెల్లో సృష్టించిందో నాకు తెలీదుగాని మీతో నాకేదో గత జన్మబంధం వున్నట్టనిపించింది.

'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అంటే అదేనేమో?





ఇక ఎటువంటి పరిస్థితుల్లో మీ ఇల్లు వదిలి పోకూడదనుకున్నాను. కానీ వాళ్లు చెప్పినట్టు కేవలం మామూలు సేవలతో మీ మనసు దోచుకోలేకపోతే అన్న భయం పట్టుకుంది. అందుకే తీవ్రంగా ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చాను.

మిమ్మల్ని స్పృశించీ... బండబారిన మీ హృదయంలో గిలిగింతలు పుట్టించాలనుకు న్నాను. మీ డైరీ పేజీల్లో నా హృదయాన్ని పరిచి బదులుగా మీ హృదయాన్ని అడగా లనుకున్నాను.

ఇది మాత్రం మా ప్లాన్‌లో భాగంకాదు. మిమ్మల్ని చూశాక నాలో కలిగిన ప్రేమకు సంకేతం మాత్రమే. నీలాకాశమంత స్వచ్ఛంగా సూర్యచంద్రులున్నంత సత్యంగా నా హృదయంలోంచి పుట్టిన అభిమానం, అనురాగం అది.

అబ్బిగాడు వాడి పాత్ర వాడు నటించి నాటకం రక్తికట్టించాలనుకున్నాడు. చివరికి అబ్బిగాడే కాదు అందరం ఓడిపోయాం. ముఖ్యంగా నా హృదయం ఘోర పరాజ యాన్ని పొందింది.

అందుకే వెళ్లిపోతున్నా. మా పిన్ని చెప్పి నట్టు చెయ్యటానికి నాకిప్పుడు బాధలేదు. ఎందుకంటే మీరు తిరస్కరించినా నా మనసు మిమ్మల్ని వదిలి రానంది కాబట్టి. నాలో మిగిలింది కేవలం శరీరం. ఆలోచిం చడానికి, దిగులు పడ్డానికి మనసులేదు.

ప్రేమికురాలిగా ఓడిపోయినా కనీసం త్యాగమూర్తిగానైనా గెలుస్తాను. నన్నస హ్యించుకునే మీలో ఎలాగూ అనురాగాన్ని పుట్టించలేను కాబట్టి నా మీద ఆశలు పెట్టు కున్న వాళ్లకి అది దురాశని తెలిసినా సరే ఆనందాన్ని మిగులుస్తాను.

అన్నట్టు మీరు చాలా చాలా నికార్సయిన బ్రహ్మచారి. కంగ్రాచ్యులేషన్స్- విరాజిత

★ ★ ★

"పరిస్థితులకు భయపడి అభద్రతా భావంతో పారిపోయి వచ్చిన నిర్భాగ్యురా లామె. నీకు మేమున్నాం, నీ జీవితానికో భద్రత కల్పిస్తాం అని భరోసా ఇస్తే మన స్ఫూర్తిగా మమ్మల్ని నమ్మింది. ఆ నమ్మకం తోనే ఒక ఆడపిల్లగా చేయకూడని సాహసం చేసి ఈ ఇంట్లో కాలు పెట్టింది. అనుకు న్నది సాధించలేక పాత జీవితమే మేలని నిరాశతో తిరిగి వెళ్లిపోయింది. దట్సాల్... ఇందులో ఆమె తప్పేం లేదు. ఏదైనా వుందీ అంటే అది మాదే"

శ్రీకాంత్ తను చెప్పాల్సింది చెప్పాడు.

"మాతో కూడా ఓ మాట అని వుండా ల్సింది. మా వంతు సాయం మేమూ చేసుండే వాళ్లం. చిన్నా ఓ ఇంటి వాడవుతా డంటే మాకు మాత్రం ఆనందం కాదూ!" ఆ ఇంటి పెద్దకోడలు సౌభాగ్య అంది.

"అది కాదక్కయ్యా! ఇది మేం ముందుగా అనుకున్నది కాదుకదా! మామూలుగా వూరి కనే కదా వెళ్లాం. విరాజిత అక్కడికి రావడం... మాకీ ఆలోచన కలగడం అంతా కాకతాళీయం. ఒకవేళ ఆ సమయంలో మీరు అందుబాటులో వున్నట్టయితే చెప్పే వాళ్లమేమో! సెలవులని ఎటువాళ్లు అటెళ్లా రుగా"

"ఇంటి యజమాని నాన్నకు చెప్పారుగా సౌభాగ్యా! ఇదంతా ఆయన అనుమతితోనే జరిగింది. సో ఇందులో మనం ఇక ఫీల వ్వాల్సిన అవసరంలేదు" శ్రీధర్ భార్యతో అన్నాడు.

"అది కాదులెండి. ఆ అమ్మాయి మా తోడి కోడలని తెలీక కాస్త రూడ్‌గా మాట్లాడాం కదా! అదీ అక్కయ్య బాధ" ప్రభావతి బావ గారితో అంది.

"మరే... ఆ పిల్ల చిన్నాకి కాబోయే పెళ్లాం అని తెలిసుంటే నేనూ నెత్తిన పెట్టు కునేదాన్ని" శోభ పశ్చాత్తాప పడుతున్న ట్టుగా అంది.

"మీకూ తెలుసుకదా! అలా బెల్లంకొట్టిన రాయిలా వుండక పోతే నా చెవినా ఓ



మాటెయ్యకూడదూ! అంతేలెండి ఇన్నేళ్ల కాపురంలో మనసు విప్పి ఏం చెప్పారు గనుక నాకు! కళ్లముందే కాబోయే కోడలి పిల్ల తిరుగుతుంటే కబోదిలా వుండిపోయాను" మంచంమీదే దిండ్లకు ఆనుకుని కూర్చున్న చంద్రకాంతమ్మ శేషాద్రివైపు ఉక్రోషంగా చూసి కళ్లొత్తుకుంది.

"అబ్బా తెలీకపోయినా బాగానే చూసుకున్నావుగదే! ఆడవాళ్ల నోట్లో నువ్వుగింజ నానదని అందరికీ తెలిసిందేగదా! అందుకే విషయం తెలిస్తే రసాభాస అవుతుందని రహస్యంగా వుంచా. అంతేగాని కాబోయే అత్తవు నిన్ను కించపరచాలని కాదు"

ఈ సంభాషణ వింటున్న చినబాబు ఇక ఆగలేకపోయాడు.

"అసలేమిటి నాన్నా... మీ అందరి వుద్దేశ్యం? ఒకరేమో కాబోయే తోడికోడలంటారు! ఇంకోరు కాబోయే పెళ్లామంటారు! నా ప్రమేయం లేకుండా మీ నిర్ణయాలు మీరు తీసేసుకోడమేనా? నాకంటూ ఓ మనసూ వ్యక్తిత్వం ఏమీ లేవనేనా? నాకు పెళ్లంటే ఇష్టంలేదని ఇంట్లో అందరికీ తెలుసు. తెలిసి కూడా ఇలా నాటకాలాడ్డం నాకేం నచ్చలేదు"

"నీకు నచ్చదనేగా... ఇంతకాలం ఈ విషయం తెలీకుండా దాచాం. నీ వ్యక్తిత్వం, నీకో గౌరవం, నీ మనసుకో విలువా ఇవ్వబట్టే పబ్లిగ్గా నీతో నిజం చెప్పి ఒప్పించలేక కనీసం ఓ నాటకం ఆడి నిన్ను మార్చాలని ప్రయత్నించాం. మా ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరైంది" ఆవేశంగా అన్నాడు శ్రీకాంత్.

అంతకన్నా ఆవేశంగా చెప్పాడు చినబాబు "మీరు కష్టపడి రిస్క్ తీసుకుని నాకోసం ఏ ప్రయత్నాలు చేయనక్కర్లేదు. జీవితంలో నేను పెళ్లి చేసుకునే ప్రశ్నేలేదు"

"చిన్నా" ఎప్పుడూ శాంతి మహా సముద్రంలా వుండే శేషాద్రి ముఖంలో కల్లోలం స్పష్టంగా కనబడింది "ఎందుకనిరా చేసుకోవు పెళ్లి? పెళ్లి చేసుకుని వీళ్లంతా పోగొట్టుకున్నది ఏమిటి? చేసుకోకుండా నువ్వు పొందేదీ ఏమిట్రా? "

చిన్న ఒక్క క్షణంపాటు తండ్రి కళ్లలోకి లోతుగా చూశాడు. క్రమంగా అతని చూపులు చంద్రకాంతమ్మ మీదకు మళ్లాయి. చివరిగా అక్కడ కూర్చున్న అందర్నీ ఓసారి చూసి చెప్పాడు.

"పెళ్లి చేసుకుని వీళ్లంతా పోగొట్టుకున్నది మిమ్మల్నే! నేను చేసుకుంటే ఓ ఇంటివాణ్ణి కావల్సి వస్తుందిగాని ఈ ఇంటి వాడిగా మాత్రం మిగలను"

చినబాబు తలవంచుకుని వడివడిగా అక్కడ్నించి వెళ్లిపోయాడు.

చీమచిటుక్కుమన్నా వినపడేంత నిశ్శబ్దం పేరుకుందక్కడ. ఓ అయిదు నిముషాల పాటు ఎవరికివారు మౌనంగా వుండిపోయి ఒక్కొక్కరుగా వెళ్లిపోయారు.

ఓ అరగంట పాటు బెడ్‌మీద అటూ ఇటూ అనీజీగా దొర్లాడు చినబాబు. మధ్యలో అమ్మలొచ్చి కాఫీ ఇచ్చి వెళ్లింది. పొగలుకక్కే కాఫీ కప్పును పెదవులకానించుకోబోతుంటే చటుక్కున గుర్తుకొచ్చింది విరాజిత.

"బ్రహ్మచారులు కాఫీలు, టీలూ తాక్కూడదండీ"

ఎదురుగా నిలబడి చిలిపిగా నవ్వుతున్నట్టుగా అన్పించిందో క్షణం.

కాఫీ తాగబుద్ధెయ్యలేదు. టేబుల్ మీద పెట్టేశాడు.

మనసులోంచి ఆమె ఆలోచనల్ని పారదోలటానికి విశ్వ ప్రయత్నం చేస్తూ బుక్ రేక్‌లో చెయ్యిపెట్టాడు ఏదైనా పుస్తకం తిరగేద్దామని. చేతికందిన పుస్తకం తీస్తే అది భగవద్గీత. దాన్ని పెట్టేసి మరోటి తీసుకున్నాడు. అది రామాయణం. ఎవరు మార్చి వుంటారు తన పుస్తకాల్ని ఈ రేక్‌లోంచి?

వద్దన్నా మళ్లీ కళ్లముందు నిలబడింది విరాజిత.





"బ్రహ్మచారి అన్నవాడు ఏ పుస్తకం పడితే అది చదవకూడదు. సద్గ్రంథ పఠనం చెయ్యాలి"

రామాయణాన్ని తిరిగి రేక్‌లో పెట్టేశాడు.

అన్ని కష్టాల్లో వుండీ మనసులో బడబాగ్నిని దాచుకుని కూడా ఇంత సెన్సాఫ్ హ్యూమర్ ఎలా కలిగివుందో విరాజిత!

టైమ్ చూశాడు... పన్నెండు.

బహుశా చేరివుండొచ్చు ఆమె పిన్ని ఆమెను చూసి సంతోషించి వుంటుందా? ఇల్లు వదిలి పోయినందుకు బాగా తిట్టేసి వుంటుందేమో!

విరాజిత ఫ్యూచర్ ఏమవుతుంది? ఆ పక్షవాత రోగినే చేసుకుంటుందా? చేసుకోక ఏం చేస్తుంది?

అన్నట్టు, అప్పట్లా విరాజిత శ్రావ్య దగ్గరికి వెళ్లిపోకూడదూ! అక్కడే ఏదైనా ఉద్యోగం చూసుకుంటే అనుకున్నట్టుగా సెటిలైపోయేదిగా? దారి వుండీ ఎందుకామె మళ్లీ ఆ రొంపిలోకి వెళ్లిపోయింది? పోనీ అనవసరంగా ఆమెను డైవర్ట్‌చేసి ఇక్కడిదాకా తీసుకొచ్చిన అన్నయ్యా, వదినా అయినా ఆమెను తిరిగి హైదరాబాద్ పంపాల్సింది. అలా పంపటం వారి కనీస ధర్మంకూడా.

ఈ ఆలోచన రాగానే అతను లేచి గదిలోంచి ఇవతలికొచ్చాడు. చంద్రకాంతమ్మ గదిలోంచి బయటకొచ్చి తన పోర్షన్ వేపు వెళుతున్న ప్రశాంతి కనబడింది.

"వదినా!" పిలిచాడు.

"ఏం చిన్నా?"

"మీరో పొరపాటు చేశారు"

"ఒకటేమిటి బాబూ చేసిందంతా పొరపాటే" ఆమె విసురుగా అంది.

"అదికాదు వదినా... రాత్రి ఆమె ఇంటి నుంచి వెళ్లిపోతుంటే అన్నయ్య కూడా వెళ్లి ఆమెను తిరిగి హైదరాబాద్‌కి అదే శ్రావ్య దగ్గరికి పంపి వుండాల్సింది"





"ఆమాత్రం మానవత్వం మాకూ వుందిలే బాబూ. మీరంతా ఎవరి గదుల్లో వాళ్లు ముసుగులు తన్ని పడుకున్నా మీ అన్నయ్యా నేనూ ఆమె వెనకాలే పరిగెత్తాం. చేసిందానికి క్షమాపణలు చెప్పి... మా శ్రావ్య దగ్గరికి వెళ్లిపోమ్మా. మేమొచ్చి నీకు ఉద్యోగం వేయిస్తాం అని బతిమిలాడి చెప్పాం

ఉహూ... వింటేనా! ఒకసారి అనుకున్నది జరగనపుడు మళ్లీ దానికోసం ప్రయత్నించడం తనకిష్టంలేదట. అంతేకాక అంత క్రితం వున్న ఆశలూ ఆలోచనలూ ఇప్పుడు ఆమెలో లేవట. ఆ వృద్ధుడ్నే కట్టుకుని అతని సేవలు చేసుకుంటూ బతుకు వెళ్లదీస్తానని వైరాగ్యంగా మాట్లాడింది"

"కాస్త నచ్చచెప్పకూడదా వదినా"

"కాస్తేం చిన్నా! గడ్డం పుచ్చుకు బతిమిలాడాను. ఓ రకంగా తప్పు నాదికదా! ససేమిరా అంది. ఇకనైనా నా దారిన నన్ను పోనివ్వండి అంది. తక్షణం. నన్ను ఒంటరిగా వదిలేసి వెళ్లకపోతే రైలు కిందపడి చస్తానని బెదిరించింది. ఏం చేస్తాం నోరు మూసుకుని వచ్చేశాం. నిన్ను ప్రేమించింది కదా! మనసు వికలమై వుంటుంది పాపం" చివరి మాటలు చురుగ్గా అంది.

"అంటే... దీనికంతటికీ బాధ్యుడ్ని నేనా?"

"ఏమో! నీ బాధ్యత ఎంతవరకో నువ్వే ఆలోచించుకో. నీకు చెప్పగలిగిన వాళ్లమా మేము!" నిట్టూర్చి మళ్లీ అంది "కాకపోతే నాకొక్కటే బాధ. ఏదో ఉద్యోగం చేసుకుని బతకాలని వచ్చిన మనిషిని అనవసరంగా నా చేతులారా నాశనం చేశానే అని! నాకీ దరిద్రపు ఆలోచన రాకున్నా కనీసం ఆమెను నేను కలవకున్నా ఆమె బతుకు వేరుగా వుండేది. నావల్లే తిరిగి ఆ నరక కూపంలోకి వెళుతోంది విరాజిత. నువ్వు అవునోకాదో నాకు తెలీదుగాని నేను మాత్రం జరిగిందానికి పూర్తి బాధ్యురాల్ని. ఈ పాపం నాదే" ఆమె కళ్లలో నీళ్లు చిప్పిల్లుతుండగా నిలబడలేనట్టు వెళ్లిపోయింది.

ప్రశాంతి వెళ్లిపోయినా చినబాబు అలాగే తన గది గుమ్మానికి ఆనుకుని వుండిపోయాడు.

"నిన్ను ప్రేమించింది కదా! మనసు వికలమై వుంటుంది పాపం!"

"ఆ మాత్రం మానవత్వం మాకూ వుందిలే బాబూ!"

"ఏమో! నీ బాధ్యత ఎంతవరకో నువ్వే ఆలోచించుకో"

ప్రశాంతి అన్న మాటలు పదేపదే చెవుల్లో గింగుర్లాడుతూ.. మనసులో ముల్లులా గుచ్చుకుంటున్నాయ్. నిలబడలేక వెళ్లిపడుకుని కళ్లుమూసుకున్నాడు. ఆలోచనలతో అలసిపోయిన మెదడు అతనికి తెలీకుండానే నిద్రలోకి జారిపోయింది.

ఓ గంటసేపు ఒళ్లెరక్కుండా నిద్రపోయి ఎవరూ లేపకుండానే లేచేశాడు.

హాల్లోంచి ఎవరిదో గొంతు వినబడుతుంటే "బావ వచ్చాడులా వుందే" అనుకుంటూ తొంగిచూశాడు.

నిజమే శోభ భర్త రఘు వచ్చి శేషాద్రితో మాట్లాడుతున్నాడు.

"ఎంతసేపలా మాట్లాడతారు? ఇకలేవండి భోజనాలకు. ఉదయమనగా బయలుదేరి వుంటారు. ఏం తిన్నారో ఏమో? " శోభ భర్తతో గారంగా అంది.

"అప్పటికి మీ చెల్లాయేదో రోజూ పక్కనుండి వడ్డిస్తున్నట్టు! ఇన్నాళ్లూ ఏదో ఒకటి తినకుండానే ఇలా బతికున్నామా!" శ్రీనివాస్‌తో కాబోలు అంటూ శోభవైపు ఓరగా చూశాడు రఘు.

"తమరు అమ్మకూచికదా! మా అవసరం ఏముందిలెండి. వుండుంటే ఇన్నాళ్లు నన్నిలా వదిలేసి..." ఆపైన మాటలు రాక పూడుకుపోయింది శోభ గొంతు.

"చూడండి మామయ్యా! మీ కూతురు నా మీద ఎంత నిందలు వేస్తోందో! ఆవిడగారు నన్ను వదిలేసి వచ్చారా? నేను ఆవిడ్ని వదిలేసి వున్నానా? మీరైనా చెప్పండి న్యాయం"

"రెండూ ఒకటేలే బాబూ.. ఎవరు ఎవర్ని వదిలేసినా మిగిలేది ఎడబాటే. అన్నట్టు అమ్మగారు, నాన్నగారు బాగున్నారా? "

"ఇదుగో... శోభమీద దిగులుతో చిక్కి శల్యమైపోయింది అమ్మ. మొన్నటినుంచి జ్వరం కూడా. శోభను ఒకటే కలవరిస్తుంటే నాన్నగారే పంపారు నన్ను కోడల్ని తీసుకు రమ్మని"

"అత్తయ్యకు జ్వరమా! అయ్యయ్యో... ఒక్క టెలిగ్రాం ఇవ్వకూడదూ! వచ్చివాలేదాన్ని. ఏమిటో ఎదురుగా వుంటే పోట్లాడుకుంటాంగాని ఇక్కడికొచ్చాక ఆవిడ గుర్తురాని క్షణంలేదు"

శోభ గాద్గదికంగా అంటుంటే చినబాబుకు చిత్రంగా అన్పించింది. శోభవచ్చిన కారణమే ఆవిడ అత్తగారు. మళ్లీ ఆవిడ్ని తలచుకుని ఆవిడ కారణంగానే వెళ్లిపోవటం... ఏమిటీ! వింత!

"ఆ తగాదలేమున్నాయిలే శోభా, వట్టి తాటాకు మంటలు. ఎంత పోట్లాడుకుంటే మాత్రం ఆవిడ నీ అత్తకాకుండా పోతుందా... నువ్వామె కోడలివి కాకుండా పోతావా? " సౌభాగ్య కాబోలు అంటోంది.

"ఏమండీ... ఈరోజు సాయంత్రమే వెళదామండీ. వెంటనే అత్తయ్యను చూడాలి"

"అలాగే తల్లీ. లేడికి లేచిందే పరుగని... కాస్త మా అన్నయ్యని ఎంగిలిపడనీ. ఈసారి అలిగి వచ్చావో దుడ్డుకర్రతో గుమ్మంలోంచే తరిమేస్తాం" ప్రభావతి జోక్ వేసింది.

"అది మాత్రం గేరంటీ ఇవ్వలేనండీ. ఈరోజు వెళుతున్నామా.. వస్తే రేపు సాయంత్రంలోగానే రాగలదు. అంత పవర్‌ఫుల్ మీ ఆడపడుచు అలక"

రఘు మాటలకు అందరూ పెద్దగా నవ్వేశారు.

శోభ... మూతి సున్నాలా చుట్టి కోపంగా రఘుకేసి చూసింది.



ఎందుకో ఈ కుటుంబ చిత్రం బాగుంది అన్పించింది చినబాబుకు.

వదిన చెప్పినట్టూ ఈ తగాదాలు తాటాకు మంటలేనా!

"లేవండి.. భోజనాలకు ఇప్పటికే వేళమించిపోతోంది" చంద్రకాంతమ్మ హెచ్చరించింది.

అప్పుడు గమనించాడు చినబాబు. ఇదివరకు డైనింగ్ హాలుగా వాడుకుని ప్రస్తుతం ఎవరి వంట వాళ్లదయ్యాక ఖాళీగా వదిలేసిన గదిలో పెద్దవదిన అందరికీ కలిపి భోజనాలు వడ్డించడం.

అందరూ వెళ్లి కూర్చున్నాక "చినబాబేడీ" అన్నాడు శ్రీధర్.

"చూడమ్మాయ్ లేచాడేమో!"

"అడుగో లేచేశాడు"

"రావయ్యా బామ్మర్దీ... భోంచేద్దాం. బ్యాంక్‌కి వెళ్లలా? అన్నట్టు మాటల్లోపడి మర్చిపోయాను. ఇవాళేమిటి... అన్నదమ్ములందరూ ఆఫీసులు గట్రా ఎగ్గొట్టి ఇంట్లోనే తిష్టవేశారు? " ఆశ్చర్యంగా అడిగాడు రఘు.

"ఏం లేదులే రఘూ! కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు తీసుకుంటూ ఇలా వుండిపోయాం"

"ఏమిటో అంత ముఖ్యమైన నిర్ణయాలు? " నవ్వుతూ అడిగాడు రఘు.

"మొట్టమొదటిది ఇదే. ఇకమీదట ఇంట్లో అందరికీ ఒకే కుంపటి. ఒకే పంక్తి భోజనం" చెప్పాడు శ్రీధర్.

"చాలాకాలానికి ఓ మంచి నిర్ణయానికొచ్చారు బావగారూ!"

"ఇప్పటిగ్గాని కాలం కలిసి రాలేదయ్యా! అయినా ఎప్పుడూ మేము పెద్దగా వేరుపడిందిలేదు. ఇలా విడిగా వుంటే గొడవలు రావనుకున్నాంగాని ఇలా వుండటంవల్లే పెద్దపెద్ద అనర్థాలు జరుగుతుండటంతో మళ్లీ ఈ రూట్ కొచ్చాం" శ్రీనివాస్ అన్నాడు.

"మమ్మల్ని ఉదాహరణగా చూపించి 'ఇదో మీవల్లే నేనిలా అయ్యాను, పెళ్లీ పెడాకులూ మానేశానూ' అని.. ఎవరూ వేలెత్తి చూపకుండా మమ్మల్ని మేం దిద్దుకున్నాం" శ్రీకాంత్ అన్నాడు.

"ఇందులో వేలెత్తి చూపేదేముందిలే శ్రీకాంత్. కుటుంబం అన్నాక సవాలక్ష గొడవలు. మబ్బుల్లా వస్తుంటయ్ పోతుంటయ్. అంత మాత్రాన పెళ్లీ గిళ్లీ మానేస్తారా ఎవరైనా! కాపురాల్లో కలతలకే భయపడి మనుషులంతా పెళ్లిళ్లు చేసుకోవడం మానేస్తే ఇక ఈ ప్రపంచమే ఉండదు. అసలు నన్నడిగితే సంసారాల్లో కలతలూ కన్నీళ్లూ లేకపోతే జీవితంలో థ్రిల్ అనేది ఏముంటుంది? వాటిని ఫేస్‌చేసి పోరాడ్డంలోనే మనిషి గొప్పతనం వుందయ్యా"

చినబాబు త్వరత్వరగా తిన్నాననిపించి లేచాడు.

"అదేమిటోయ్ బామ్మర్దీ... సరిగ్గా భోంచెయ్యనే లేదు"

ఆశ్చర్యపోతున్న రఘుతో శోభ అంది, "ఎవరి ఆకలికి తగ్గట్టు వాళ్లు తింటార్లే. మనం చెబితే వింటారా? మీరు కానివ్వండి'



"రేయ్.. రేయ్.. చిన్నా! నీ ఫ్రెండ్ జీవితంలో మొట్టమొదటి మేరేజ్ యానివర్సరీ

జరుగుతుంటే రాకుండా ముఖం చాటే స్తావా? నువ్వేం ఫ్రెండ్‌విరా?"

రాత్రి పదిగంటలప్పుడు ఫంక్షన్ ముగిసి అతిథులంతా వెళ్లిపోయాక వచ్చాడు హరే రామ్ చినబాబును వెదుక్కుంటూ.

"సారీరా.. మనసు బాగోలేక రాలేక పోయా ఎలా జరిగింది ఫంక్షన్? చెల్లెమ్మకు గ్రీటింగ్స్ ప్లస్ క్షమాపణలు నా తరపున నువ్వే చెప్పెయ్"

"నీ బోడి గ్రీటింగ్స్ ఎవడిక్కావాలిగాని! ఇంతకూ నీ మనసుకేమైందో చెప్పేడుద్?"

"చెల్లాయి ఎదురు చూస్తుంటుంది. కొత్త పెళ్లికొడుకులా గదిలో కెళ్ళాల్సిన టైమ్‌లో నువ్వేంట్రా బాబూ నావెంట పడ్డావ్? త్వరగా వెళ్లు. అన్నట్టు ఈ ఫంక్షన్‌లో కూడా నీచేతి వంటేనా?" హరేరామ్‌ను డైవర్ట్ చెయ్యాలని అడిగాడు.

"నిన్నటితో వంటచేసే బాధ తీరిపోయిందిరా. ఇక ఆ బరువు బాధ్యతలన్నీ మీ చెల్లాయివే. మన పని కాలుమీద కాలేసుకుని సుష్టుగా లాగించెయ్యడమే. ఈరోజు ఫంక్షన్‌తో పారిజాతం చేతివంటకు శ్రీకారం చుట్టబడింది"

"ఇక నీ కష్టాలు గట్టెక్కినట్టేనన్నమాట" చినబాబు లేనినవ్వు ముఖం మీద పులుముకుంటూ అడిగాడు.

"కష్టాలేమిట్రా నీ ముఖం. అదో తీయని కల. నా భార్య నా ప్రేమకు పెట్టిన పరీక్ష"

"పరీక్షా?"

"యస్ పరీక్షే" హరేరామ్ గాఢంగా నిట్టూర్చాడు. "చిన్నా! పారిజాతాన్ని నేను మనసారా ప్రేమించాను. ఆమాటే ఆమెకు చెబితే... మా విజయభారతి కథల్లో హీరోలంతా ఇంతే... ప్రేమా ప్రేమా అని హీరోయిన్ల వెంట పడటం, చివరికి మోసం చేయటం. ఇదేవరస. నువ్వూ అంతే. నేన్నిన్ను నమ్మను అంది. నా ప్రేమ అలాంటిది కాదు. నీయిష్టమొచ్చినట్టు పరీక్షించుకోమన్నాను. ఆమె ఓరోజంతా దీర్ఘంగా ఆలోచించి నన్ను పరీక్షించడానికి ఒప్పుకుంది. నన్ను ఏ కొండమీంచో దూకమనో... తల్లకిందులుగా నిలబడి ఓ గంటసేపు తపస్సు చేయమనో... అడుగుతుందనుకున్నా. ఆమె అవేవీ అడగలేదు. "వెంటనే పెళ్లి చేసుకోవాలీ... పెళ్లయిన రోజునుండీ ఒక్క సంవత్సరం పాటు వంట నువ్వే చెయ్యాలి" ఇదీ ఆమె పెట్టిన షరతు. ఆ షరతును పాటించకపోతే తను నాకు విడాకులు ఇచ్చేస్తుంది. అందుకేరా... నా పారిజాతం కోసమే నేనిన్నాళ్లూ చేతులు మసి చేసుకున్నాను. ఈ విషయం బయటకు పొక్కకుండా ఇన్నాళ్లుగా కాపాడుకొచ్చింది ఎందుకంటే మొగుడి చేత వంటచేయించిందీ అన్న చెడ్డపేరు నా పారిజాతానికి రాకూడదు. అందుకే అతి రహస్యంగా ఈ విషయాన్ని మా ఇద్దరి మధ్యే దాచాం. నువ్వు నా ప్రాణ స్నేహితుడివి, విషయం తెలిసిన వాడివి కాబట్టి ఈనాడిలా చెబుతున్నాను"

"అమ్మకు బాగలేనప్పుడు ఎప్పుడైనా వదినెల మీద పంతంతో వంట చేసుకోడానికి ప్రయత్నించి తల్లకిందులై పోతాను నేను. చివరికి ఏ వదినె కిచెన్‌లోకో దూరి తినేస్తాను. నువ్వు సంవత్సరంపాటు చెయ్యగలిగావంటే నీ ఓపిక..."

మధ్యలో అడ్డుకుని అన్నాడు హరేరామ్ "అది ఓపిక కాదురా ప్రేమ! కేవలం ఆ ప్రేమేరా సెగల పొగల వంట గదిని శీతల సమీరాల ఊటీగా మార్చింది. ఆ వలపు తలపేరా గ్యాస్ సిలిండర్‌ని సైతం అమృత భాండంలా కనబడేట్టు చేసింది"

"హరీ నిజంగా ప్రేమ అంత గొప్పదా?"

"ప్రేమించే హృదయం వున్న వాళ్లకేరా ప్రేమ గొప్పదనం తెలిసేది. మామూలు మనుషులకు అది అర్థంకాదు"

"అంటే అంటే నేను మామూలు మనిషినా? నాకు ప్రేమ విలువ తెలీదా?" చిన

బాబు స్వరం ఎందుకో కంపించింది.

"అంతే అయుంటుంది. లేకుంటే విరాజితనలా వెళ్లనిచ్చేవాడివా!"

"హరీ"

"నాకంతా తెలిసిందిరా మీ చిన్నొదిన ఫంక్షన్‌కి వచ్చిందిగా నాకు కథంతా చెప్పేసింది. బంధుత్వం కన్నా స్నేహం గొప్పదంటారు. కనీసం స్నేహితుడిగా నైనా మీరు చెప్పి చూడండి అసలందుకే మీ ఇల్లు వెదుక్కుంటూ వచ్చానిలా అని కళ్లనీళ్లు పెట్టుకుంది"

"ఓహో నన్ను పెళ్లి చేసుకోమని అడగడానికొచ్చావన్న మాట" తేలిగ్గా అన్నాడు చినబాబు.

"నీ పెళ్లి పెటాకులైపోను. నువ్వు పెళ్లి చేసుకోకపోతే దేశానికొచ్చే నష్టం ఏమీ లేదు గాని నేనొచ్చింది అందుక్కాదు. మీ చిన్నొదిన బాధ చూడలేక ఇలా వెడ్డింగ్‌డే అని కూడా చూడకుండా పరిగెత్తుకొచ్చాను. విరాజిత జీవితం అలా కావడానికి తనే కారణమని కుమిలిపోతోంది ఆవిడ. 'ఆమెను చిన్నా పెళ్లి చేసుకోకపోయినా ఫరవాలేదు. మీరు వెళ్లి ఆమెకు ఆ ముసలాడితో కాబోయే పెళ్లిని తప్పించండి చాలు. ఆనక ఆ పిల్ల జీవితం ఎలాగైనా నా బాధ్యత వుండదు. మా వారికి చెబితే చేసిన అధిక ప్రసంగం చాలు నోరు మూసుకో. నేవెళ్లి అక్కడ పెళ్లాపితే నా మక్కెలు విరగదంతారు అన్నాడు' అని ఏడ్చేసిందిరా మీ వదిన"

చినబాబు మౌనంగా వింటున్నాడు హరేరామ్ చెప్పేది.

"ఒరేయ్ చిన్నా! పన్నెండు గంటలకు ట్రైనుంది. జేబులో మీ వదిన ఇచ్చిన అడ్రెసుంది. నువ్వు మనిషైతే మనసనేది నీకుంటే మా ఇంటికొచ్చెయ్. పెళ్లిరోజైనా ఫరవాలేదు. నీకు తోడుగా నేనొస్తాను. ఓ ఆడపిల్లను రక్షించడానికి ఆమెపట్ల ప్రేమే ఉండక్కర్లేదురా. కనీసం మానవత్వం వుంటే చాలు. నీలో అది మెండుగా వుందని నా నమ్మకం"

చినబాబు అప్పటికీ పెదవి విప్పలేదు.

"వస్తా! నీకోసం గేట్లోనే కూర్చుని ఎదురు చూస్తుంటా. పన్నెండు దాటిందంటే తలుపులు మూసేస్తా. మళ్ళీ ఎప్పుడూ వాటిని నీకోసం మాత్రం తెరవను. నీ దృష్టిలో ప్రేమకు విలువ లేకపోయినా కనీసం స్నేహాన్ని కించపరచకు"

హరేరామ్ చినబాబు చెయ్యి నొక్కి వెళ్లిపోయాడు.

అతను వెళ్లిపోయాక చినబాబు మనసు మరోమారు మననం చేసుకుంది. "ఓ ఆడపిల్లను రక్షించడానికి ఆమెపట్ల ప్రేమే వుండక్కర్లేదురా. కనీసం మానవత్వం వుంటే చాలు" అన్న హరేరామ్ మాట మార్మోగుతోందతని మనసులో!

★ ★ ★

అటు పల్లె ఇటుపట్నం కాని ఆవూళ్లో విరాజిత ఇల్లు పట్టుకోవడం పెద్ద కష్టమేం కాలేదు.

రెండో మూడో గదులున్న పాత పెంకుటిల్లది. ఇంటి ముందో అరుగూ... కాస్త ఖాళీజాగా వుండి... చుట్టూ విరిగిపోయిన చెక్క ఫెన్సింగ్ వుంది. ఆ ఫెన్సింగును కలుపుతూ ఓ చెక్క గేటు కూడా వుంది. ఖాళీ జాగాలో షామియానా వేసివుంది. ఓ పదిపదిహేను మంది వుంటారేమో. మనుషులు ఇంట్లోకీ ఖాళీ జాగాలోకి తిరుగుతూ పనులు చక్కబెడుతున్నారు.

విరాజిత గురించి ఎవర్ని అడగాలా అని చెక్క గేటు పక్కనే వున్న జామ చెట్టు కింద నిలబడి ఆలోచిస్తున్న చినబాబునూ హరేరామ్‌నూ ఇంట్లో నుంచే గమనించి గేటుదాకా వచ్చింది ఓ స్త్రీ. వయసు నలభైలోపు వుంటుంది. జుట్టు ముడిపెట్టుకుని కొంగు భుజం మీంచి తిప్పికప్పుకుని వుంది.





ముఖాన బొట్టు లేక పోవటంతో చూడగానే విధవ అని తెలిసిపోతోంది. ముఖం కరుగ్గా, కళ్లు చురుగ్గా కాస్త అగ్రెసివ్ టైప్ అన్పిస్తోంది.

"ఖచ్చితంగా విరాజిత పిన్నయి వుంటుంది" గొంతు తగ్గించి అన్నాడు హరేరామ్.

ఈలోగా వాళ్లను సమీపించి అడిగిందామె. "ఎవరు బాబూ మీరు? ఏం కావాలి?" మాట మెత్తగా వున్నా కళ్లతో మాత్రం తినేసేట్టు చూసింది.

"విరాజిత అని ఈ ఇంట్లో ఓ అమ్మాయుండాలండీ. ఆమె కోసం వచ్చాం"

"ఓ అమ్మాయేమిటీ... మా అమ్మాయే. నేనా పిల్లకు తల్లిని. వర్ధనమ్మ నా పేరు" ఆమె తన గురించి వివరాలు చెప్పిన తీరు ఎలా వుందంటే... 'ఇక చెప్పండి మీ పుట్టు పూర్వోత్తరాలు' అన్నట్టుంది.

చినబాబు నోరు తెరవబోతుంటే నువ్వాగు అన్నట్టు అతని కాలిమీద కసుక్కున తొక్కి చెప్పాడు హరేరామ్ "మీ అమ్మాయి హైదరాబాద్‌లో డిగ్రీ చదివింది కదా! అప్పుడు మేము ఆమె క్లాస్ మేట్స్ మండీ. చూసి పోదామని వచ్చాం"

"ఆడపిల్లని చూసేదేముందిలే నాయనా. మీరొచ్చి వెళ్లినట్టు చెబుతాలే. పైగా ఈ రాత్రికే దాని పెళ్లి కూడా జరగబోతోంది. కాలేజీ వాళ్లమంటూ ఇలా మగ పిల్లలొచ్చి మాటాడ్డం బాగుండదు. పెళ్లి కొడుక్కిగాని ఈ విషయం తెలిసిందంటే.. హమ్మో ఇంకేమైనా వుందా!"

చినబాబుకి గమ్మున కళ్లు తిరిగిపోయినయ్. ఇలాంటి మనుషులు కూడా వుంటారా అన్పించింది.

హరేరామ్ మాత్రం "అమ్మమ్మ... మీరు చెప్పింది అక్షరాలా నిజం. మేం మాట్లాడ్డం చస్తే బాగోదు. వస్తామండీ. దేన్నికైనా ప్రాప్తముండాలి. మీ అమ్మాయి చదివేరోజుల్లో స్కాలర్‌షిప్ అప్లై చేసిందిలెండి. అదిప్పుడు శాంక్షనై వచ్చింది. ఓమాట చెప్పి సంతకం తీసుకుంటే పనైపోయేది"

"ఏమిటబ్బాయ్ స్కాలర్‌షిప్పా? ఎంత?" ఆశగా చూసింది.

"అయిదు వేలు"

"ఫర్లేదులే బాబూ రండి... అమ్మాయితో మాట్లాడి కాఫీ పుచ్చుకుని వెళ్లండి" ముఖమంతా చింకిచేటలా అయిందామెకు.

"అబ్బే మగపెళ్లివాళ్లు చూస్తే బాగోదు" హరేరామ్ ఇబ్బందిగా ముఖం పెట్టాడు.

"ఒరేయ్ హరీ! వచ్చిన పనేమిటి? అది ముఖ్యం" చినబాబు విసుక్కున్నాడు.

"రండి అమ్మాయి లోపలుంది" అంది వర్ధనమ్మ లోనికి దారితీస్తూ.

"హరీ! నాగరాజుగాడో... బలరామో కనిపించరుగదా!" చినబాబు ఆమె వెనకే నడుస్తూ అటూఇటూ భయంగా చూశాడు.

"ఏమండీ... వర్ధనమ్మగారూ! మీకు నాగరాజు అని ఓ తమ్ముడుండాలనుకుంటా! ఏడండీ ఆ వెధవ! కనిపించడేం?"

తన తమ్ముడ్ని పట్టుకుని వెధవ అంటున్న హరేరామ్‌ని మింగేసేలా చూస్తూ అంది వర్ధనమ్మ, "తాళిబొట్టు తేవడానికని కంసాలి దగ్గరకు వెళ్లాడు. అవునూ మా తమ్ముడు నీకెలా తెలుసు?"

"వాడు నాకు తెలీక పోవడమేంటి మేమిద్దరం స్నేహితులమైతేను"

వర్ధనమ్మ భృకుటి ముడిచి హరేరామ్‌ని చూసింది. అంతలోనే ఐదువేలు గుర్తుకొచ్చాయేమో ముందుకు కదిలి హాలులాగా వున్న రెండోగదిలో ఎడంపక్కగా దానికి అడ్జెసెంట్‌గా వున్న మరో గది తలుపుల్ని తట్టి చెప్పింది "అమ్మా విరీ! ఎవరో కాలేజీ వాళ్లట వచ్చారు ఓసారి చూడు"

విరాజిత తలుపుతీసి... ఎదురుగా వున్న ఇద్దర్నీ చూసి గ్రమాన్పడిపోయింది.

"హైదరాబాద్‌లో చదివేటప్పుడు నువ్వేదో స్కాలర్ షిప్పుకు ధరఖాస్తు చేసుకున్నావ

టగా. ఆ తాలూకు డబ్బేదో వచ్చిందని చెబుతున్నారు. వివరం కనుక్కో. నే వెళ్ళి కాఫీ పట్టుకొస్తా"

వర్ధనమ్మ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

"లోపలికి రండి" విరాజిత చెప్పింది.

ఇద్దరూ లోపలికి వచ్చాక అన్నది. "మీరెవరో ఏమిటో మా పిన్నికి నిజం చెప్పకుండా గొప్ప సాయమే చేశారు. నేనాడిన నాటకాలూ... డ్రామాలూ, ఆమెకు తెలీవు. ఇన్నాళ్ళూ స్నేహితురాలింట్లో గడిపి వచ్చాననే నమ్ముతోంది. దయచేసి వచ్చిన పనేమిటో త్వరగా చెప్పండి"

కనీసం తనను చూసిన సంభ్రమాన్ని కూడా వ్యక్తం చేయకుండా, తన రాకకు ఎటువంటి ప్రాముఖ్యతా ఇవ్వకుండా అతి మామూలుగా 'వచ్చిన పనేమిటో చెప్పి త్వరగా వెళ్ళండి' అంటున్న విరాజితను చూస్తుంటేనే అర్ధమౌతోంది చినబాబుకు, ఆమె తన సాంగత్యాన్ని ఓ పీడకలగా మర్చిపోవడానికి మానసికంగా ఎంత ప్రిపేరైపోయిందో.



మనసు చేదుగా అవుతుంటే నిశ్శబ్దంగా ఆమెకేసి చూశాడు.

"చెప్పండి" మళ్లీ అడిగిందామె.

"విరాజితా!" చినబాబు పిల్చాడు

హరేరామ్‌కి తనక్కడ లేకుండా వాళ్లను ఒంటరిగా వదిలేస్తే బాగుండునన్పించింది గాని... అలాంటి వీలేం లేదు కాబట్టి ఆ గదికున్న కిటికీలోంచి బయటికి చూస్తూ వుండిపోయాడు.

"మీరు... మీరు ఈ పెళ్లి చేసుకోవడానికి వీల్లేదు" చినబాబు మాటలు కూడదీసు కుంటూ చెప్పాడు.

నిర్లిప్తంగా వున్న ఆమె ముఖంలో ఓ భావతరంగం ఉవ్వెత్తున లేచిపడింది. తన్నుతాను కంట్రోలు చేసుకుంటూ అడిగింది "వద్దనడానికి మీరెవరో తెలుసుకో వచ్చా"

"మీ శ్రేయోభిలాషిని"

పేలవంగా నవ్వింది విరాజిత.

"నామీద కోపంతో మీ జీవితాన్ని పాడు చేసుకోకండి ప్లీజ్"

"జీవితాన్ని పాడుచేసుకుంటున్నానా? చిత్రంగా వుందే! అర్థం పరమార్థం లేని నా బ్రతుకును ఇదో ... ఈ పెళ్లితో బాగు చేసు కుంటున్నాను"

"ఓ వృద్ధుడ్నీ... రోగినీ కట్టుకోబోవటం బ్రతుకును బాగుచేసుకోవటమేనంటారా? "

ఆమె అతని వంక నిర్లక్ష్యంగా చూసింది. "మానసికంగా వృద్ధులూ, రోగులూ అయిన కొంతమంది యువకులకంటే నన్ను చేసుకో బోయే వృద్ధుడు ఎన్నోరెట్లు మేలు. అతని వ్యాధి కేవలం శారీరకం. మెంటల్లీ హీ ఈజ్ సౌండ్"

"అంటే మీ నిర్ణయం మారదన్నమాట" అడిగాడతను.

"ఎందుకు మారాలి? "

"ఎందుకంటే... ఎందుకంటే.. నాకోసం"

కిటికీలోంచి ఆకాశంకేసి చూస్తున్న హరే రామ్ ఉలిక్కిపడి ఇటు తిరిగాడు.

ఘనీభవించిన విరాజిత మనసును ఆమాట వెచ్చగా స్పృశించింది. అది కరిగి ఆర్ద్రమవకముందే ఆమె పెదవులు కఠినంగా కదిలాయ్ "తుఫాన్ తాకిడికి అల్లకల్లోలమై... ఇప్పుడిప్పుడే నిశ్చలమౌతున్న నీటి లోకి గులకరాయి విసరడానికన్నమాట మీరొచ్చింది'

ఆ మాటలన్నాక

ఆమె చప్పున చేతులు జోడించింది. కళ్లలో వూరబోతున్న కన్నీటిని బలవంతంగా ఆపుకుని చెప్పింది "దయచేసి... తక్షణం నా కళ్లముందు నుండి వెళ్లిపొండి. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకున్నాక ఇంటి నుండి పారిపోవడం అనే ఏ ఆడపిల్లా చెయ్యకూడని ఘోరమైన తప్పుచేశాను. తప్పు తెలుసుకుని తిరిగివచ్చిన నన్ను మన స్ఫూర్తిగా క్షమించి పెళ్లాడ్డానికి ఒప్పుకున్నాడాయన. అటువంటి మహోన్నత వ్యక్తిత్వం వున్న మనిషి వృద్ధుడని చెప్పి మళ్లీ మోసం చేసి నన్ను నేను కించపరచుకోలేను."

"అబ్బెబ్బే... మేం గులకరాళ్ళూ... కంకర రాళ్ళూ విసరడానికి రాలేదమ్మా. మీపిన్ని గారి చేతి కాఫీ తాగి మీచేత ఓ సంతకం తీసుకుని వెళ్లిపోవడానికొచ్చాం"

అసందర్భంగా మాట్లాడుతున్న హరేరామ్ వైపు కోపంగా చూడబోయిన చినబాబుకు ట్రేలో కాఫీ కప్పులతో వస్తున్న వర్ధనమ్మ కనబడగానే అర్థమైంది హరేరామ్ రూటెందుకు మార్చాడో.

"సంతకమా? " భృకుటి ముడిచి అడిగింది విరాజిత.

"ఇప్పుడే కదమ్మా చెప్పాను. ఇంత చిన్న వయసులో అంత మతి మరుపు ఏమిటి? మన రాష్ట్ర విద్యారంగంలో గణనీయమైన మార్పులొచ్చాయి. ఎప్పుడో చదివిన విద్యార్థులక్కూడా ఇప్పుడు స్కాలర్ షిప్స్ శాంక్షన్ చేసి ఇంటింటికీ వెళ్లి తాంబూలంలో పెట్టి మరీ ఇస్తున్నారు."

వర్ధనమ్మ హరేరామ్ వంక ఆప్యాయంగా చూస్తూ కాఫీలందించి విరాజితతో అన్నది

"ఇదంతా నీ అదృష్టమే తల్లీ. పాపం... హైదరాబాదునుంచి వచ్చారీ అబ్బాయిలు నిన్ను వెదుక్కుంటూ. నీతోపాటే కాలేజీలో చదివారట కదా! నీకు ఐదువేలొస్తాయట. అమ్మాయ్... నీ చెల్లెలు... నీమీద అలిగిందిగా కంచి పట్టుచీర కొని పెట్టలేదని! ఈ డబ్బుతో దాని ముచ్చట తీర్చెయ్యమ్మా పిచ్చిది.... చీరలంటే ఎంత మోజో దానికి!"

"అవునమ్మా ఆడపిల్లలకు చీరెలంటే అందులోనూ కంచిపట్టు చీరెలంటే తగని మోజుంటుంది.. అది సహజం. అన్నట్టు ఓ తెల్లకాగితం తెచ్చి పెడతారామ్మా? " అడిగాడు హరేరామ్ వర్ధనమ్మను.

"దానికేం భాగ్యం నాయనా! తెస్తానుండు"

ఆమె లేచి వెళ్లింది.

ఇక సమయం దొరకదన్నట్టు ఆత్రంగా అడిగాడు చినబాబు.

"ఏమంటారు విరాజితా? "

"ఏమంటాను? ఈ రాత్రికి జరగబోయే పెళ్లికి వుండమంటాను. అదీ మీ కిష్టమైతేనే ఇదుగోండి వెడ్డింగ్ కార్డ్." ఇక తన నిర్ణయం మారే ప్రశ్నే లేదన్నట్టు చెప్పింది.

"ఇంద నాయనా... కాగితం" వర్ధనమ్మ తెల్లకాగితం హరేరామ్‌కిచ్చింది.

విరాజితకు అంత బాధలోనూ నవ్వొచ్చింది. హరేరామ్ అందించిన కాగితం తీసుకుని చివర సంతకం పెట్టి యిచ్చింది.

"ఏమీ రాయలేదే అందులో" అడిగింది వర్ధనమ్మ ఆరాగా.

"మేటర్ టైపు చెయ్యిస్తామండీ బయటకెళ్లాక" చెప్పాడు.

చినబాబు లేచి విరాజితకేసి తదేకంగా చూసి "అంతేనా? " అన్నాడు.

"అంతే" స్థిరంగా చెప్పిందామె.

వర్ధనమ్మ విరాజితనూ, చినబాబునూ మార్చిమార్చి చూసి అడిగింది "అంతేనా ఏమిటి? "

హరేరామ్ చప్పున కల్పించుకుని చెప్పాడు "ఏంలేదులెండి. మీ అమ్మాయేమో... మమ్మల్ని పెళ్లికి వుండమని బలవంతం చేస్తోంది. మా వాడేమో కుదర్దు అంటున్నాడు. అందుకనీ ఆమె నిష్ఠూరమాడుతున్నారు"

"పోనీ వుండకూడదా బాబూ... సమయానికొచ్చారు స్నేహితులమంటూ"

"వద్దులెండి. మీ బంధుజనం మధ్య మేమెందుకు? " ముఖమాటంగా అన్నాడు హరేరామ్.

"ఏం బంధువులోలే నాయనా. పెద్దగా ఎవర్నీ పిలవలేదు. దగ్గరి వాళ్లను నలుగుర్ని పిలిచాను. స్తోమత లేనివాళ్లం.. పిల్లను రెండో పెళ్లి వాడికిస్తున్నామని పదిమందీ పదిమాటలంటారని భయపడి ఎవర్నీ పిలవలేదు. వాళ్లేమైనా ఆదుస్తారా తీరుస్తారా? సవతి బిడ్డ కాబట్టి ఇలా చేస్తున్నావంటూ ఆరడి పెడతారు తప్ప నా మట్టుకు నాకు చాలా సంతృప్తిగా వుంది నాయనా. దాని సుఖం కోరే ఈ పెళ్లి చేస్తున్నా. లక్షల ఆస్థికి వారసురాల్ని చేస్తున్నా. అందరికీ పడుతుందా ఏమిటి మా విరాజిత అదృష్టం. ఇంతకీ మీరు వుంటున్నట్టేనా? "

"లేదండీ. వెళుతున్నాం. మాకు చాలా పనులున్నాయ్. వీలైతే పెళ్లి టయానికి వస్తాంలెండి" హరేరామ్ చెప్పాడు.

ఇద్దరూ లేచారు. గుమ్మం దాటబోతూ చినబాబు వెనక్కి తిరిగి విరాజితకేసి చూశాడు.

ఎందుకో మరి ఆమె రూపం మసగ్గా కనబడింది.

గేటు దాటాక ఓ కన్నీటిచుక్క రాలి అతని షర్ట్ కాలర్ మీద పడ్డప్పుడు అర్థమైంది తన కళ్లకు నీటి తెర అడ్డుపడ్డంవల్లే ఆమెరూపం మసకబారిందని!

నడుస్తూ అడిగాడు హరేరామ్ "ఒరేయ్ చిన్నా... ఇందాక విరాజితతో మాట్లాడుతూ... మాట్లాడుతూ... ఓ మాట

న్నావ్... గుర్తుందా? "

ఏమిటన్నట్టు చూశాడు చినబాబు.

"ఎందుకు పెళ్లి మానుకోవాలి అని ఆ అమ్మాయ్ అడిగినప్పుడు నువ్వు ప్రేమనగర్‌లో నాగేశ్వర్రావ్ లాగా ఫోజిచ్చి 'నాకోసం' అన్నావ్ చూడు.... ఆ మాట"

చినబాబు హరేరామ్ వంక ఓసారి చూసి కళ్లు దించుకున్నాడు.

"చూడు చిన్నా! మాటలు మన శరీరంలో ముఖ్యంగా మూడు భాగాలనుంచి వస్తాయట. పెదవుల మీదనుంచీ, హృదయం లోంచీ, నాభి భాగంనుంచీ. మరి నువ్వన్న ఆ మాట..." అర్ధోక్తిలో ఆపేశాడు.

"హృదయంలోంచి వచ్చిందిరా" మరో కన్నీటి చుక్క రాలుతుండగా అన్నాడు.

"అయితే విరాజిత ఇక నీదే. పూచీనాది. పద పోదాం"

"ఎక్కడికి? " చినబాబు అయోమయంగా చూశాడు.

హరేరామ్ ఇందాక విరాజిత ఇచ్చిన వెడ్డింగ్ కార్డ్ తీసి చూసి చెప్పాడు. "విరాజితను పెళ్లాడబోతున్న ఆ వృద్ధ పుంగవుడు... పురుషోత్తమరావుగార్ని ఓసారి కలుద్దాం.



"నీకిప్పుడు పెళ్లికావలసి వచ్చిందిరా





ముసలి పీనుగా. అదీ నవయవ్వనాంగితో! సిగ్గులేదూ... మనిషి జన్మెత్తావ్? కర్మ! పెళ్ళి చేసుకోవాల్సిన వయసేనా ఇది! నీపీక పిసికి నిలువునా పాతెయ్యడానికి వచ్చాంరా వెధవా!"

అని తిట్టాలని ఎంతో ప్రిపేర్డ్‌గా వచ్చిన హరేరామ్ పురుషోత్తమరావును చూడగానే తెలియని గౌరవభావమేదో మనసును కమ్ముకోగా మౌనంగా చేతులు జోడించి నమస్కరించాడు.

"ఎవరుబాబూ!" మృదు గంభీరంగా వుంది ఆయన స్వరం. హాల్లో వీల్ చెయిర్లో కూర్చుని వున్నాడాయన. భుజాల మీద లేత నీలిరంగు షాల్ కప్పుకుని వున్నాడు. ఆయన ముఖ వర్చస్సులో ఏదో తేజస్సు. కళ్లు నిర్లిప్తంగా, గ్రేస్‌ఫుల్‌గా వున్నాయి. అసలాయన పక్షవాతరోగి అని చెబితే తప్ప ఎవరూ నమ్మరు.

"నా పేరు హరేరామ్. వీడు నా ఫ్రెండు... చినబాబు"

"ఒహో... చినబాబంటే నువ్వేనా? " కుతూహలంగా చినబాబుని ఆపాదమస్తకం చూశాడు

"నేను... మీకెలా తెలుసు? " ఆశ్చర్యంతో తల మునకలయ్యాడు చినబాబు.

"విరాజిత... నాకంతా చెప్పిందయ్యా. మీ వూరినుండి రావడమే నా దగ్గర కొచ్చిందామె. జరిగిందంతా దాచకుండా చెప్పింది. అంతా విని 'పోనీ ఆ చినబాబుతో నన్ను మాట్లాడమంటావా?' అని అడిగాను" చినబాబు ఆతృతతో ఆయన ముఖంలోకి చూశాడు.

"మీరు పిలిపించి నచ్చచెప్పినా అతను ఒప్పుకోడు. ఒకవేళ ఒప్పుకున్నా... ఇప్పుడు నేనతన్ని చేసుకోవటానికి సిద్ధంగా లేను అన్నది"

ఆశగా ఆయన్నే చూస్తున్న చినబాబు కళ్లలో ఒక నిరాశావీచిక అలా కదలిపోయింది.

"మీరు కారణం అడగలేదా? " హరేరామ్

అడిగాడు.

"అడగలేదు గానీ అర్థమైంది నాకు. ఆమె నిన్ను మనసారా ప్రేమించింది. ఆ మనసును నువ్వు ముక్కలు చేశావ్"

ఇద్దరూ కాసేపు మౌనంగా వుండిపోయారు. హరేరామ్ అన్నాడాయనతో "మీరు తలచుకుంటే అతుక్కుంటుంది"

"చెప్పాగా... నా ప్రయత్నం నేను చేశా. నని. ఆమె ఒప్పుకోలేదు. మీరు చేసుకుంటానంటేనే ఇంటికి వెళతానంది...! ఆమె వెళ్లగానే ఆమె పిన్ని వచ్చి.. అమ్మాయ్ హైదరాబాద్‌లో తన స్నేహితురాలింట్లో ఓ పది రోజులుండి వచ్చిందనీ, ఇదివరకు అనుకున్న ముహూర్తం ఇంకా దాటిపోలేదు కనుక... ఆ ముహూర్తానికే పెళ్లిచేస్తాననీ చెప్పింది. సరే అన్నాను"

"అయితే జరిగింది మీకు తప్ప ఇంట్లో కూడా చెప్పలేదన్న మాట"

"అనవసరం అనుకుని వుంటుంది"

"సర్... ఎంత గోప్యంగా ఈ విషయాన్ని గుండెల్లో దాచుకున్నారో... అంత గోప్యంగా మావాడి పెళ్లి మీరే చెయ్యాలి సర్"

"ఆమె ఒప్పుకోనప్పుడు నేనేం చెయ్యగలను? "

"మీరు చెయ్యగలరు"

"ఎలా? "

ఒక్కక్షణం తటపటాయించి చెప్పాడు హరేరామ్ "ఆమెను మీరు చేసుకోకండి. కరెక్ట్‌గా ముహూర్తంటయానికి పీటలమీద చినబాబునుకూర్చోబెట్టేద్దాం సిన్మాల్లోలాగా!"

పురుషోత్తమరావు కంటే ముందు చినబాబు స్టన్నయ్యాడు.

"హరీ! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా? "

"నువ్వు నోర్మూసుకో" చినబాబును గదమాయించి స్థాణువులా చూస్తున్న పురుషోత్తమరావును మళ్లీ అడిగాడు హరేరామ్ "ఏమంటారు సర్? "

"వచ్చిన దారినే వెళ్లమంటాను"

"సర్"

"అంత ప్రేమని మీ ఫ్రెండ్ కాబట్టి వదులుకున్నాడు. దూరమైన అదృష్టం తిరిగి నన్ను వెదుక్కుంటూ వచ్చింది. కాలదన్నుకునేంత మూర్ఖుడ్ని కాను"

హరేరామ్‌కి అంతవరకూ ఆయన మీద కలిగిన గౌరవం సన్నగిల్లిపోయింది. "అంటే ఆమెను పెళ్లాడి తీరతారన్నమాట సర్! మనలో మాట... ఇంత ముసలివయసులో ముక్కు పచ్చలారని ఆమెను పెళ్లాడి మీరు పొందబోయే సుఖం ఏమిటి? " కోపాన్ని నిగ్రహించుకుంటూ అడిగాడు.

పురుషోత్తమరావు తదేకంగా హరేరామ్ ముఖంలోకి చూసి గాఢంగా నిట్టూర్చాడు. "యు సీ మిష్టర్! 'సుఖం' అనేది నీ భాషలో శారీరకం కావచ్చు దాన్ని మించిన మానసిక సుఖం ఒకటుంది. అది వయసులో వున్న మీకు ఇప్పుడు అర్థం కాదు. బహుశా మీ చినబాబు కూడా ఆ సుఖాన్ని దృష్టిలో పెట్టుకునే పెళ్లి వద్దు అనుంటాడు. తల్లిదండ్రులముందు అదెంత ఆఫ్టాల్ అనుకుని వుంటాడు. తనవారికోసం ఆ సుఖాన్ని త్యాగం చేసిన త్యాగమూర్తిని అన్న భ్రమలో వుండి వుంటాడు. కానీ... నాలాగా వయసు మీదపడి... పిలిస్తే పలికే ఓ మనిషిలేక... ఒంటరిగా... బ్రతుకు నీడుస్తున్నప్పుడు గాని అర్థం కాదు పెళ్లిలోవున్న మహత్తేమిటో... భార్య అందివ్వగల సుఖం ఏమిటో!

"నాకు ఆస్థిపాస్తులున్నాయి. ఓ కొడుకూ... ఓ కూతురూ, మనమలూ, మనమరాళ్లూ వున్నారు. కానీ... ఇక్కడ నా దగ్గర మాత్రం ఎవరూ లేరు. ఒకరు అమెరికాలో సెటిలయ్యారు. ఒకరు... గల్ఫ్‌కి అంకితమయ్యారు. కొడుకు వచ్చెయ్యమన్నాడు తనతో అమెరికాకి. పక్షవాతం వచ్చి శారీరకంగా సగం చనిపోయిన నేను... వున్నవూరిని వదిలి పోలేకపోయాను. నా కొడుకునే ఇక్కడకు రమ్మన్నాను. వాడు

అమెరికాకు అలవాటు పడి 'సారీ' అన్నా, బాధ్యత మరిచిపోకుండా నాకోసం... నన్ను చూసుకోవడానికి ఆయాను ఏర్పాటు చేశాడు. ఆమె నాకు టయానికి అన్నం పెడుతుంది, అవసరాలు తీరుస్తుంది. అంతే గాని ఆమె నా ఒంటరితనాన్ని పోగొట్టదు. నా మనసులోని మాటలు ఆమెతో చెప్పుకో లేను. అలాంటి జీవితం సాగిస్తున్న వేళ... విరాజిత పిన్ని నన్ను వెదుక్కుంటూ వచ్చింది. ఒక లక్షరూపాయలు ఇస్తే ఒయాసిస్సును నీ ముందే సృష్టిస్తానంది.

మనిషి బేసికల్‌గా స్వార్థపరుడు. ఆ స్వార్థంతోనే, జీవితంలో వేసారిపోయిన అలసటతోనే నేను సరేనన్నాను.

అయినా ఒకటిమాత్రం మర్చిపోలేదు. అది అమ్మాయికి ఇష్టమేనా అని అడగటం. పుట్టటమే దరిద్రంలో పుట్టిన ఆమె కూతురికి ఐశ్వర్యమంటే తగని మోజనీ... ఆమె స్వయంగా పంపిస్తేనే తను నా దగ్గరకు వచ్చాననీ చెప్పింది.

ఆ క్షణమే అనుకున్నాను... జీవితాన్నే నాకోసం త్యాగం చేయబోతున్న ఆమెకు నా సర్వసంపదలూ కానుకగా ఇవ్వాలనీ, నా జీవితం చివరి క్షణంవరకూ ఆమె నాకు తోడుంటే చాలుననీ, తరువాత ఆమె మరో తోడు వెదుక్కున్నా నాకభ్యంతరం లేదనీ చెప్పాలనిపించింది.

ఆమె నాకు ప్రేమగా అన్నం పెడుతుంది. నా ఎదురుగా కూర్చుని గంటలు తరబడి మాట్లాడుతుంది. నా దురదృష్టాన్ని చూసి జాలిపడుతుంది. నా కన్నీరు తుడిచి నన్ను ఓదారుస్తుంది.

ఇదంతా... కేవలం భార్యమాత్రమే అందివ్వగల మహత్తర వరం. తల్లిగానీ, చెల్లిగానీ, బిడ్డలుగానీ ఎవ్వరూ ఇవ్వలేని అపురూపమైన సాంగత్యం.

అందుకే నిశ్చయ తాంబూలాలు పుచ్చుకున్నాను. ముహూర్తం పెట్టుకున్నాను. నా బిడ్డలు నన్ను నిందించారు. నా బంధువులు హేళన చేశారు. అయినా లెక్కచెయ్యలేదు.

అటువంటిది ఆ పెళ్లి తప్పిపోబోయి తిరిగి నా వద్దకే వచ్చింది. ఇప్పుడు దాన్ని ఎవరికోసమో ఎందుకువదులుకుంటాను?"

పురుషోత్తమరావు చెప్పేదంతా దీక్షగా వింటున్న చినబాబుతో అన్నాడు హరేరామ్. "విన్నావురా! బ్రహ్మచారీ!! వివాహబంధం ఎంత గొప్పదో! పెళ్లికోసం ఎవరైనా అర్రులు చాచేది... ఎందుకో ఇపుడైనా అర్థమైందా?"

చినబాబు నిశ్శబ్దంగా లేచి నిలబడి మ్లానమైన ముఖంతో పురుషోత్తమరావు వంక చూశాడు "వస్తామండీ. పెళ్లంటే గిట్టనంత కాలం నన్ను వెంటాడిన అదృష్టం... ఈనాడు పెళ్లి కావాలని కోరుకుంటున్న నన్ను వెక్కిరించి దూరంగా వెళ్లిపోయింది. అది మిమ్మల్ని వరించిందని తెలిసీ...మీ నుండి లాక్కునేంత దుర్మార్గుడ్ని కాను. జస్ట్ ఐ యామ్ అన్‌లక్కీ దట్సాల్"

తలవంచుకుని గబగబా గుమ్మందాటి పూలమొక్కలమధ్య వున్న కాలిబాటగుండా నడిచి గేటుదాటాడు.

ఓ రెండు మూడు నిముషాల అనంతరం... లోపలినుంచి వస్తూ కనబడ్డాడు హరేరామ్.



డోర్ బెల్ మోగించినట్టు వినబడ్డంతో ఉలిక్కిపడి మేలుకున్నాడు చినబాబు.

అప్పుడు సమయం రాత్రి ఎనిమిదన్నర దాటుతోంది. తాము పురుషోత్తమరావుతో మాట్లాడి దాదాపు మధ్యాహ్నం ఒంటిగంటప్పుడు బయటకొచ్చేరు.

ఆకలి దంచేస్తుంటే హరేరామ్ చినబాబును ఆకల్లేదంటున్నా బలవంతంగా ఓ హోటల్‌కి లాక్కెళ్లాడు.

చినబాబు అన్నం కెలుకుతూ అన్యమనస్కంగా వుండటం చూసి హరేరామ్





అన్నాడు.

"పోనీ... విరాజిత పెళ్లి ముహూర్తం వరకూ వుందామా? కనీసం... చివరి క్షణంలోనైనా అటు పురుషోత్తమరావో... ఇటు విరాజితో మనసు మార్చుకుంటా రేమో"

చినబాబు కోపంగా అన్నాడు. "ఇదేం సినిమాకాదు... జీవితం"

"నేను అలా జరగాలనే కోరుకుంటున్నా నురా. జరుగుతుందని కూడా ఎందుకో నా సిక్స్‌సెన్స్ పదేపదే చెబుతోంది"

"నీ సిక్స్‌సెన్స్ చెబుతోందా? జరగదు గాక జరగదని నా సెన్సెస్ మొత్తం చెబుతు న్నాయిగానీ... ఇక నువ్వు నోర్మూసుకుని తిను"

అతని ఆవేశం వెనక ఎంత ఆవేదన వుందో హరేరామ్‌కి బాగానే అర్థమవు తోంది. "సరే, కనీసం పెళ్లిచూసే వెళ దాంరా. విరాజిత సంతోషిస్తుంది. అదీగాక బాగా అలసిపోయామా సాయంత్రందాకా బాగా నిద్రపోయి రాత్రి పదకొండుగంటల ట్రైను ఎక్కేద్దాం ప్లీజ్"

హరేరామ్ అంత ఇదిగా అలసిపోయా నని చెబుతుంటే కాదనలేకపోయాడు. అదీ గాక "పెళ్లికి వెళ్తే విరాజిత సంతోషిస్తుంది" అన్నమాట అతని మనసును అభిమంత్రిం చింది.

ఇక జీవితంలో విరాజితను చూడనేమో! కనీసం ఆఖరిసారిగా ఆమెను పెళ్లిపీటల మీద చూసి వెళదాం అన్పించిందతనికి.

అది ఓ మోస్తరు హోటల్ కావడంతో అక్కడే రూమ్ బుక్ చేసుకుని ఇద్దరూ పడు కున్నారు. సాయంత్రం నాలుగు గంటల ప్పుడు హరేరామ్ లేచి నిద్రరాక అటూ ఇటూ పొర్లుతున్న చినబాబుకు ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్ళాడు. చినబాబు తలుపు మూసుకుని మళ్లీ నిద్రకుపక్రమించాడు. చాలా సేపటికి ఆలోచనలను జయించి నిద్ర లోకి జారిపోయాడు. మళ్లీ ఇదుగో ఇప్పుడే డోర్ బెల్ శబ్దం విని లేచాడు.

హరేరామ్ అయివుంటాడేమో అనుకుంటూ వెళ్ళి తలుపు తీశాడు. వచ్చింది హరేరామే. మనిషి చాలా హడా వుడిగా వున్నాడు.

"రేయ్ చిన్నా... నిన్ను పురుషోత్తమరా వుగారు అర్జంటుగా పిలుచుకురమ్మన్నారు"

"నన్నా? ఎందుకు?" నిద్రమత్తు వదులు తుండగా అడిగాడు.

"ఏమో తెలియదు"

"సరేపద... ఎలాగూ పెళ్లికి వెళ్లాలనుకు న్నాంగా. పది గంటలకు కదూ ముహూర్తం"

చినబాబు చకచక ముఖం కడుక్కుని తయారైపోయాడు. రూమ్ వెకేట్ చేసినట్టు కౌంటర్‌లో తాళాలిచ్చి రెంట్ చెల్లించి బయట పడేసరికి తొమ్మిది దాటింది.

ఆటోలో... కల్యాణమండపానికి చేరేసరికి మంగళవాయిద్యాలు మోగుతున్నాయి. వచ్చిన కొద్దిమంది ఆహూతులతో పెళ్లిమం డపం వున్నంతలో కళకళలాడుతోంది.

హరేరామ్ చినబాబు రెక్క పట్టుకుని ఓ గదిలోకి తీసికెళ్ళాడు.

గదిలో... ఎప్పట్లా తన వీల్ చెయిర్‌లో కూర్చుని వున్నాడు పురుషోత్తమరావు.

అయితే... ఆయన ఇందాకటిలా లేడు. నుదుట బాసికంతో తెల్లటి పెళ్లి వస్త్రాలతో వున్నాడు.

చినబాబును చూడగానే దగ్గరకు రమ్మని పిలిచాడు.

ఆ గదిలో వున్న తన ఆయాను... ఇతర సన్నిహితులను బయటకు వెళ్ళిపొమ్మ న్నాడు.

"చూడు చినబాబూ!"

"చెప్పండి" చినబాబు చేతివేళ్లవంక చూసుకుంటున్నాడు.

"నేను... ఈ పెళ్లి చేసుకోబోవటంలేదు"

నెత్తిన పిడుగు పడ్డట్టుగా చూశాడు చిన బాబు ఆయన ముఖంలోకి.



"అదేమిటి? ఇన్ని ఏర్పాట్లు జరిగాక ఇప్పుడు మీరు కాదంటే..."

"ఏర్పాట్లు వృధాపోవు. ఈ ముహూర్తానికే నువ్వు విరాజిత మెళ్లో మూడుముళ్లూ వేస్తావు"

"సర్..." చినబాబు హృదయం వణికిపోయింది.

"ఇందులో ఆశ్చర్యపడాల్సిందేంలేదు. ఆమె నన్ను కోరి వస్తేనే చేసుకుంటానన్నాను. అంతేగాని నిరాకరించినా చేసుకోడానికి నేను సిద్ధంగా లేను. మనసు వేరుగా వున్న మనిషి నాకు మానసిక ఆనందాన్నివ్వలేదు. అది లేనప్పుడు... నేనీ పెళ్లి చేసుకోవడంలో అర్థం లేదు"

"అసలేం జరిగింది సర్"

"చూడు నీకే తెలుస్తుంది"

పురుషోత్తమరావు తెల్లటి లాల్చీ జేబులోంచి ఓ మడత పెట్టిన కాగితం తీసి చినబాబుకు అందించాడు.

ఆతృతగా విప్పాడు చినబాబు.

"ఆవేశంలో తీసుకున్న నిర్ణయమది. ఇప్పుడు నా నిర్ణయాన్ని మార్చుకున్నాను. మీరు బాధపడతారని తెలుసు. అయినా మీ కోసం నాకిష్టంలేని పని చెయ్యలేను. అనుకోకుండా కలిసొచ్చిన అదృష్టాన్ని చేజార్చుకునే ఉద్దేశం నాకు లేదు. నా జీవితాన్ని దిద్దుకునే అవకాశం నాకే ఇవ్వండి. నన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తారనే ఆశతో.

-విరాజిత"

"చూశావ్‌గా... ఆమె తన అభిప్రాయాన్ని ఎంత స్పష్టంగా చెప్పిందో. ఆమె పిన్ని బలవంతంమీద నాతో పెళ్లికి ఒప్పుకుంది. అందుకే వద్దని పారిపోయింది. ఆ ప్రయత్నం ఫలించలేదన్న నిరాశలో ఆవేశంలో తిరిగి నా దగ్గరకు వచ్చింది. ఇప్పుడా పెళ్లిఘడియ సమీపించేసరికి... ఆమె మనసు మొరాయిస్తోంది. అది సహజం"

"నే వెళ్లి నచ్చచెబుతాను సర్" చినబాబు ఆవేశంగా లేవబోయాడు.

"వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకుంటావేంరా. ఎబ్రాసి వెధవా" అనబోయి ఎలాగో సంబాళించుకుని అన్నాడు హరేరామ్.

"చిన్నా... ఆ ఉత్తరం సరిగా చదివావా నువ్వు? అందులో 'నా జీవితాన్ని దిద్దుకునే అవకాశం నాకే ఇవ్వండి' అన్న వాక్యం ఒకటి ఏడ్చింది. దానర్థం తెలుసా నీకు? నీలాంటివాళ్ల బోడి సలహాలు నేను తీసుకోను అన్న హెచ్చరిక అది"

"మరి ఇప్పుడెలా? " చినబాబు దిగాలుగా చూశాడు.

"ఎలా అంటే... ఆయన చెప్పినట్టు ఆమె మెళ్లో నువ్వు తాళి కట్టెయ్యడమే. అలాకాక పీటలమీద పెళ్లాగిపోయిందనుకో విరాజితకు ఇక జన్మలో పెళ్లికాదు. ఇప్పటికే ఇల్లొదలి పారిపోయిందన్న చెడ్డపేరొకటుందా. దానికిది తోడయ్యిందంటే ఆత్మహత్యే ఆమెకు శరణ్యం"

"నీ ఫ్రెండ్ చెప్పింది అక్షరసత్యం. పీటల మీద పెళ్లాగడం అనేది ఆడపిల్ల జీవితానికే మాయని మచ్చ. నన్ను చేసుకోడం ఇష్టంలేదని ఇంత స్పష్టంగా తెలిశాక ఇక నేనామెను చేసుకునే ప్రశ్నేలేదు. అలాగని పెళ్లాగిపోతే... విరాజిత చాలా నష్టపోతుంది. ఎలాగూ మీరిద్దరూ ఒకరి నొకరు కోరుకుంటున్నారు గనుక నువ్వే పెళ్లి చేసుకోక తప్పదు"

"మరి ఆమె పిన్ని దీనికి ఒప్పుకుంటుందా? " చినబాబు అలా అడగ్గానే హరేరామ్ ఎగిరి గంతేశాడు.

"ఆమెను... పురుషోత్తమరావుగారే ఒప్పిస్తారు. నువ్వలా చూస్తూండు. సరే... ఆవిణ్ణి పిల్చుకురమ్మంటారా? "

"పిలువ్"

హరేరామ్ పిలవడానికి బయలుదేరబోతుంటే తలుపు తోసుకుని ఆమే లోపలికొచ్చింది. ఆమె వెనకే నాగరాజూ, బలరామ్ వున్నారు.

"మీరేం చెప్పక్కర్లేదు. నాకంతా అర్థమైంది. వీళ్లిద్దరూ గదిలో దూరగానే మా నాగరాజుకు అనుమానం వచ్చి ఓ చెవ్వు ఇటేశాడు. ఏరా... స్కాలర్‌షిప్పంటూ వచ్చి నాకే టోపీ వేద్దామనుకున్నారా? " కొంగు నడుంలో దోపుకుని చినబాబు మీదకు వెళ్ళిందామె.

"వర్ధనమ్మా'' అంటూ అరిచారాయన

ఆయన స్వరంలోని తీవ్రతకు కాస్త భయపడింది వర్ధనమ్మ. "అది పిచ్చిపిల్ల బాబూ! స్నేహితురాలింటికని వెళ్ళినప్పుడేమో వీడు... దాన్ని అమాయకురాల్ని చేసి బుట్టలో వేసుకొనివుంటాడు. దానికి నేను బుద్ధిచెబుతాను. మీరేమీ..."

"కాస్త ఆపుతావా నీ గోల" గదమాయించినట్టు అన్నాడు పురుషోత్తమరావు. "చూడు... జరిగింది చాలుగాని ఈ చినబాబును పెళ్లికొడుగ్గా ముస్తాబు చెయ్యండి. ఈ ముహూర్తానికే విరాజిత పెళ్లి అతన్తో





జరుగుతుంది.

ఒళ్లు మండిపోయింది వర్ధనమ్మకు. ఏదో విరాజిత సాకుతో ఆస్థిపాస్తులన్నీ తను కాజెయ్యాలని చూస్తుంటే ఈ ముసలాడికేం మాయరోగం వచ్చిందీ అని పళ్లు నూరుకుంది.

."నీకేం భయంలేదు. నీకిచ్చిన ఆ లక్షా తిరిగివ్వమని అడగనులే" అన్నారు పురుషోత్తమరావు.



చినబాబు పీటలమీద కూర్చున్నాడు.

పది నిముషాల క్రితమే వర్ధనమ్మ ధోవతి పట్టుకెళుతూ... అక్కడున్న వాళ్లకి ముఖ్యంగా బ్రాహ్మడికి "అనుకోకుండా పెళ్ళికొడుకు మారాడు. మీరు మంత్రాలు చదువుతూ వుండండి. అబ్బాయికి స్నానం చేయించి తీసుకొస్తాను" అని చెప్పి వుండడంతో ఎవరికీ చినబాబు రాక ఆశ్చర్యకరంగా అనిపించలేదు. వర్ధనమ్మ చెప్పిన పెళ్లికొడుకు ఇతనే కాబోలు అనుకున్నారు. చినబాబు వెనకే వీల్ చెయిర్లో పురుషోత్తమరావు కనబడ్డంతో కొందరైతే "పోనీలే పిల్ల కుందనపు బొమ్మ. ఎలాగైతేనేం చివరికి సరైన జోడినే దొరికింది" అని ఆనంద బాష్పాలు కూడా రాల్చారు.

"అమ్మా... పెళ్లికుమార్తెను తీసుకురండి" పురోహితుడు కేకేశాడు.

మెల్లగా నడిపించుకుంటూ వచ్చారు విరాజితను.

చినబాబు విరాజితకేసి క్రీగంట చూశాడు.

ఎర్రటి కంచిపట్టుచీరలో మెడనిండా నగలతో, పూలజడతో నదుట కల్యాణ తిలకంతో అచ్చం కమలంలోంచి అప్పుడే ఉద్భవించిన లక్ష్మీదేవిలా అన్పించింది విరాజిత.

విరాజిత మాత్రం కనీసం కన్నెత్తి కూడా అటు చూడకుండా నిర్లిప్తంగా తలదించుకుని కూర్చునివుంది. ఆమెలో పెళ్ళికొడుకును చూడాలన్న ఆసక్తిగానీ తపనగానీ కనిపించటంలేదు.

బ్రాహ్మడు మంత్రాలు చదువుతూ... తాళిబొట్టును ముత్తయిదువుల చేత తాకించి అక్షింతలు వేయించాడు.

తరువాత దాన్ని తీసి చినబాబు చేతికి అందించబోతుంటే చెప్పాడతను.

"పురుషోత్తమరావుగార్ని ముట్టుకుని ఆశీర్వదించనియ్యండి"

అప్పుడు తలెత్తింది విరాజిత. తనపక్కనే పీటలమీద కూర్చుని వున్న చినబాబునీ, తాళిని తాకి అక్షింతలు వేస్తున్న పురుషోత్తమరావుని మార్చి మార్చి చూసిందామె.

"చినబాబూ తాళి తీసుకో" పురుషోత్తమరావు ఆజ్ఞాపిస్తున్నట్టుగా అన్నాడు.

అప్రయత్నంగా తాళి అందుకున్నాడు చినబాబు బ్రాహ్మడి చేతుల్లోంచి.

"అమ్మా విరాజితా! పెళ్లిళ్లు స్వర్గంలో జరుగుతాయి. నీ పెళ్లి చినబాబుతో ఆ దేవుడెప్పుడో చేసేశాడు. కాబట్టే పీటలమీద నుండి నన్ను తోసేసి అతన్ని కూర్చోబెట్టాడు. మనమంతా నిమిత్తమాత్రులం. దైవనిర్ణయాన్ని తోసిపుచ్చడం మనతరం కాదు" అంటున్న పురుషోత్తమరావుకేసి చూసి మౌనంగా తలదించుకుంది విరాజిత సజల నయనాలతో.

"ఇక కట్టవయ్యా తాళి" బ్రాహ్మడు ఉత్సా

హంగా చెప్పాడు.

"మాంగల్యం తంతునానేనా... మమజీవన హేతునా..."



అప్పుడే తెలతెల వారుతోంది. ఇంకా పూర్తిగా వెలుగు రాలేదు. ఆ మసక చీకట్లో గుమ్మంలో నిలబడ్డ ముగ్గురు మనుషుల్నీ... నిద్రకళ్లతో వచ్చి తలుపు తీసిన ప్రశాంతి కళ్లు నులుముకుని చూసింది.

"లైటు వెయ్యండి" చెప్పాడు ఆ ముగ్గురిలో ఒకడైన హరేరామ్.

లైటువెయ్యని తన మతిమరుపును తిట్టుకుంటూ స్విచ్ నొక్కింది ప్రశాంతి. లైటు వెలుగులో మెడలో పూలమాలలతో ధగధగ మెరిసిపోతున్న ఆ ఇద్దర్నీ చూడగానే తట్టుకోలేని ఆనందంతో పెద్దగా అరిచేసింది.

"చినబాబుకు పెళ్లయింది." అంటూ

ఇంత ఉదయాన్నే వచ్చిందెవరా అని చూడ్డానికి వచ్చిన సౌభాగ్య ఉబ్బితబ్బిబ్బయింది. వెనకే వస్తున్న ప్రభావతిని చూస్తూ సంతోషంగా అంది. "చినబాబుకు పెళ్లయ్యింది" ప్రభావతి శ్రీనివాస్‌తో అన్నది. శ్రీనివాస్ శ్రీధర్‌తో అన్నాడు. శ్రీధర్... శ్రీకాంత్‌కి చెప్పాడు.

ముగ్గురు వదినెలు కలిసి హారతిచ్చాక లోపలికొచ్చి నేరుగా చంద్రకాంతమ్మ గదిలో కెళ్లారు. అప్పటికే ఆమె లేచి కూర్చుని... కాలు కదపటానికి వీల్లేకపోవడంతో అయోమయంగా చూస్తోంది. విషయం అర్థం చేసుకున్న శేషాద్రి ఆనందబాష్పాలు రాలుస్తూ వచ్చాడు భార్య దగ్గరకు.

విరాజితా... చినబాబూ వంగి వారి పాదాలకు నమస్కరించారు. తరువాత వరసగా అన్నావదినల పాదాలకు నమస్కరించారు.

అందరికంటే ఆఖర్న లేచిన అమ్మలూ... అబ్బిగాడూ ఒక్కక్షణం ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఇద్దరిలో ముందుగా తేరుకున్నది అబ్బిగాడే.

"అమ్మలూ! మన బ్రహ్మచారి బాబాయికి పెళ్లయిపోయింది"

చినబాబు అబ్బిగాడి తలమీద మొట్టి సిగ్గుగా నవ్వాడు. అబ్బిగాడు చినబాబువైపు ఓరగా చూస్తూ అన్నాడు, "తొలి సిగ్గులంటే ఇవేనా బాబాయ్? చాలా మనోహరంగా, మధుర మనోజ్ఞంగా వున్నాయ్. అన్నట్టు మనం విజయం సాధించినట్టేగా? "

"లేదు... ఓడిపోయావ్" చెప్పాడు చినబాబు.

"అదేంటి" ఆశ్చర్యపోయాడు అబ్బిగాడు.

"అదంతే మీ పిన్నిని నేను ప్రేమిస్తున్నట్టు నువ్వు నిరూపిస్తేనేకదా... తమరు గెలిచినట్టు" అడిగాడు.

"నేనామెను ముమ్మాటికి ప్రేమించలేదు. ఆమె నన్ను ప్రేమించింది. సో... నువ్వు ఓడిపోయావ్"

"ఇదన్యాయం బాబాయ్. అరిటాకు ముల్లును ప్రేమించినా... ముల్లు అరిటాకును ప్రేమించినా..."

అబ్బిగాడి మాటలు పూర్తి కాకముందే ఫక్కున నవ్వింది విరాజిత.

"అబ్బీ! మీ బాబాయ్ మామూలుగా కాదు ఘోరాతి ఘోరంగా ఓడిపోయారు. మనమే గెలిచాం"

ఆ రాత్రి పాలగ్లాసు అందిస్తున్న విరాజి తనడిగాడు చినబాబు. "నా పెదవులమీద ముద్దిచ్చి... నువ్వేకదా ముందు నన్ను ప్రేమించడం మొదలెట్టావ్. నువ్వా నేనా గెలిచింది? "

"నేను మీకు ముద్దివ్వడానికి ముందు మీరేకదా, నాకు ముద్దొచ్చేలా కనిపించారు. మీ మనసులో నాపట్ల ప్రేమ అజ్ఞాతంగా వుండబట్టే మీరు నాకలా ముద్దొచ్చారు. సో నేనే గెలిచా"

కిటికీలోంచి చూస్తున్న అబ్బిగాడు ఆనందంతో అరిచేశాడు "యువార్ కరెక్ట్ పిన్నీ"










ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా. అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల పెళ్ళి

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

# రచయితలకు మనవి



* 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
* ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
* ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
* ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టల్‌గాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
* సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
* ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర కతలు

## చిట్కా

ఆదివారం వచ్చిందంటే చాలు వీర్రాజుకి ఆ భయంకర సమస్య భీకరంగా వచ్చిపడు తుంది.

మామూలు రోజుల్లో అయితే పొద్దున్నే టిఫిన్ తినేసి, మధ్యాహ్నం భోజనానికి ఓ పెద్ద బాక్స్‌లో కూరఅన్నమో, పప్పు



అన్నమో పెట్టుకుని వెళ్తాడు. మళ్ళీ రాత్రి తొమ్మిది దాటాకే భోజనం.

కాని ఆదివారం వ్యవహారం అలాకాదు. ఆరోజు ఆకుకూరలు, కాయగూరలు బొత్తిగా సయించవు. మేకో, కోడో, చేపో... ఏదో ఒకటి కంచంలో వుండాల్సిందే.

దానికితోడు ఆరోజు వీర్రాజుకోసం అతని భార్య ప్రత్యేకంగా ఏదన్నా స్వీట్ చేసి తీరు తుంది.

ఖాళీగా వుండటంతో కావాల్సినంత తీరిక గనుక పిచ్చ ఆకలి వేసి, అన్నీ సుష్టుగా లాగిస్తాడు.

ఆ తర్వాతే వచ్చిపడుతుంది అసలు చిక్కు!

తిన్నది అరక్క, గొప్ప అనీజీగా వుండి యమయాతన పెట్టేస్తుంది.

ఆ ఆదివారం పొద్దున్నే టిఫిన్‌గా గారెలు వండింది వీర్రాజు భార్య. అందులో నంజు కోవడానికి కోడి పులుసు సరేసరి! మధ్యాహ్నం భోజనం కూడా హెవీ అయిపో యింది కోడి ఫ్రైతో సాయంత్రం టీ సమ యంలో మినప పునుగులు ఎలాగూ తప్పవు. అన్నీ కలిసి భుక్తాయాసాన్ని మరింత పెంచేశాయి. ప్రతి ఆదివారం దాదాపు అంతే! చీకటిపడేవేళకి ఒకటే ఆయాసం... తేన్పులు...

ఏం చేయాలో తోచక వీర్రాజు అవస్థపడు తుంటే అతని భార్య దివ్యమైన సలహా యిచ్చింది.

"అరగాలంటే అలా చల్లగాలికి వెళ్ళి నాలు

గురోడ్లూ తిరిగిరండి! మళ్ళీ దారిలో పానీ పూరీలని, మిర్చి బజ్జీలనీ ఏదన్నా తింటారేమో జేబులో డబ్బు లేసుకోకుండా వెళ్ళిరండి!" అంది.

ఆ సలహా బాగుందని వీర్రాజు అలాగే బయల్దేరాడు. ఆవిడ సంతోషించింది.

రెండు గంటల తర్వాత వచ్చి, మరింతగా ఆపసోపాలు పడసాగాడు వీర్రాజు.

"ఏమైందండీ? " అంది వీర్రాజు భార్య.

"సెంటర్లో ఒ ఫ్రెండ్ కనబడి వాళ్ళింటికి రమ్మన్నాడు. వెళ్ళాక చపాతీలు, రవ్వలడ్డులు, తందూరి చికెన్, పకోడీలు పెట్టి ఓ గ్లాసెడు కాఫీ యిచ్చాడు. వద్దంటే విన్పించుకున్నాడు కాదు, కూడదంటే ఏమనుకుంటాడోనని తినక తప్పలేదు" వాపోయాడు వీర్రాజు.

-పుష్యమి

---

## శతచిత్ర సుందరి

జలజ పది సంవత్సరాల నుంచీ హీరోయిన్ వేషాలు వేస్తోంది. గ్లామర్ క్వీన్‌గానే కాక ఉత్తమ నటిగానూ జలజ అన్ని వర్గాలవారి



ప్రశంసలూ పొందింది.

హీరోలు పాతికేళ్ళయినా ఫీల్డ్‌లో నిలబడగలరు కాని హీరోయిన్లకి పట్టుమని పది సంవత్సరాలు నిలబడే యోగ్యత వుండదనే విమర్శలో అర్థంలేదని జలజ నిరూపించింది. జలజ నటించిన చిత్రాలు బాక్సాఫీసు విజయం సాధించాయి. జలజ నటించే చిత్రాలకు 'హీరోయిన్ ఓరియంటెడ్ చిత్రాలు' అనే ముద్రపడడంతో టాప్ హీరోలు ఆమెతో నటించడం మానేశారు.

హీరోయిన్‌గా వైవిధ్యంగల పాత్రలు పండించడం జలజకు కొట్టినపిండి అయిపోయింది. అందాన్ని, గ్లామర్‌ని జలజ ఏమాత్రం నిర్లక్ష్యం చేయలేదు. 'ఫైవ్‌స్టార్ బ్యూటీ క్లినిక్'కి క్రమం తప్పకుండా వెళ్తూ కనుబొమలనుంచి కాళ్ళగోళ్ళవరకూ ఎంతో శ్రద్ధతీసుకోవడం జలజ విషయంలో కాల్‌షీట్లంత కరెక్ట్‌గా జరిగిపోయేది. ప్రతి సంవత్సరం వేసవి విహారంగా ఫారిన్ కంట్రీలకు వెళ్ళి 'స్పెషల్ స్కిన్ ట్రీట్‌మెంట్' తీసుకోవడంలోనూ జలజ అశ్రద్ధ చేయలేదు.

పది సంవత్సరాలలో నూరు చిత్రాలు





పూర్తిచేస్తూ 'శత చిత్ర సుందరి'గా జలజ రికార్డ్ సృష్టించింది. జలజ నూరవ చిత్రం 'ఆడదంటే ఆటలా?' మొదటి ప్రింట్ వచ్చింది. జలజ ఆ చిత్రాన్ని నిర్మాత, దర్శ కుడు, కెమేరామన్‌లతో తనకోసం ప్రత్యే కంగా వేసిన షోలో చూసింది. జలజ నటించిన మొదటి చిత్రంనుంచీ అన్ని చిత్రా లకు ఛాయారావే కెమేరామన్. బెస్ట్ కెమే రామన్‌గా సినిమా పత్రికల, సాంస్కృతిక సంస్థల, రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల అవార్డులు ఎన్నో ఛాయారావు అందుకున్నాడు.

చిత్ర ప్రదర్శన పూర్తయ్యాక జలజ ముఖంలో కళాకాంతులు అంతగా కనిపించ లేదు. నిర్మాత, దర్శకుడు, కెమేరామన్ ఆ విషయం గుర్తించారు.

"చిత్రం బాగాలేదా?" దర్శకుడు జలజను అడిగాడు.

"చిత్రం బావుంది. హండ్రెడ్ డేస్ పిక్చర్' అంది జలజ.

నిర్మాత హండ్రడ్ డేస్ సెలబ్రేషన్ ఆలస్యం చేయకుండా ఆనందంతో ఊహిం చుకున్నాడు.

జలజతో చనువు తీసుకోగల ధైర్యం వున్న కెమేరామన్ ఛాయారావు "మేడమ్ మరి అలా వున్నారెందుకు" అని అడిగాడు.

జలజ ఛాయారావుని పక్కకు పిల్చి "ఈ చిత్రంలో మీవర్క్ అంతబాగా లేదనిపి స్తోంది. నా మొదటి చిత్రం 'ఆడది అంద గత్తె'లో మీ వర్క్ చెప్పలేనంత బావుంది. ఆ చిత్రంలో నా అందం చూస్తే నాకే అసూయ వేసింది. మరి ఇప్పుడో ఈ చిత్రంలో" అంది.

"మీరన్నది నిజమే మేడమ్. అప్పుడు నేను పదేళ్ళు చిన్నవాడిని గదా" అన్నాడు ఛాయారావు.

**-తాజీప్రసాద్**

---

## బాతు ఖరీదు

**కేంప్**‌కి వచ్చిన సుబ్బారావుకి తెలిసింది, కొద్దిదూరంలో వున్న ఆ చెరువు సంగతి. అతనికి ఎప్పటినుంచో వేట హాబీ. ఆ చెరువు నిండా బాతులుంటాయని తెలీగానే తన పాయింట్ ఫోర్‌నాట్‌ఫోర్ రైఫిల్‌ని క్లీన్‌చేసి దాంట్లో తూటాలుంచాడు.

"సర్... ఆ బాతులని కాలుస్తారా?" అడిగా డు డాక్ బంగ్లా కేర్ టేకర్ సంగతి తెలియగా నే.

"అవును రాత్రికి డక్ సిక్స్‌టీ ఫైవ్ చేద్దువు



గాని'' చెప్పాడు సుబ్బారావు నవ్వి.

"ఆ బాతుల యజమానుల అనుమతి లేకుండా వేటాడితే చిక్కుల్లో పడతారు. ముందర వాళ్ల అనుమతి తీసుకోండి'' హెచ్చరించాడు కేర్ టేకర్.

సుబ్బారావు ఆఫీస్‌జీప్‌లో తుపాకితో చెరువుగట్టుకి చేరుకున్నాడు. ఎకరం విస్తీర్ణంగల చెరువులో పాతిక ముప్ఫై బాతులు కనపడ్డాయి. ఆ చెరువు గట్టున వున్న ఓ పెద్దమనిషి, పక్కనే వాటికి తెచ్చిన ఆహారం బుట్ట కనపడ్డాయి.

సుబ్బారావు తుపాకితో అతని దగ్గరకెళ్లి చెప్పాడు. "సార్ నాకు వేటాడటం సరదా. ముఖ్యంగా సిటింగ్ డక్స్‌ని. నా గుండు తగిలిన ప్రతి బాతుకి పాతిక రూపాయలిస్తాను. మీకు సమ్మతమేనా?"

పెద్దమనిషి అంగీకారంగా తల ఊపాడు.

సుబ్బారావు హుషారుగా ఒక్కో బాతుకి తుపాకి గురిపెట్టి కాల్చసాగాడు. అలా ఎనిమిది గుళ్లు పేలాక నాలుగు బాతులు చచ్చాయి. వాటిని జీప్‌లో వేసుకున్నాక లెక్క చెప్పి వంద రూపాయలు ఇచ్చాడు సుబ్బారావు. తర్వాత కొద్దిగా ఎకసెక్కంగా నవ్వుతూ చెప్పాడు ఆ పెద్ద మనిషితో.

"మీకు బేరం ఆడడం రాదుసార్! బాతుకి ఏభై అడిగినా మాట్లాడకుండా ఇచ్చేసేవాడిని''

ఆ పెద్దమనిషి చిన్నగా నవ్వి చెప్పాడు, "ఆ బాతులు నా స్వంతమే అయితే మీరు చెప్పినట్లుగా బేరం ఆడేవాడిని''.

సరిగ్గా ఆ సమయంలో ఇంకో జీప్‌లోంచి దిగాడు ఆ బాతుల అసలు యజమాని, వెంట ఇద్దరు గూండాల్లాంటి దుబ్బుమీసాల వస్తాదుల్తో.

-ఎం.లిపి

---

## హామీ

"ఏమండీ మీ కథను పోస్టుచేసి నెల దాటినట్లుంది. ఉత్తరం ఏం లేదా? " అడిగాను శ్రీవారిని!

"రాలేదులే" అన్నారాయన.

"రిజిస్టరు పోస్టులోనే పంపారుగదా! అందిందో లేదో? "

"రిజిస్టర్డ్‌గా కాక మామూలు డబ్బాలో పడేస్తాననుకున్నావా? మిస్సయితే ఇంకేమయినా ఉందా? "

"ఆ కథ అచ్చవుతుందంటారా? "

"ఏం నీకనుమానంగా ఉందా? ఇంత వరకు నేను రాసిన కథలేమన్నా తిరిగొచ్చాయా? "

"లేదనుకోండి! కానీ ఈ కథలో హీరోయిన్‌ను పెళ్లీ పెటాకులు లేకుండా వదిలేయటం పాఠకులకు అసంతృప్తిని కలిగిస్తుందేమోనని"

"ఏం కాదు. పాఠకుల అసంతృప్తి ఎవరిక్కావాలి? నా తృప్తి నాకు ముఖ్యం. నా కథలో హీరోయిన్ కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడి ఉండే ఉన్నతమైన వ్యక్తిత్వం గలది. అందుకే పెళ్లి వద్దనుకుంటుంది"

"పెళ్లికీ సిద్ధాంతాలకు సంబంధమేమిటి? పెళ్లయితే సిద్ధాంతాలు పాటించకూడదా ఏం? "

"పెళ్లయితే ఆ సిద్ధాంతాలను భర్తగారి పురుషాహంకారం అనేది తన కాళ్లక్రింద నలిపేస్తుంది"

"మీరేకదా ఉన్నత వ్యక్తిత్వం అన్నారు. అంత సులభంగా పురుషాహంకారం పాదాల క్రింద... అహా... ఇది నా అనుమానం కాదు... పాఠకులది"

"నీ అనుమానాల్తో నన్ను విసిగించకు"

"మరి కథ ఖచ్చితంగా అచ్చవుతుందన్న నమ్మకం మీకున్నపుడు మీరెందుకలా... ఆ కథ పంపించినప్పటినుంచి ఏదో పోగొట్టుకున్న వారిలా భారీగా, మూడీగా ఉంటు





న్నారేం! ఆరోగ్యం బాగాలేదా? మీ ఈ ముభావానికి కారణమేమిటి? మీ చిన్నప్పటి లవర్ దీనస్థితిలో కనిపించిందా? లేక ఏవైనా ఫ్లాష్‌బ్యాక్ సుడులు తిరిగిందా? "

"నోరుముయ్యి! ఈ రోజు పోస్టు వచ్చిందా? "

"అబ్బే లేదే! పత్రికనుంచేనా? మీకథ పోవాలి"

"అదేంటి! కథ తిరిగొస్తే బాధపడటం పోయి ఇంత సంతోషిస్తున్నారు? "

"అదంతేలే! ఈ కథ కేవలం నాకోసం రాసుకున్నాను. అందుకే హామీ పత్రంలో ఏం రాశానో చూడు"

"'ఈ కథ నా స్వంతం! అనువాదం అను



గురించేనా? "

"అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పు చాలు" విసుక్కున్నారు శ్రీవారు.

★ ★ ★

"ఏమండీ! మీకథ తిరిగొచ్చింది!"

"హమ్మయ్య! వచ్చిందా! ఇక నాకే దిగులు లేదు. అన్నంపెట్టు. ఆకలేస్తోంది. తిని నిద్ర కరణ కాదు. నాకోసం రాసుకున్నాను. పత్రికలవారి కోసం కాదు. అసలు పత్రికలకు పంపటం, అచ్చువటం నాకిష్టంలేదు. ఇది నా హామీ పత్రం!' అంటూ రాశారేంటండీ!"

"ఏదిఏమైనా నా కథ నా దగ్గరకు చేరింది. నేనిపుడు హ్యాపీ!"

**-ఎ. జయలక్ష్మిరాజు**

---

## స్పిరిట్

ప్రఖ్యాత క్రికెటర్ బజారుద్దీన్ క్రీజులో నిలబడినా చాలా ఆందోళనగా వున్నాడు.

అతని సమస్య ఇండియాని ఎలా గెలిపించాలన్నదికాదు... తన ఫియాన్సీ బూజులానీ షూటింగ్‌నుండి డైరెక్ట్‌గా ఇక్కడికొస్తానని చెప్పింది. ఈ పరిస్థితుల్లో క్రికెట్ ఆడాల్సి రావటం ఆయనకి బోర్ కొడుతోంది.

ఆమె పక్కన కూర్చుని ఐస్‌క్రీము తింటూ, కబుర్లు చెప్పుకుంటూ మిగతావాళ్ల ఆట చూడాలని ఉవ్విళ్లూరుతున్నాడు. కానీ ఆమె వచ్చే సూచనలేవీ కన్పించడంలేదు.

అరే 'బజ్జూ అచ్ఛాఖేల్ కరో' గాలరీనుంచి ఎవరో అరుస్తున్నారు. అవతలనుంచి వెస్టిండీస్‌వాళ్లు బంతుల్ని అగ్నిగోళాల్లా విసురుతున్నారు. బూజులానీ వచ్చేవరకైనా స్టంప్స్

పడిపోకుండ జాగ్రత్తపడుతున్నాడు బజారు ద్దీన్.

'ఏమిటఱ్రా... ఆ జిడ్డాట... కొడితేనే, కొట్టగలిగితేనే ఆడు. లేకపోతే వచ్చేసెయ్!' ప్రేక్షకుల్లోంచి అసహనంగా అరిచారెవరో.

ఇంతలో బాల్ వచ్చింది డిఫెన్సు ఆడాడు. జనాల్లో నిరాసక్తత. ఈయనగారి ఆలోచనలు మాత్రం బూజులానీ మీద.



కాసేపటి తర్వాత డ్రింక్స్‌కి టైమ్ ఇచ్చాడు ఎంపైర్. పెవిలియన్‌నుంచి వచ్చిన తోటి క్రికెటర్‌ని అడిగాడు 'బూజులానీ రాలేదా!' అని

"వచ్చింది! కానీ ముసల్మాన్‌ఖాన్‌తో చెట్ట పట్టాలేసుకొని వెళ్లిపోయింది" అన్నాడు.

బజ్జు పళ్లు కొరికాడు. ముసల్మాన్‌ఖాన్ హిందీ సిన్మాల్లో పేరున్న ప్రముఖ హీరో.

"బాగా ఆడమని నీతో చెప్పమని మన మేనేజర్ చెప్పాడు" అంటూ ఆ క్రికెటర్ వెళ్లి పోయాడు.

ఆ తర్వాత ప్రత్యర్థులు విసిరే బంతినే ముసల్మాన్‌ఖాన్‌లా వూహించుకొని చితక బాది పారేశాడు. వరుసగా ఫోర్లు, సిక్సర్లు. గ్యాలరీలో సంచలనం బయలుదేరింది.

ఆవిధంగా భారత జట్టు విజయానికి కారకుడయ్యాడు బజ్జూ. ఆఖరి బంతి సిక్సర్ కొట్టి బ్యాట్ భుజాన వేసుకొని పెవిలియన్ వైపు వచ్చాడు, "ఏడీ.. ఎక్కడ ముసల్మాన్ ఖాన్, వాణ్ణి నా బ్యాట్‌తో చితగ్గొట్టేస్తాను" అంటూ.

మిగతా క్రికెటర్లు, మేనేజరు నవ్వుతూ "నీలో పౌరుషం రావాలనీ, స్పిరిట్ రేకెత్తాలనీ మేమంతా అలా అబద్ధం చెప్పమన్నాం. నీ బూజులానీ ఇక్కడే వుంది. వెళ్లి చూడు... ఆమెతో ఎవరూ లేరు" అన్నారు.

-కె. శివసుబ్బారావు

Edited. Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

...ATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78